

అనసూయ సీతను దీవించుట

౬.

ఎంతటి పుణ్యశీలవొకదే జనకాత్మజ! సాధ్విధర్మ మే
కాంతముఁబూని బంధులను గల్మిని సౌఖ్యముఁబాసి మాన మా
పంతయు లెక్కసేయక వనావళికిన్ వ్రతివానివచ్చు నీ
కాంతునితోడ వచ్చితివి కామినులిట్టిరుగల్గిరే భువిన్?

నగరస్థుఁడో విపినస్థుఁడో
యగుణియొ నిర్ధనుఁడో ఖలుఁడో యతికాముకుడో
మగవాలికిఁ దనపతియే
సుగతికిఁగారణ మతండచూడ్దైవంబున్.

సుమతిని బుట్టినింటికిని జొచ్చినయింటికిఁ గీర్తిదెచ్చు నా
సుమహితసద్గుణప్రకరశోభిత సన్నుతశీల సాధ్వి యు
త్తమయశముం బడంపడి నితాంతశుభంబునుబొంది నాకసౌ
ఖ్యముఁగనుఁగాన భర్తృహితకారిణి చరియింపు మంగనా!

—శ్రీ వావిలికొలను సుబ్బారావు.




## కీ. శే. దరిశి అన్నపూర్ణమ్మ

క్రీస్తుశకము 1907-న సంవత్సరమున ఈమె బళ్లారిలో నొకానొకఉత్తమవైశ్యకులమున జన్మించినది. ఈమెతల్లి గొప్పవేదాంతజ్ఞానముకలది; సంఘసంస్కరణమునందు సమగ్రమగు ఆసక్తిగలదు. తల్లిచాలు బిడ్డకుతప్పదుగావున అన్నపూర్ణమ్మయు జ్ఞానవతియు, సంఘసంస్కర్త్రియునై వెలసినది. తనకుగల సంఘసంస్కరణాభిమానమును ఈమెతల్లి ఈమెను సంఘసంస్కరణమునందు కీర్తివహించిన శ్రీ దరిశి చెంచయ్యగారికిచ్చి వివాహము చేయుటయందును, తనరెండవకుమార్తెను రజస్వలానంతరవివాహమునకై నిలిపి మదనపల్లి కళాశాలయందు చదివించుచుండుటయందును చూపినది. వైశ్యకులములో రజస్వలానంతర వివాహమును ప్రారంభించినది అన్నపూర్ణమ్మగారితల్లియేయనుట సత్యదూరమనిపించుకొనజాలదు.

అన్నపూర్ణమ్మ పిన్నతనముననే ఆధ్యాత్మికవిషయములందు అత్యుత్సాహమును చూపునది. ఆవిషయకములగు ఉపన్యాసములనిచ్చునది. ప్రేక్షకుల క్లిష్టమైనప్రశ్నలకు తృప్తికరమైనజవాబుల నిచ్చుచుండునది. దివ్యజ్ఞానసమాజసభలయందు ఈమె ఇచ్చిన ఉపన్యాసములు పెద్దలమన్ననలకు పాత్రమైనవి. సికింద్రాబాదునగరమున విద్యార్థినిగనుండు నపుడు ఈమె పాఠశాల వార్షికోత్సవసందర్భమున ఆడబడిన ప్రహ్లాదనాటకమునందు లీలావతి పాత్రమునుధరించి శ్లాఘాపాత్రముగ నిర్వహించి శ్రీమతి సరోజనీనాయుడుగారిభర్తవలన రజితపాత్రబహుమానమునందెను. బళ్లారి కాన్వెంటుపాఠశాలయందు, తిరువల్లిక్కేణి బాలికల ట్రెయినింగుకాలేజీయందు, గుంటూరు శారదానికేతనమునందు విద్యాపూర్తిగావించినది. చెన్నపురిలో ప్రథమఆర్యవైశ్యయువజనమహాసభ యాజమాన్యమున జరుపబడిన ఆశుధారోపన్యాసముల పోటీపరీక్షయందు అగ్రసరురాలై సువర్ణపతకమునందెను. భర్త చెంచయ్యగారు తలపెట్టిన సకలమైన ఉద్యమములకు ప్రోత్సాహశక్తి ఈమెయే. బెజవాడ మహిళా

సమాజమునకును, బెజవాడనగరమునజరిగిన ఆంధ్రమహిళాసభకును అన్నపూర్ణమ్మ కార్యదర్శినిగానుండెను. 1929 లో బొంబాయియందు జరిగిన అఖిలభారతమహిళామహాసభకు ఎన్నుకొనబడిన తెలుగుదేశపు ప్రతినిధురాండ్రలో ఈమెయొకతె. ఆంధ్రస్త్రీ లీమె సేవాదీక్షను గమనించిరనుట కిది యొకనిదర్శనము.

అన్నపూర్ణమ్మ, చెంచయ్యగార్లు ఇటీవల కొన్నిసంవత్సరములలోనే బ్రాహ్మణ, వైశ్య, కమ్మ, విశ్వబ్రాహ్మణవితంతుబాలికలకు పదునెనమండుగురకు వివాహములు గావించిరి. ఈవిషయమున ఈపుణ్యదంపతులు వీరేశలింగముపంతులు, రాజ్యలక్ష్మమ్మగార్లను పోలుచున్నారు. వితంతువులను పోషించిరి. పతితస్త్రీలను ఉద్ధరించిరి. ద్రవ్యసాహాయ్యము చేసి వితంతువులకు విద్యచెప్పించిరి. ఇచ్చు పోషణమున జాతివివక్షతలేదు. చేయు పెంపకమున అస్పృశ్యతలేదు. తమగృహము అతిథిసత్కారములకు అనువైనగృహము.

స్త్రీపురుషులకు సమానమైన హక్కులు, సమానమైన బాధ్యతలు ఉండవలయునని వాదించువారిలో అన్నపూర్ణమ్మయొకతె. అననుకూలదాంపత్యమున అటమటించుటకంటె వివాహవిచ్ఛేదమునందుటయే వ్యక్తికి, సంఘమునకు శ్రేయమని ఈమెనిశ్చయము. 1930-వ సంవత్సరమున ఈమె పతితోబాటు లవణసత్యాగ్రహమున పాల్గొనినది. దేశమునకై దివ్యత్యాగముచేసినది. పొరపొచ్చెములులేని అనుకూలదాంపత్యమునకు అన్నపూర్ణమ్మ చెంచయ్యదంపతులు నిదర్శనమైయుండిరి.

తాను పుట్టువుగన్న వైశ్యసంఘమువారిచే నిర్వహింపబడుచున్న 'వాసవి' మాసపత్రికలో చక్కని సాంఘికకథలను, వ్యాసములనువ్రాసి వైశ్యులకు నవీనసాంప్రదాయములను బోధించినది. గృహలక్ష్మికిగూడ ఈమె వ్యాసభూషల సర్పించినది. నేర్చినవిద్యను వ్యాసరచనావ్యాసంగమున మెఱుగులుదిద్దినది.

ఈనడుమ బందరునందు జరిగిన వైశ్యవితంతూద్వాహమునకు జనియుండి నవంబరు 24-వతేదీని అన్నపూర్ణమ్మ మద్రాసువచ్చెను. వచ్చిననాడే జ్వరముతగిలెను. మఱినాలుగు రోజులకు 28-వతేదీని మధ్యాహ్నము 12-30 గంటలకు జనరల్ఆస్పత్రియందు హృదయపీడనముచే చనిపోయెను. అయిదేండ్లకొమారైయొకతె, ఎనిమిదిమాసముల పసికూనయొకతె ఇరువురే ఈమెకు సంతానము. చనిపోవునరికి ఈయమకు ఇరువదియైదు సంవత్సరములు. ఇట్టిదే వైదుష్యము, ఇట్టిదే సంఘసంస్కరణాభిలాష, ఇట్టిదే దేశహితకాంక్ష, ఇదే పేరు. శ్రీ మాగంటి అన్నపూర్ణాదేవియు ఇదేవయసున చనిపోయెను. ఆంధ్రుల దురదృష్టము.

ఈవిదుషికి, ఈసంఘసంస్కర్త్రికి, ఈదేశభక్తురాలికి స్మారకచిహ్నము నెలకొలుపుటకు కనకదుర్గాక్షేత్రమగు బెజవాడయందు ప్రయత్నములుసాగుచున్నవి. అవి అచిరకాలముననే ఫలోదయాంతమగుగాక! శ్రీమతి దరిశి అన్నపూర్ణమ్మగారి పవిత్రాత్మ శాంతిధామమున నెలకొనుగాకయని ఆంధ్రస్త్రీలోకముతరపున భగవానుని ప్రార్థించుచున్నాము.

# శారదలేఖలు

శ్రీ భాగ్యవతియగు కల్పలతకు:—

నెచ్చెలీ! క్షమింపుము. నీవుత్తరమును బుట్టదాఖలుచేసితివనుకొనుచుంటివో, నాకిచ్చిన వాగ్దానము మఱచిపోయిన దనుకొనుచుంటివో, ప్రియస్నేహితురాలనగు నన్నుగూడ విస్మరించునంతటి అయిశ్వర్యము మాశారదకేమియబ్బినదనుకొనుచుంటివో ఎటుల భావించినను సరియే, ఏమియనినను సరియే రాజ్యలక్ష్మికి నేనువ్రాసిన జాబును ఇదిగో పంపెదనని వాగ్దత్తముచేసి మూడుమాసములకు జవాబొసంగుచున్న నేను నీఆగ్రహమున కెంతయైన తగియేయున్నాను. ఏమిచేయుదును! ఏదినమునకాదినము నేడుతప్పక కల్పలతకు జాబువ్రాయవలయుననుకొనుటయు ఆసమయమునకేదియో యూహింపనిక్రొత్తపని తటస్థపడుటయు నీకుజాబుపంపుపని అడుగునబడుటయు యిట్లు విచిత్రముగాగడచిపోయినవి తొంబదిదినములు. అహో! నాఅలసభావముతలంచుకొనిన నాలో నాకే బిడియమగుచున్నది. అయితే, ఇంతకును రాజ్యలక్ష్మికి నేనువ్రాసినజాబునకు నీకుగూడ నొకకాపీవ్రాసిపంపుటయే గాని నేను క్రొత్తగావ్రాయనెంచినదిగూడలేదు. దానికే యిన్ని అడ్డంకులు. రాజ్యలక్ష్మి నాకువ్రాసినజాబు చూచితివిగదా. ఆమెకిట్లు ప్రత్యుత్తరమువ్రాసితిని.

"చి. రాజ్యలక్ష్మికి,

సోదరీ! నీవువ్రాసినయుత్తరము తిలకించితిని. పూర్ణమ్మ అవమానమునకు చింతింపకు. లోకవంచకులగు వారికట్టిపరాభవము లెప్పుడును సహజములే. కాని అది యొకయుదాహరణముగాగొని అత్యంతనైరాశ్యముతో అయితే యికమాగతేమిటి యని నీవువేసినప్రశ్న నామానసమును కలంచివైచుచున్నది. అడిగినదానవు నీవొక్కరితేవేఅయినను యీభారతవితంతుమండలివాణియు నీలో ఐక్యమైనట్లుగా నాకుదోచుచున్నది. మనదేశమునందు నీవలెనే లక్షలకొలది బాలవితంతువులు నానాకడగండ్లుబడుచు అనవరతము మాగతేమిటని రోదించుచు నిస్సహాయలై దిశలుపరికించుచున్నప్పుడు యిది నీయొక్కరితమాటగా నేనెట్లుభావింతును? అవును సోదరీ! నీవట్లుప్రశ్నించుటలో తప్పులేదు. ఎప్పుడు నీవు విగతభర్తృకవైతివో అప్పుడే హిందూసంఘమంతయు నీపై నిర్దయాత్మకమైనదృష్టులనుబఱపును. ఎటుజూచినను నీమార్గము కంటకయుతమైచూపట్టును. మతము తననియమములచేనిన్ను నిర్బంధించును. సంఘము నిన్ను తనపాశములచే కట్టివేయును. ఆచారములు నీకు చరణశృంఖలలగును. అత్తవారు నీకడుపునుగొట్టుట కుద్యుక్తులగుదురు. తలిదండ్రులు నీచాకిరీకి తనియుకుందురు. సోదరులు నిన్నుదాసీనపఱతురు. నానాశాస్త్రంబులుజదివి, నానాసాధనలుచేసి, అడవులలో కాయగసురులుమెసవుచు తపంబునేసెడి మహర్షులకుసైతము దుర్లభంబైన బ్రహ్మచర్యవ్రతము ఏసంస్కారమునుబొందని నీతలపైబడును. దీనికించుకదప్పితివా? అధఃపాతాళమునకు కూలిపోవుదువు. ఇన్ని అనివార్యక్లేశములు నిన్నుచుట్టిముట్టియుండగా నీవు తల్లడించుచిత్తముతో నాగతేమిటి? అనిప్రశ్నించుటలో దోసమేమి? అయితే ఆమహోపద్రవగృహమునువీడి, ఆఆచారశృంఖలల నించుకతొలగించుకొని, ఆసాంఘికపాశముల రవంతత్రెంచుకొని యొక్కమాఱు నీపునీతదృష్టిని నీజన్మసీమపైబఱపుము. అహో! నీజన్మను సార్థకమొనర్చుకొనుటకు ఎన్నిత్రోవలుగాన్పించునో? సోదరీ! నీకుసంభవించిన వైధవ్యమునకు కారకుడుదైవమని

దైవమునుదూరినను, మనుజుడని మానవునిదూరినను ప్రయోజనములేదు. దాన నీకష్టములు తొలగబోవు. ఏమైన నేమి? సంసారజంజాటమునుండి నీవు తొలగింపబడితివి. విరాగజీవితము నీతలపైబడినది. ఇంకను నీవు పట్టి దానవై ఏయన్నదమ్ముల ఏయక్కచెల్లెండ్ర ఏబావలమఱదుల క్షుద్రసంసారములభారమునో నీతలపైవేసికొని యేలయల్లాడెదవు? ఎప్పుడు నీసంసారముభగ్నమైందో అప్పుడే నీవు విశ్వకుటుంబమునకుజెందితివి. కావున యీవిశాలవిశ్వమునందలి స్త్రీపురుషులెల్లరు నీకు స్వకుటుంబములోనివారు. వారినెల్లర నీవు ఉద్ధరించుటకు బూనుకొనవలయును. నీవు బ్రహ్మచారిణివి. అనాఘ్రాతకుసుమవు. నీతిధర్మములరెంటిని అంగరక్షకులనుగా బెట్టుకొని సేవావ్రతమునుబూని కార్యక్షేత్రమున బ్రవేశించుము. సోదరీ! దూరముపోనవసరములేదు. నీదేశమునందే నీస్త్రీజాతివంకనే దృష్టినిసారించుము. ఎన్నికార్యరంగములు నిన్నాహ్వానించునో!

సోదరీ! అదిగో చూడుము. ఇతరదేశములలో స్త్రీలు నూటికి నూర్వురుచదువుకొనినవారే. నీదేశమునందో, నూటికి 1.5 అనగా నూటికిద్దరైనను చదివినవారులేరు. నీజాతియిట్లు అవిద్యాంధకారమున గొట్టుకాడుటకంటె మిన్నయగు నధోగతియేమున్నది? వీరి అవిద్యబాపుటకు నీవు కృషిచేయవచ్చునుగదా.

సోదరీ! యిటుచూడుము. ఇంగ్లాండుమున్నగు పశ్చిమదేశములలో వేయికి అరువదిమందియే శిశువులు గతించుచున్నారు. నీదేశమునందో వేయింటికి 250. అకటా! జాతిక్షీణతకింతకంటె అధికమగుదుర్దశ వేరొండు గలదా? శిశుచికిత్సనభ్యసించి నీవు వీరియసువులనిలుపరాదా?

సోదరీ! మఱొకదెసతిలకింపుము. వారేబాలింతలు. ఒక్క మన చెన్నరాజధానియందే 1929 లో మరణించిన బాలింతలసంఖ్య 3000. అకటా! యీదుస్థితిదలంచిన కడుపుచెఱువగును. వీరిలో ముప్పాతిక మువ్వీసము పల్లెటూరులలో చాకలి, మంగలి, వడ్డె, గమళ్ల, తురక, దూదేకు మున్నగు అజ్ఞానజాతులకుజెందిన మొరటుమంత్రసానుల మోటుచేష్టలకు బలియైనవారే. తాలూకాకొక మంత్రసానియున్నదని యీతాలూకా పట్టణమునకేచాలదు. ఇక తాలూకాకంతకును నేమి సహాయముచేయును? సోదరీ! నీవీమంత్రసానిశిక్షణము బడసినచో నీసోదరీమణులెందరకో ప్రాణదానముచేయవచ్చునుగదా?

సోదరీ! ఈయొక్కబాలెంతలేనా కష్టపడుచున్నవారు? కాదు; కాదు, "చావనైనచచ్చెదనుకాని మారోగమిదియని పరపురుషులకు చెప్పజాల"మని యనేకరహస్యవ్యాధులచే గాసిల్లుచు ఏటేట మృత్యుగహ్వరముజొచ్చుచున్న మానవతులెందరు? సోదరీ! నీవు వైద్యవిద్యనభ్యసించినచో ఈమానవతులకెంత యుపకారకము?

సోదరీ! ఆచక్కిచూడుము. వారు నీవలెనే వైధవ్యదుఃఖముచే దందహ్యమానలగుచున్న బాలవితంతువులు. పదునైదేండ్లలోపువారే మూడులక్షలు. వారి అవిరళాశ్రుధారలచే సిక్తమగుచుండుటచేగాబోలు యీభారతావని ఒకనాటికిని సుఖస్థితికిరాకున్నది. వారికి పునస్సౌభాగ్యములనుగల్పించుటో, లేక సేవావ్రతులనుగా జేయుటో చేసిన దెంతపుణ్యము!

సోదరీ! ఆవంకచూడుము నెన్నునంటినపొట్టలు. శతధాచిఱిగిన కట్టువస్త్రములు, వెంట ఆకలేఅమ్మా! అనియేడ్చేబిడ్డలు. అదియేమందువు? ఆర్థికదారిద్ర్యము. యుగయుగములనుండి నీస్త్రీసంఘమునకు ఆర్థికాధికారము తొలగింపబడినది. ఒక్కపైసకుపైతము నీవుబరులకు చేయిచాపవలసినదే. ధనములేనిస్వాతంత్ర్యము స్వాతంత్ర్యముగాదు. సోదరీ! నీవీవిషయముపై కృషిచేయరాదా?

సోదరీ! ఈదెసచూడుము. స్త్రీలబలవన్మరణములు. ఏమి దీనికికారణము? అత్తలరాయిడి, మగలనిరంకుశత, బాలికనిస్సహాయత. వివాహకాలమునాటికట్నము పూర్తిగాచెందలేదనియో, భార్యతాలూకుసొమ్ము నప్పుడే తాచప్పరించుటకు వీలుగాలేదనియో ఏదియోకారణము. స్త్రీల బ్రదుకుకేహాని. ఈదేశమునందు

అత్తలకోడండ్రసామరస్యము వినము, కనము. అటులని కూడియుండకనుతప్పదు. అత్తయెప్పుడును తనక్షేమము కోరదని కోడలినమ్మకము. కోడలెప్పుడును హానినికినాశించదని అత్తఅభిప్రాయము. ఈపొరపొచ్చెములు మనదేశమునందలి ప్రతిచిన్నసంసారమునందును వేరూనియున్నవి. ఈపరస్పరావిశ్వాసమువలన భూతల స్వర్గముగానుండవలసిన ప్రతిగృహము నరకసదృశమైపోవుచున్నది. ఉల్లాసకరమైన పడుచుప్రాయమున మన దేశపు యువతులవలె రాయిడిపడుచున్నవారు ప్రపంచమున నెచ్చటనులేరు. సోదరీ! నీవీకార్యక్షేత్రమున ప్రవేశించి వీరిలో సామరస్యము పెంపొందుటకు యత్నింపరాదా?

సోదరీ! ఆదెసల నుపలక్షించుము. ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలను క్రూరులగుతలిదండ్రులు ముసలి వారికెట్లు విక్రయించుచున్నారో. ఆడుపిల్ల జడవస్తుసముదాయములలోనొకటియని వారిఅభిప్రాయము. సోదరీ! ఇట్టి నిర్దాక్షిణ్యపు తలిదండ్రులమానసములు దయార్ద్రములగునట్లు కృషిచేసిన నీకెంతపుణ్యము?

సోదరీ! అనాదినుండియు గృహపరిశ్రమలు, లలితకళలు స్త్రీలసొత్తు. స్త్రీలకును చతుష్షష్టికళలున్నవి. అలనాడు ఢక్కామజిలినులకు నూలునుతయారుచేసినవారును, రాజాధిరాజులు ధరింపతగిన జరీబుటేదారిపని చేసినవారును, చిత్రవిచిత్రములగుశిల్పములను చిత్రములనువిరచించినవారును స్త్రీలేగదా. నేడు హిందూస్త్రీ ఒక్కముగ్గుపెట్టలేదు. ఒక్కబొమ్మగీయలేదు. ఒక్కపాటపాడలేదు. ఒక్కమాలకట్టలేదు. ఒక్కకుట్టు కుట్టలేదు. ఒక్కఅల్లికఅల్లలేదు. ఒక్కవంటకముపండలేదు. ఒక్కపద్యమువ్రాయలేదు. ఒక్కపూలమొక్కకు దోహదముచేయలేదు. ఇకచాయలు, సుగంధతైలములు, అత్తరువులు, నలుగుపిండ్లు, కాటుకలు, కుంకుమలు మున్నగు గృహపరిశ్రమలసలే విస్మృతములైపోయినవి. సోదరీ! నీవీకళలనభ్యసించినచో నీస్త్రీలోకమునం దీకళల బునరుజ్జీవింపజేయవచ్చునుగదా!

సోదరీ! మనస్త్రీలయందింకను మూఢనమ్మకములు నశింపలేదు. దంభాచారులను విశ్వసించికొల్చుటలు పోలేదు. ఎవ్వడైనను మొగమున పట్టెడు కుంకుమబొట్టుపెట్టుకొని బవిరిగడ్డము రుద్రాక్షలతో వూళ్లోకివచ్చెనా? ఇకవానిచుట్టు మూగుదురు. తాయెత్తులు, రక్షరేకులు, వేరులు, మంత్రతీర్థములు ఇచ్చెడువారు గన్పడిన మన వారికి గంగవెఱ్ఱులెత్తును. వాడు బిచ్చమెత్తుకొను బైరాగేగాని మఱిఅంతకంటె అధముడేకాని యేకులమువాడు గాని, రొట్టెవాడుగాని వానికి పాదాక్రాంతులగుదురు. వీరికి వాంఛనీయఫలములు సాధారణముగా రోగ నివృత్తి, సంతానప్రాప్తి మున్నగునవి. ఒక రొకరివలన మోసగింపబడినారు అనివినుచున్నను మనస్త్రీల కిట్టివారి యందుగల నమ్మకము అత్యధికము. సోదరీ! మనదేశమింకను మౌఢ్యదేవతకాలవాలమైయున్నదనుట కిది ప్రబల మగుతార్కాణ. వీరుగాక మఱొకరున్నారు. వీరుసూటిగాజనులను పునరావృత్తిరహితమగు మోక్షసామ్రాజ్య మునకు రవాణాచేసే వేదాంతులు. శనగలునమలుచు ఉలవలుచేతబెట్టువారు వీరు. స్త్రీలోకములో ఈకపట వేదాంతులకున్న పలుకుబడి అన్యులకులేదు. లోకులను వంచించుటకు ఈవేదాంతోపదేశమువంటి మచ్చుమందు వేఱొకటిలేదు. తమదోషములను కప్పిపెట్టుకొని లోకులకు మంచివారమని భ్రమగొల్పుటకు ఈవేదాంత విచారణ మంచిమఱుగు. ఎట్టికపటులుగాని ఎట్టిదుర్మార్గులుగాని ఈవేదాంతపుముక్కలు నాల్గునేర్చుకొనిరేని ఇకవారినిబోలిన పెద్దలులేరు. భగవద్గీత, పంచదశి, సీతారామాంజనేయము మున్నగు ప్రసిద్ధవేదాంతగ్రంథము లిట్టికపటవేదాంతుల చేతులలోబడి మాలిన్యమునందుచున్నవి. నీవు ఒక్కపూర్ణమ్మనుగూర్చి వినియే యింత ఆశ్చర్యము నందుచున్నావుగాని యిట్టిపూర్ణమ్మలు దేశమంతట లెక్కకు మిక్కిలిగానున్నారు. బ్రహ్మవిద్యా విషయములను వాక్కుచే నుచ్చరించుటకైన నర్హులుగాని యిట్టి యవినీతులు గురువులై పరమార్థోపదేశములను జేయుటయు అమాయకలగు మనస్త్రీజన మీవంచకుల మాయావాగురులలో జిక్కుపడుటయు నిజముగా సహింపదగినవిషయముగాదు. కావున వీనివిషయమై నీవు స్త్రీలకు ప్రబోధింపవచ్చునుగదా?

నియోజక నియోజిత స్వాతంత్ర్యము మన స్త్రీలకు ఇటీవల ప్రసాదింపబడినది. మునుముందింతకంటె నధికమగు హక్కులుగూడ స్త్రీలకు రావచ్చును. కాని యీహక్కులను యీస్వాతంత్ర్యములను ఉపయోగించుకొనుసామర్థ్యము మన స్త్రీలకు లేనిమాట వాస్తవమే గదా. సోదరీ! నీవీవిషయములను పరిశ్రమించి నేర్చుకొనినచో నీ స్త్రీజనములలో వీనినిగూర్చి బోధింపవచ్చునుగదా?

శారదాశాసనము వచ్చెవచ్చెననినారు. ఉయ్యేలలలోని పసిపాపలకు గర్భస్థశిశువులకుగూడ కల్యాణములు చేసినారు. ఈవిషయములో నధికముగా తొందరపడినవారు మన స్త్రీలే. దీనివలని యనేకనష్టమునకు పాల్పడినవారును మన స్త్రీలే. ఇట్టిసందర్భములలో నీవంటివారీచట్టములవలన ప్రమాదములేమిని వివరించినచో వీరిలో కొంతమందినైనకాపాడిన పుణ్యము నీకు ప్రాప్తించియుండునుగదా?

సోదరీ! ఇటులనిదెన్ని విషయములని చెప్పవచ్చును. సర్వవిధములదుస్థితియందున్న మన స్త్రీసంఘమునకు చేయవలసిన యుపకృతులనుగూర్చి క్లుప్తముగా వివరించినను చేటభారతమగును. కాని యీచిన్నిలేఖ కిది సలముకాదు. ఈకొద్దివిషయములనైనను నేనువివరించుటకు కారణమేమనగా నీజీవితమును సార్థకమొనర్చుకొనుటకు మార్గములు పెక్కులున్నవనియు, నీవు హతాశవు గావలదనియు వెల్లడించుటకే. ఇటీవల బొంబాయిలో భారతమహిళాశ్రమమనుపేర వితంతువులకు సుశిక్షనొసంగి సేవాపరాయణలుగా జేయుటకు నొకఆశ్రమమును జమన్‌లాల్ బజాజు మున్నగుమహనీయులు స్థాపించియున్నారు. ఇష్టముండినవారట్టిఆశ్రమములలో శిక్షణము వడసివచ్చిరేని దేశమునందట్టి మహిళాశ్రమములెన్నిటినో స్థాపించి లోకమును సేవించి సార్థకజన్మలు గావచ్చును. ఏవితంతుసోదరీమణియైనను తనజీవితములో లోకోపకారమునకై వినియోగించుట కవలంబింపవలసినమార్గము లివిగాని వేదాంతులయుపదేశములను శుష్కముగా నాలించుటగాదు. మన స్త్రీలలో నిప్పుడువ్యాపించియున్న వేదాంతాభిలాష నిజమైనబ్రహ్మజ్ఞానమనియు దానవారు పునీతులై లోకమును పునీతముగావించుచున్నారనియు, ఆచరణవిహీనమగు ఈశుష్కజిజ్ఞాసచేతనే మోక్షము చేతికైవసమగుననియు నీవెప్పుడును భావింపకుము. సహజముగా అవిద్యాంధకారనిమగ్నలై నిజవృత్తమును ప్రపంచవృత్తమును దెలియక గొట్టుకొనెడి మన స్త్రీలయందు స్వల్పముగానుండెడి తెలిసికొనవలయుననెడి యిచ్ఛ, వివేకము, పరిశీలనాశక్తి మున్నగులక్షణము లీవేదాంతబోధలచే మరింత నశించిపోవుచున్నవి. సీతారామాంజనేయాది యుద్గ్రంథములను నిరంతరముపఠించెడి వారీమణులనెవరినైనను ఏవిషయమునుగూర్చియైనను, ముఖ్యముగా వర్తమానకాలమున స్త్రీలయభివృద్ధికై జరిగెడి సర్వారంభములనుగూర్చియైనను వారిని ప్రశ్నింపుము. మాకు వానితో బనిలేదని హృదయము చెదరునట్లు జవాబిచ్చెదరు. అయిన మీకు దేనితో బని అనుము. మరల మాకు పరతత్వవిచారణయే కర్తవ్యమందురు. మంచిది. వారి తత్వజిజ్ఞాసకు చేమోడ్పు. కాని నిజముగా వీరిట్టి పరతత్వవిచారమునందే నిమగ్నలై యైహికవిషయములందనురక్తిలేకయున్నారా? అదియు నట్టిదే. ఒకకాసీ వచ్చునన్న ఆశయు, ఒకకాసీ పోవునన్న దుఃఖమును వీరు విడిచిరా? నట్టిది. ఇక వీరి తత్వవిచారమెక్కడ? సోదరీ! విషయమదిగాదు. సర్వవిషయములందును అలిప్తబుద్ధితో వర్తించుమని అభిప్రాయముగాని సర్వవిషయములందును విముఖులై మూఢులుకమ్మని వేదాంతబోధయొక్క అర్థముగాదు. విషయపరిజ్ఞానము మానవునకెప్పుడును వెగటుగాదు. ఏవిషయమును తెలిసికొనక కేవలము వాచామాత్రముగా తన్నే స్మరించుచు నున్నచోటునుండి కదలక కూర్చుండుడని చెప్పుట భగవదుద్దేశముగాదు. భగవంతునిచే మనకు ప్రసాదింపబడిన కర్మేంద్రియజ్ఞానేంద్రియములుగాని మనోబుద్ధిచిత్తాహంకారములుగాని స్వాభావికముగా కర్మపరతంత్రములైయుండ మనము సర్వకర్మలను విడనాడవలయునని భగవంతునియుద్దేశమనుట యెట్లుపొసగును? కాన సోదరీ! విషయసంగ్రహణముగాని విషయపరిజ్ఞానముగాని యెప్పుడును పరిత్యజింపదగినదిగాదు. దేనబట్టినదాన నధికవ్యామోహము

కలిగియుండకపోవుటయే కర్మపరిత్యాగము. ఈవిషయమెఱుంగకయే వేదాంతులనబడెడివారు కుమార్గమున బడిపోవుచున్నారు. లోకోత్తరపురుషుడగు మహాత్మాగాంధీనిచూడుము. మానవకల్యాణమునకై ఆయన చేయనిపనిలేదు. అవిధముగాజూచిన ఆయనయంతటివిషయలోలుడును, కర్మపరతంత్రుడును లేడనవలయును. కాని ఆయనను అట్లెవరైనఅనుటకు సాహసింపగలరా? విషయములనుగ్రహించుటయు, దానిభోగములు పరిశీలించుటయు, చెడునుతొలగించి మంచిని పరిగ్రహించుటయు మహాత్మునిమతము. అట్టిచో నాతడు వానికిలోబడినవాడుకాడు. మఱియు వానికి నియంతగూడనగును. మహాత్ముని అనాసక్తియోగ సిద్ధానిసే ప్రతిపాదించుచున్నది. సోదరీ! నీవుగూడ యిట్టిఅనాసక్తబుద్ధితో కర్మపరతంత్రురాలవుకమ్ము. జగము నీకు వశమగును. జగమునకు నీవు అజేయురాలవగుదువు. అయితే నీవు యిప్పట్టున నిక్కమైనవేదాంతినివే కావలయును. "సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌజయాజయౌ" అను భగవద్గీతాసూక్తిని సర్వదా స్మరించుచుండవలయును. ఏలనందువా? అవిచార్యబుద్ధితో ప్రల్లదములాడుట లోకులస్వభావము. కాన నీవే స్త్రీసంఘమును సేవింప బూనుకొంటివో ఆస్త్రీసంఘమే నిన్నుపరిహసించును, ద్వేషించును, కోపించును, నిందించును. అయితే రోగనివృత్తికై మందుమ్రింగించెడి తల్లివ్రేలునుకొఱికినబిడ్డను తల్లి యేవిధముగాద్వేషింపదో ఆవిధముగా నిన్ను ఆక్షేపించెడి స్త్రీసంఘమునెడ నీవు అద్వేషబుద్ధిగలదానవుకావలయును.

"యస్సర్వత్రా నభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్
నాభి నందంతి సద్వేష్టి తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా."

అన్నాడు భగవద్గీతలో. సర్వత్రరాగములేక శుభాశుభముల బడసినపుడు సంతోషవిషాదముల బొందకయుండు వారిబుద్ధి స్థిరమైనదని పైగీతాసూక్తితాత్పర్యము. ఇట్టి స్థిరబుద్ధితో సత్యపథమున విఘ్ననివహస్యమానమగుచు కార్యక్రమమును సాగించినచో లోకమునకు సత్యమును ఋజువుచేయుట కెంతకాలమో పట్టదు. సర్వలోకశరణ్యుడగు భగవంతుడు నిన్నట్టివేదాంతినిగను ట్లనుగ్రహించునుగాక! ఇట్లు, శారద."

కల్పలతా! నేను రాజ్యలక్ష్మికి వ్రాసినలేఖయిది. బాగుగానున్నదా? ఇట్లు, శారద.

## మాంచాల

కుర్రా వేంకటసుబ్బారావుచౌదరిగారు

విప్రుమాటలునమ్మి విషదృష్టిజూచిన విభుదర్శనమునకు వేచివేచి
సానిసబ్బాయితో సంచరించెడుప్రియు పాదార్చనమునకు భ్రమసిభ్రమసి
సఖులుదెల్పెడు నిరాశావాక్యములువిని గుండెలవియ లోన కుమిలికుమిలి
యేనాటికేనియు నేతెంచునను భ్రాంతిబాయక దృష్టిని బరపిబరపి
సమరమునప్రాణములనొడ్డు సమయమందు
అరుగుదెంచిననాథుని కతులభక్తి
గౌరవంబొప్పదీవించి ఖడ్గమొసగు
మగువ! మాంచాల! నీవెంత మాన్యవమ్మ?

మధురసంబొల్కెడు మగనిముఖాబ్జంబు కనులపండువుగాగ గాంచలేదు
పల్కుపల్కునతేనెలొల్కుకాంతునిముకుల్ వీనులతమిదీర వినగలేదు

కమనీయమోహనాకారుఁడౌ నాథుని యింపుమీరగ కౌగలింపలేదు
వెలనిర్ణయములేని విభునిప్రేమామృతం బానదీరగ గ్రోలనైనలేదు

అట్టివో యుద్ధయజ్ఞంబు నందు మేను
ఆహుతియొనర్పఁబోయెడు యవసరమున
గారవంబొప్పదీవించి ఖడ్గమొసగు
మగువ! మాంచాల! నీవెంత మాన్యవమ్మ?

నెలత! చందురుబోలు నీముద్దుమోమునుగనినంత శౌర్యంబు కరగిపోవ
ముదిత! నీవువచించు మృదుభాషణంబులువిన్నంత ధైర్యంబు వీగిపోవ
కలికి! నీమేనిప్రకాశసౌందర్యంబువీక్షింప క్రోధంబు విరిగిపోవ
సఖియ! నీక్రీగంటి చల్లనిచూపులు పరికింపయాహవభ్రాంతిబోవ

భీరుడై యున్న నాథుని వీరవరుగ
యుద్ధరంగంబునకును సంసిద్ధుజేసి
గారవంబున దీవించి ఖడ్గమొసగు
మగువ! మాంచాల! నీవెంతమాన్యవమ్మ?

కృష్ణవేణీతరంగితతరంగములందు వినవచ్చుచుండె నీవిమలగాథ
విశ్వమోహితకొండవీటిగహ్వరముల ప్రతిధ్వనించుచునుండె తలయశస్సు
వెన్నునై చివపాల జొన్నకట్టలమీద పారాడుచుండె నీపౌరుషంబు
పరిపంథిరాజన్యప్రాసాదతలముల చివురెత్తుచుండె నీశీలమహిమ

అల్లపల్నాటివీరరణాంగణమున
భర్తకొసగినసందేశభాషణంబు
నాట్యమొనరించుచుండె యీనాడుగూడ
మగువ! మాంచాల! నీవెంతమాన్యవమ్మ?

బ్రాహ్మణబ్రువు నెడబాపె నోహోయని చాటిచెప్పుచునుండు జమ్మిచెట్టు
బాలచంద్రుని ఖడ్గబాధకోర్వక రిపుల్ కన్నీరుగార్చిన కదనభూమి
పల్నాటివైష్ణవభక్తులు మృతినొంద కిన్కబూననిచెన్నకేశవుండు
రాజపుత్రులవేడి రక్తధారల ప్రీతి దోగిధన్యంబైన నాగులేరు

నీమహోత్కృష్టజీవితనియమకీర్తి
నిక్కనము దెల్పగాబోలు నిల్చియుండె
నాటికిని నేటి కారపల్నాటియందు
మగువ! మాంచాల! నీవెంతమాన్యవమ్మ?

## కలకత్తా

విద్వాన్ నూరి గుచ్చి కృష్ణమూర్తిగారు

"ఇదిగో ఏమండోయి."

"........."

"మాట్లాడరేం మిమ్మల్నే."

"........."

"బాగుంది. ఎక్కడో ఏదో జరగడమూను ఇంట్లో వాళ్ళతో బిగదీసుక్కూచోటమూను. ఇది మరీ బాగుందిలెండి."

"........."

"ఏమిటండీ అంత మౌనవ్రతం. ఏమైనా బాధగా ఉందా?"

"........."

"ఇదుగో చూశారూ! వాళ్ళ వెంకట్రావుకి జంధ్యంలేదని వాళ్ళమ్మ రోజూ కాశీకి ప్రయాణమౌతానని గోలచేస్తున్నదండోయ్. మరి మనకు జంధ్యంలేకపోయినా అనేవాళ్ళులేరుగా."

"........."

"అయితే పాపయ్యశాస్త్రుల్ల పెళ్ళాన్ని చూశారూ ఆయన్ని నానాతిట్లుతిడుతూ కాళ్ళుకూడా పట్టించుకుంటున్నదండీ. వెతగ్గావెతగ్గా మనకీపొరుగు దొరికిందేం."

"........."

"ఇదుగో సరేగానీ భక్తసమాజంలోకి పంచములు మహమ్మదీయులూ రాగూడదన్నారుగదా? మరినిన్న భక్తిమీద ఉపన్యాసం ఇయ్యడానికి ఆతురకపండితుణ్ణి పిలిపించారేం మహాభక్తులందరూను."

"........."

"అబ్బ!ఎంతవాగినా మాట్లాడరేం. ఇకనెప్పుడూ మాట్లాడరా?"

"........."

"ఏదోసామెతచెప్పినట్లుగా మరినేనురానప్పుడు వాళ్ళనుబ్బమ్మ వాళ్ళందరితోనూ నాకేమీ తెలియదనీ, బస్తీలల్లో సినీమాలుంటాయనీ, బస్తీలల్లో ఆడవాళ్ళు జడల్లో పిన్నులుపెట్టుకుంటారని, డబ్బిస్తే పూటకూళ్ళయిళ్ళల్లో అన్నంపెట్టుతారనీ, రైలుబండి మరతో నడుస్తుందనీ ఇల్లాంటివేమి తెలియవని చెప్పేరటగా? అవునా?"

"........."

మొన్న మీ యిస్కూల్లో ఆడవాళ్ళు వేసిన నాటకానికట మామూలునాటకాలకు స్త్రీలకు ప్రత్యేకస్థలము ఆ పేట్లుగా మీరు పురుషులకు ప్రత్యేకస్థలము పెట్టకపొయ్యారా అని వాళ్ళ సుభద్రవాన్నగారు ఆక్షేపించారట విన్నారా?

"........."

"ఇదేమిటి బాబూ! ఎన్నిసార్లు ఎంత సరదాగా మాట్లాడుతూవాన్నా యింత భీష్మించుకుకూచోవడం-నాకెందుకు - పాపం నిన్న వాళ్ళ శకుంతల 'మేష్టరున్నారా?' అని వచ్చి ఎంతోసేపుకూచుని వెళ్ళింది."

"నిజంగానా ఏమన్నది పాపం వెళ్ళేప్పుడు."

"ఆహాఁ శకుంతల ఆ చెప్పటికి ప్రతధంగం చేసుకో వాలిసి వచ్చింది పాపం. ఏకోటి అందిలెండి."

"అబ్బ! చెబుదూ ఏమందో."

"ఏమిటీ అబ్బ-ఇందాకటినుంచీ ఏమైందిబాధ?"

"నాలుగ్గంటలకేనావస్త-ఏంచెప్పిందేమిటి?"

"ఏంచెపుతుంది - తనువచ్చి చాలాసేపు కూచుని వెళ్ళేనని చెప్పమంది."

"ఇంతేనా ఏమీ చెప్పలేదూ?"

"ఏమిటంత ఆరాటం - ఏమున్నదింకా చెప్పడానికి."

"........."

"ఊహూఁ అయిపోయిందిగా కావాలసినసంగతి. మళ్ళీ మొఖం మామూలు-ఏమిటంతచికాకు."

"........."

"పోనీలెండి. నాతో మాట్లాడానికి మీకెంత బాధ్యతో మీతోటి నాకూఅంతే. అసలుసంగతేమిటో

చెప్పకుండా బిగదీసుకుంటే ఎంత సేపని బ్రతిమాలడం. వాలో దోషముంటే ఫలానా అని చెప్పరాదూ. అబ్బో యింత బెట్టయితే ఎల్లాగ బాబూ ఇంట్లో వాళ్ళతో నే. సరేలెండి" అని విసుక్కుంటూ లోపలికి వెళ్ళింది సీత.

సీతకు పదహారేళ్ళుంటాయి. కాపరానికొచ్చి ఓసంవత్సరం పైగా అయింది. చూడతగిన ఆకారం-గంభీరమైన హృదయం - ఆకర్షణీయమైన ప్రవర్తన-తెలివైన వ్యక్తి. చదువుకున్నది కాస్తే అయినా హిందూపురాణకథలూ, ఆచారవ్యవహారాలూ, ప్రస్తుతవిషయాలూ ఆమెకు బాగా తెలును. అయితే పెద్దపెద్దపట్టణాలు ఏవీ చూడలేదు. పట్టుదలగల మనిషి. హృదయంలో ఉన్నంత నిరాఘాటవిశాల దృష్టి క్రియలో గన్పించనీయదు. గుణాగుణాలని గ్రహించే తెలివితేటలు ఎక్కువ.

సీత ఇల్లాంటిది కావడానికి హేతువు రమణ. ఇతనికి చదువు ఎక్కువేగాని సీతలాంటి గంభీర హృదయంలేదు. పదిమందికీయిష్టుడు. ఇతనిదృష్టిలో మానవజాతిలో చిన్నా పెద్దాలేదు. ఇతరులనుగూడా సాధ్యమైనంతవఱకు తనదోవకే తీసుకురావడానికి ప్రయత్నిస్తాడు. ఇతనికి స్త్రీలుచదువుకోవడమన్నా, పత్రికలకు వ్యాసాలురాయడమన్నా, స్త్రీలు గొప్ప గొప్పపనులు చేయడమన్నా మహాయిష్టం. సీత పల్లెటూరిపిల్ల అయినా, పుట్టింట్లో ఉన్నప్పుడు యెంత మోటుగా ఉన్నా ఇతనితో కాపురం చేస్తూన్న కొద్దిరోజులకే అన్నివిషయాల్లోను వాజూకూ, నాగరికతా అబ్బినవి. పురుషులకంటె స్త్రీలది నిశితమైనబుద్ధి అనే దృఢవిశ్వాసం రమణకుండడంచేత తనభార్యకు ఈసడించకుండా అన్నివిషయాలు చెప్పడమే సీత యింత తెలివితేటలుగలది కావడానికికారణం.

ఏదైనా ఓచిన్నవిషయమైనా సరే వాదిస్తూంటే పాపం నిజానికి సీతతో మాట్లాడలేకపొయ్యేవాడు రమణ. "ద్రౌపది ఎంతో ఓర్పుగలది. లేకపోతే ఆవిడ దిగ్గజాల్లాంటి పతులుగలిగికూడా అల్లాగ విరాటరాజు కొలువులో దాసీపనిచేసి పడరానిబాధలన్నీ పడ్డదే పాపం..." అని రమణ ఏమన్నా మొదలెడితే వెంటనే సీత వేళాకోళంచేస్తూ "ఓహో ఎవరికోసముంటుం దేమిటి? అవసరమైతే ఎవళ్ళుండరు? ఆగొప్పతనం అవసరాందిగాని ద్రౌపది దేముంది? మన దాసీ వాళ్ళంతా ఉండడంలే" అని అతనిమాటలను ఉవ్వెత్తుగా ఎగరకొట్టేది నవ్వుతూ. పాపం అతడు ఏమంటాడు. అయితే ఇల్లా సీత మాట్లాడడంలో అభిప్రాయం తను అతనికి అడ్డుతగలాలనే భావమేగాని ద్రౌపది గొప్పతనం గ్రహించక కాదు.

ఒకరోజున "నాలుగువిధాల నాయకులున్నారు. నిశ్చింతుడైఉండేవాడు ధీరలలితుడు" అని ఏమేమో రమణ చెప్పతూంటే "అయితే గేదెలూ, దున్నపోతులూను మోటార్లూ అవీ వెళ్ళుతూంటే పదురూ బెదురూలేకుండా నిలబడతైగదా అవి ధీరలలితుడనే నాయకుడికింది కొస్తవా?" అని పరిహాసించింది.

రమణకు వంగభాషలో పరిచయముంది. చాలా మంది అతనిఆకారాన్ని చూచినా, అతని భాషాజ్ఞానం చూచినా అతడు కలకత్తాలో కొన్నాళ్ళుండి వచ్చేడని అనుకుంటారు. అప్పుడప్పుడూ కొందరు సీతను కూడా ఈవిషయంఅడిగితే ఏమోనండీఅనేది. నిజంగా సీతకూ తెలియదు. అందరూ ఇల్లా అడుగుతూండడం చేత సీతకూసందేహంతోచి ఓనాడు "ఏమండీ! మీరు కలకత్తాలో చదువుకున్నారటగాదూ నిజమేనా?" అని అడిగింది.

"ఎవరన్నారు?"

"వాళ్ళకకుంతలా వాళ్ళూ ఎప్పుడూఅడుగుతారు నన్ను."

"అన్నీ వట్టివే. నేనసలు కలకత్తేచూడలేదు."

"మరి మీకదేమిటో అక్కడవాళ్ళు మాట్లాడుకునే భాష వచ్చుటగా."

"వస్తే అది అక్కడే నేర్చుకోవాలని ఉందా, ఇంగ్లీషు నేర్చుకొనేవాళ్ళంతా ఇంగ్లాండులో నే ఉండి నేర్చుకుంటున్నారా?"

"బాగుంది మీ ప్రశ్న-ఇంగ్లీషంత వ్యాప్తి ఉందా మీ కలకత్తా భాషకు-సరే గానండి. అక్కడ ఆడవాళ్ళు నెత్తిమీద ముసుగు వేసుకుని నాజూకుగా ఉంటారటగా."

"ఎవరు చెప్పేరు?"

"శకుంతలని వాళ్ళక్కాన్నవాళ్ళు వెళ్ళేప్పుడు తీసుకెళ్ళేరట. ఆ అమ్మాయి అక్కడ మేడల సంగతీ మనుష్యుల సంగతీ చెప్పుతూంటే అమ్మయ్యో అనిపించేది."

"నేచూళ్ళేదుగాని పుస్తకాల్లో చదివాను. నిజమే నువ్వు విన్నదంతా. అక్కడ ఆడవాళ్ళకు మనవాళ్ళకంటె చదువూ అదీ ఎక్కువ. వాళ్ళను తలచుకొని మన వాళ్ళను చూస్తూంటే నాకెంతో విచారం వేస్తుంది."

"పాపం ఎంత జాలిహృదయమండీ మీది. వెనుకటికి ఓ మహారాజుగారు కోటల్లో నక్కలు చలితో బాధపడుతున్నాయని జంబుకానాలూ గొంగళ్ళూ పంపించాట్ట నక్కలు వాటిని కప్పుకుంటాయని. అల్లా మాకూడా ఏమన్నా ఆలోచించండి ఉపాయం."

"ఆక్షేపణలకేం. ఏం ఆలోచిస్తే తప్పా."

"సరి తప్పన్నానా? దానికేంగాని నేనోటి అడుగుతాను. ఒప్పుకుంటారా?"

"ఒప్పుకోకేం అడుగు."

"అసలు మీరు చెప్పేవన్నీ అబద్ధాలే. మనింటికొచ్చే కొండలరావుగారు డాక్టరని చెప్పేరే నాకు మొన్న జ్వరం వచ్చినప్పుడు. ఆయనకేదో పొలాల పనటగా."

"ఎవరు చెప్పేరు? ఇది మరీ బాగుంది. ఆయన సర్వే గుమాస్తా అనుకున్నావా? వింటే ఏమనుకుంటారు?"

"చాల్లెండి. ఇంకా సమర్థిస్తారేం. మనకాయన ఇచ్చిన నోటీసులు చూడలే. పోనీ గానీండి. వచ్చే సెలవులకు మనం కలకత్తా పోదామూ, నాకది చూడాలని ఉందండీ. ఏమంటారు?"

"అబ్బో కలకత్తే."

"అబ్బో ఏమిటి, రైలులో కూచుంటే రేపీపాటికి కలకత్తా."

"ఆహా! ఎంత ప్రపంచజ్ఞానం. టిక్కట్టు కొనక్కర్లే."

"తమకున్నంత తెలివితేటలు లేకపోయినా టిక్కట్టు కొనాలని నాకూ తెలును లెండి. మీరనుకున్నట్లు రైలు మరతో నడుస్తుందని తెలియకపోలేదు లెండి."

"కలకత్తాకు టిక్కెటెంతో తెలుసా. మనిద్దరికీ ఓ వందరూపాయలు కావాలి."

"అయితే ఏమి, మీరు ప్రతీ నాటకానికి వెళ్ళడం ఎందుకు? ఇకమీదట మానేయండి. ఆడబ్బుతో వెళ్ళవచ్చు."

"చూద్దాంలే."

"చూద్దామంటే వెళ్ళిందెక్కడికో. ఒప్పుకోండి."

"సరేలే సెలవుల్లోగా."

"అప్పుడే లెండి ఒప్పుకున్నారా?"

ఎల్లాగయితే నేం ఊఁ అనిపించింది సీత రమణ చేత. ఆరోజు మొదలుకొని సీతకు కలకత్తా దిదృక్ష అతిశయించింది. పాపం ఆ అమ్మాయి పల్లెటూళ్ళో పెరగడం దగ్గిరున్న చిన్న చిన్న బస్తీలు చూడ్డమే గాని పెద్ద పెద్ద పట్టణాలు చూచి ఎరుగదు. చూడాలనే బుద్ధీ లేదు. అయితే కలకత్తా ఆడవాళ్ళ వైఖరీ వినే సరికి ఎందుకో బుద్ధిపుట్టింది వెళ్ళాలని. ఇది తఱచు వాళ్ళింట్లో ఉన్న సరోజనీదేవి బొమ్మని చూడడం మూలాన్ని కొంత, శకుంతల మాటల మూలాన్ని కొంతా కలిగింది. దినాలు లెక్కెడుతోంది యక్షుడు ప్రవాస దినాలను లెక్కపెట్టినట్లుగా సెలవలకోసం.

రమణకు మాత్రం కలకత్తా వెళ్ళి అంతడబ్బు ఖర్చు చేయడం ఇష్టంలేదు. ఎల్లాగ ఈ ముప్పు తప్పించడం అని ఆలోచిస్తున్నాడు.

కొన్నాళ్ళకు సెలవలూ వచ్చినవి. "ఏమండీ రేప్పేటగా సెలవలు మొదలు" అని అడిగింది సీత.

"అప్పుడే నీకెలా తెలిసింది?"

"వాళ్ళమ్మాయి చెప్పింది. పోనీ చెప్పండి కలకత్తా పోవడం ఇష్టంలేదా?"

"లేకేం, ఒప్పించుకున్నావుగా."

"ఒప్పుకోటానికేం లెండి. మనమేం సత్యహరిశ్చంద్రులమా? పొద్దునే లేస్తే మననోటంట వచ్చేవన్నీ అబద్ధాలేగా."

"వెళ్ళదామంటూంటే ఇంత వ్యాఖ్యానమెందుకు? రేపురాత్రి మెయిలుకే పోదాం."

"నిజమేనా?" అని ఎంతో ముఖం వికసింపచేసుకొన్నది. పాపం సీతకు కలకత్తా పేరు తెలిసిందిగాని మార్గం ఎలా తెలుస్తుంది. పేలూర్లో రాత్రి మెయి లెక్కితే చెన్నపట్టణం పోతారు.

మరురోజువల్లా ఎంతో సంతోషంగా ఉంది. సామాను పొద్దుటినుంచీ సర్దుకోడం మొదలెట్టింది. రమణ ఆనాడెందుకో తనలోతానునవ్వుకోడం మొదలెట్టేడు. ఇది ఊరికే తన్ను వేళాకోళం చెయ్యడం అనుకుందిగాని పాపం సీతకేం తెలుసు?

స్టేషనులో రాత్రి సామానుదగ్గర సీతను నిలువో పెట్టి రమణ చెన్నపట్టణానికి రెండుటిక్కెట్లు కొన్నాడు. తెనుగుదేశం దాటేదాకా రాత్రికావడం చేతా, మొగవాళ్ళపెట్టెలోనే సీతనుకూడా కూచో పెట్టడంచేతా ఎవళ్ళూ ఏవూరువెళ్ళుతారు అని సీతను అడగలేదు. అక్కడికీ ఓముసలివిధంతువు ఏవూరు తల్లీ అని నిమ్మళంగా అడిగితే ఆవిడకు చెవుడేమో అనుకొని బిగ్గరగా కలకత్తా అని చెప్పింది. ఎందుకనో ఆవిడ మళ్ళీ మాట్లాడలేదు.

పట్నంచేరేక తనకో స్నేహితుడు అవూళ్ళో ప్లీడరీ చేస్తూంటే సీతతో వాళ్ళింటికివెళ్ళేడు రమణ. వాళ్ళు సగౌరవంగా వీరిని సత్కరించేరు. వెళ్ళగానే తనకు వాళ్ళింట్లోవాళ్ళంతా పాతవారేఅవడంచేత సీతతో ఇది కలకత్తేనని చెప్పుతూండండి అనిచెప్పేశాడు.

క్రిస్టమస్ పండుగలవటంచేత పట్టణం బాగా కలకళ్ళాడుతూఉంది. ఆప్లీడరుగారి మోటారు మీద నాలుగురోజులు ఊరంతాతిప్పేడు సీతను రమణ. గుఱ్ఱపుపందాలు ఆటదగ్గిర ఆగుఱ్ఱాలను సీత సినీమా చూసినట్లుగా చూచింది. ఎంతో ఆనందించింది తన హృదయంలో. ఇంకా ఎన్నోవస్తువులు కొనుక్కుంది కలకత్తామీదున్న అభిమానంతోటి.

అయితే ఇదివరలో బెంగాలీవాళ్ళ కట్టూజుట్టూ విన్నదానికీ ఇక్కడ తానుచూస్తూన్న అరవలవ్యవహారానికీ భేదం చాలాకనిపించింది. ఏఒకరిద్దరో తప్ప నెత్తిమీద ముసుగువేసుకున్న ఆడదే కన్పించలేదు. ఈసంగతి రమణను బీచీదగ్గరకూచున్నప్పుడుఅడిగింది. అడిగితే "అలా ముసుగేసుకోవడం పూర్వకాలపు ఫాషన్. ఇప్పుడు ముసుగుతీయడంఫాషన్ గాబోలు. నాకుమాత్రం ఏంతెలుసు" అని వస్తూవస్తూన్న నవ్వు నాపుకుంటూచెప్పేడు. సీతకు ఆసముద్రతరంగాలూ హార్బరూ ఎంతోసంతోషాన్ని కలుగచేసినవి.

ప్లీడరుగారికీ ఆయనభార్యకూ సంగతంతా తెలుసు గనుక ఇక రేపువెళ్ళుతారనగా ప్లీడరుగారుతాంబూలం వేసుకుంటూ "ఏమమ్మా సీతమ్మా! కలకత్తాబాగుందా" అని మందస్మితంగా అడిగారు. సీత అమాయికంగా "బాగుందండీఎన్నాళ్ళనుంచో పోరగాపోరగా నేటికి తల్లారు. చక్కా మీరెంత అదృష్టవంతులండీ! కలకత్తాలోనే కాపురంఉన్నారు"అని అన్నది. ఇంతలోకే ప్లీడరుగారిభార్య అందుకొని "ఏమండోయ్ మా సీత ధర్మంమూలాన్ని కలకత్తానూ చెన్నపట్టణాన్నీ ఒకటేచేస్తారట గవర్నమెంటువారు" అని నవ్వింది. దాంతో సీతకుతప్ప అందరికీ నవ్వువచ్చింది. వీళ్ళ నవ్వులూ సంభాషణలూ సీతకేదో అనుమానం కలిగించాయిగాని అది చెన్నపట్టణం అని తెలియలా పాపం.

తిరిగి మళ్ళీ స్వగ్రామానికి ప్రయాణమయ్యారు రమణా సీతనూ. ప్లీడరుగారి భార్య సీతకు ఓచీర పెట్టింది. ఎంతో ప్రేమగా ఆదరించి వీడుకొల్పింది. రమణతో అందిగదా ఈమాటు సెలవులకి సీతను చెన్నపట్టణం తీసుకురండి. మేమక్కడ ప్రాక్టీసు పెట్టుకుంటాం అని అంది. రమణ నవ్వుతూ సరేలెండిఅని బయలుదేరాడు.

రైలులో రమణతో సీత మాట్లాడనేలేదు. పట్టుదల ఏమిటంటే వాళ్ళు తనను వేళాకోళంగా నవ్వుతూంటే రమణకూడా వాళ్ళల్లో కలిసి ఎందుకు నవ్వాలి అని ఓటీ. రెండోది స్టేషనుదగ్గిర వాళ్ళఊరి డాక్టరుగారూ ఆయనభార్యా కలిస్తే ఆవిడ సీతతో "ఇదేమిటి? మీరు పట్టణంవచ్చేరా ఏమిటి" అని అడి



బెర్లినులో కుక్కవేట

గింది. దాంతో సీతకు నిజం తేలింది. రమణ కొంప మునిగిందని అనుకొని సీతను తొందరగా ఇకేమీ ఆవిడతో మాట్లాడనీకుండా బండి ఎక్కించేడు.

ఇంటికికి రేక అనుమానం సీతను ముంచేస్తున్నది. రమణ పాపం ఎన్నో సార్లు బ్రతిమాలాడు. యెన్నో వింతలు చెప్పేడు. ఎన్నిచెప్పినా సీత వినలేదు. చివరకు రమణ అన్నాడుగదా "నాకీసంవత్సరం దిద్దడానికి పేపర్లు వస్తాయి. దానికోసం ప్రయత్నం చెయ్యాలని వెళ్ళాను. దానిమూలంగా మూడువందలరూపాయలు వస్తవి. రాగానే అవి నీ చేతికేయిస్తాను. దాంతో ఈసారి మనం కలకత్తాపోదాము" అని ఒట్టువేశాడు. దీంతో సీత కొంచెం సమాధానపడ్డది. ఈసారి కలకత్తాకు టిక్కట్లు వాళ్ళ పెదనాన్నకొడుకుంటే అతనిచేత తెప్పించాలనుకున్నది. "పోనీలెండి నేనూ చెన్నపట్టణమే చూద్దామనుకున్నాను. కలకత్తాలో ఏముందేమిటి?" అని తనూ నవ్వింది చివరకు.

# కృశాంగి

కొత్తపల్లి సుబ్బరాచార్యులుగారు (సాహితీసమితి)

ఎంతోచక్కని రూపువాఁడవనుచున్ ఎంతోగుణాఢ్యుండ వం
చెంతో జ్ఞానముభక్తిసంపదల నీవెంతోఁబ్రపూర్ణుండ వం
చెంతో ప్రీతిదలిర్పఁజూతువని యెంతెంతోముదంబార నా
కాంతున్‌గా నలరారఁజేసిరి నినున్‌గాదే మనోవల్లభా!
కోరినదెల్లఁ గోరినటుఁగూర్చుచు మోదమెలర్పఁగా మహో
దారులు నన్నుఁగన్నతలిదండ్రులు నాయెడ నెంతొప్రీతితో
నారసి దేశమంతటనునారసి ఆరసి యెట్టకేలకున్
గోరిరి నిన్ను నాపతిగఁగూర్చుటకై కద! ప్రాణవల్లభా!
హారిచింతారతిలేదు దుర్విషమచింతాసక్తియేగాని యియ్యా
కరణిన్‌జేయఁగ నేలొకో! అకట! నీగాంభీర్యమేమాయెనో
చిరకాలంబొకరీతినే గడచునే చిత్రంబుకాదే! యహా!
మరువంబోకుము చిన్ననాటివలపుల్ మాటల్ వినోదావళుల్.
నామనముం గనుంగొనక నాయెడ నక్కటికంబొకింతయున్
నీమనమందునెంచక యనేకవిధంబుల నేడుపించి పెన్
బాములఁద్రోసిపుచ్చితివి పాపనిస్సైతముఁజూడవైతివే
నేమియొనర్పగాఁగలను? ఏమియొనర్చిన నేమికార్యమా?
నాయపరాధమేమి? నను నల్గురిలో నగుఁబాటుసేసి నన్
బాయఁగనేల? రూపమున బాగుగలేనో? గుణంబుచాలదో?
ప్రాయముతక్కువో? మఱిప్రపంచమెఱుంగనో? యేమికారణం
బో? యిటులేలజేసెదవు? పో, తగునా? యిటుజేయఁజెల్లునా?
కాని మెన్నాళ్ళుచేసెదో గాంచుదాన
రాకమానవు నినుఁజేరనీకపోను!
ధనమదంబును ప్రాయమదంబునుడుగ
నీవు నాప్రాణరత్నమై నెగడుకతన.

# దుఃఖమయ ప్రపంచము

తుమ్మలపల్లి వేంకటసీతారామారావుగారు

శాంత ఏకాకిని. పుత్రరత్నముకూడా వియోగానల మునకు ఆహుతిఅయినాడు. జారిపోయిన రత్నాన్ని పరిగ్రహించుటకు బాష్పమాలలు ఎదురుచూస్తూఉన్నవి.

అభ్రవీథిలో తారలు మిలమిలలాడుతూ యున్నవి. శయనమందిరములోని జ్యోతి కాంతివిహీనమైనది.

ఆమె ఒంటరిగ శయ్యపై కూర్చొన్నది.

'అమ్మా! అమ్మా!' అని ఒకపెద్దకేక.

శాంతశరీరము కంపించినది. నాలుగువైపులు ఆత్ర ముతో పరిశీలించినది. కాని అంతానిశ్శబ్దము.

ఎవరిది ఆపిలుపు? అదేస్వరము. అదేధ్వని.

పాండుర దేహచ్ఛాయ, జిజ్ఞాసాప్రపూరితమైన కనుగవ బాబు అంత్యపతనము అన్నీ ఒక్కమారుగ ఆమె కంటి ముందు మెరసినవి.

గదితలుపు చప్పుడైనది.

'బాబూ! వచ్చేవా?' అని ఒక పెద్దనిట్టూర్పు విడి చింది శాంత.

వచ్చీరానిమాటలలో! 'పిన్నీ! యిక్కలున్నావేం?' అంటూ సూరి లోపలికివచ్చేడు.

తత్తరపాటుతో లేచి, అతణ్ణి కౌగలించుకొని, తన కన్నీటితో సూరి శిరస్సును అభిషేకముచేసినది. ఊపిరి సలుపక ఉక్కిరిబిక్కిరిఅయి విడిపించుకొని 'అన్నయ్య ఏడీ? నేను ఆలుకోవొద్దూ' అన్నాడు సూరి. శాంత నిరుత్తరమైనది. తిరిగిదుఃఖము పొంగివచ్చినది.

'నువ్వు ఏలుత్తావేం? నాకు బయంవేత్తూంది. నేవెల్తున్నా!' అని సూరి వెళ్లేడు.

వాయుచలనమునకు సన్ననిదివ్వె ఆరిపోయినది.

బాహ్యాంభ్యంతరములు అంధీకృతములైనవి.

# హేమంతఋతువు

నాగలింగమ్ వేంకటేశ్వర్లుగారు

మార్గశిరపుష్యమాసములు హేమంతఋతువు. ఇది విసర్గకాలమునందలి కడపటిఋతువు. ఈఋతువుతో దక్షిణాయనకాల మంతమగును. శ్రావణమాసము మొదలు పుష్యమాసాంతమువరకును నుండు దక్షిణాయనకాల మారుమాసములయందును సూర్యుఁడు క్రమక్రమముగ తనమార్గమున దక్షిణభాగమునకు దిగుచుండును. అప్పుడు కాలస్వభావాదులవలనను మేఘములపైనుండి వీచెడి చల్లనిపిల్లతెమ్మెరలవలనను వర్షమువలనను సూర్యుని తైక్ష్ణ్యకిరణప్రతాపము సన్నగిలుచుండును.

జగమంతయు మేఘజలములచే పరిప్లుతమై అదానతాపమారియుండును. వాయువులు చల్లనివై రూక్షములుకాక యుండును. ఆనుకూల్యమునుబట్టి చంద్రుఁడు బలవంతుడై చల్లనికిరణసంచయమును వ్యాపింపఁజేయుచు జగంబుల కాప్యాయన మొనర్చుచుండును. అందుచే జగమంతయు నీయయనమున సౌమ్యమై యుండును. ఇట్టి దక్షిణాయనమందలి వర్షాశరద్ధేమంతఋతువులు మూటియందును క్రమముగా సౌమ్యములగు ఆమ్ల, లవణ, మధురరసములకు బలముకలుగును. జీవజాలమునకంతకును క్రమక్రమముగా బలము కలుగుచుండును.

ఈమూడు ఋతువులయందును క్రమముగా ఓషధీద్రవ్యములన్నియు మొలకలెత్తి పెరిగి పరిణతములై సారవంతములైయుండును. బలమగువాహారము సమృద్ధిగ దొరకుచుండుటచే వానినితిని శాకాదజంతువులన్నియు బలిసియుండును. అట్టివానిని తినుటచే మాంసాదములును బలిష్ఠములైయుండును. అందుచే నిప్పుడు ప్రాణిసంచయమంతయు బలముకలిగి యొప్పారుచుండును. అందు తుదిదగు నీహేమంతమున విసర్గధర్మములు సంపూర్ణములైయుండును.

హేమంతఋతువున ఉత్తరదిక్కునుండి ఒడలువణుకు లెత్తింపుచు చలిగాలివీచుచుండును. సూర్యుఁడు నీహారముచే పరీవృతుడై గౌరవర్ణుడైయుండును. పొగమంచును, ధూళియు వ్యాప్తమైయుండుటచే నాశాముఖములు కలుషీకృతములైయుండును. జలాశయములపై మంచు దట్టముగ నల్లుకొనియుండును. కాకులు, ఖడ్గమృగములుఁ, ఎనుములు, గొఱ్ఱెలు, ఏనుగులు, పందులును నిట్టిజంతుసంతానములన్నియు బలిసి పొగరెక్కియుండును. నానావిధములగు నూత్నసస్యములు ఫలించియుండును. జలములు స్నిగ్ధములై బలముగలిగి శుద్ధములైయుండును. పశువులు ఈనిబలిసి పుష్కలముగా పాడినొసంగుచుండును. లొద్దుగ, ప్రేంకణ, పున్నాగము నను నిట్టివృక్షజాతులు పుష్పించి చూపరుల కమందానందసంధాయకములై తనర్చు. ఇవ్విధమున నీఋతువున జీవజాలము పాడిపంటలఁదనిసి యానందమరందము చూఱగొనుచు బలమును, తుష్టిని, పుష్టిని పొందుచు సుఖసంతోషసాగరంబున తనివితీర నోలలాడుచుండును.

మిగులబలముకలిగి నూత్నములుగ పండియుండు శాలిమంజరులును శాకములును ఆహారముగను కాలస్వభావమునుబట్టి స్నిగ్ధములుగను, గురువులుగనునుండు జలములను పానీయములుగను నుపయోగించుకొనుచుండుటవలనను, దేహము మంచుతోగూడిన గాలిచే ఉపస్థంభితమై (మునిగి) యుండుటచేతను, సూర్యుని కిరణములు మందప్రసారములైయుండుటచేతను, స్నేహము శైత్యము గురుత్వము ఉపలేపము మున్నగుగుణము లేర్పడుటవలనను, అట్టిగుణములును స్వభావమును కలిగినకఫము మనుష్యులదేహముల చేరుకొని ఈఋతువున చయమునందును. శరదృతువున సూర్యుని తైక్ష్ణ్యకిరణప్రసారముచే ప్రకోపమునందిన పిత్త మీఋతువున తనగుణములకు ప్రతికూలముగ శీతలమువలన నుపశమమునందుచుండును. వర్షర్తువున ప్రకోపమునందిన వాతము

శరదృతువున నుపశమమునందుట కారంభించి యిప్పుడు తగ్గి అన్యదోషానుబలమై యుండును. ఇట్టిఋతువున కఫము చయమునందును. పిత్తము శమమునందును. వాతము బలమైయుండును.

పైఁజెప్పఁబడినట్లు స్వరూపస్వభావాదులుకలిగి తనరారుచుండు నీకాలమున మంచుచేఁ జల్లనై వీచుచుండు నుత్తరపుగాలిచే దేహులదేహంబులయందలి రోమకూపములును స్రోతోమార్గములును నిరోధింపఁబడియుండుటచే వెలుపలకు ప్రవింపఁజాలక శరీరోష్మము శరీరములోపలనే పిండితమై ప్రజ్వరిల్లుచుండుటచేతను కాలస్వభావముచే బలముకలిగియుండు దేహములయందు తానును బలవంతమై యుండుటచేతను జఠరాగ్ని ప్రబలమై పరిమితినిబట్టియు, గుణమునుబట్టియు గురువులైయుండు నాహారములనుగూడ జీర్ణముచేయ సమర్థమై యుండును. అట్టిజఠరాగ్నికి తగునాహారములభింపకున్నచో అది శారీరకమగు రసధాతువును ఇగిర్చి క్షయము నందించును. అంతట రసక్షయముచే శూన్యములైయుండు శారీరకనాడులయందు వాతముచేరుకొనును. అట్లు చేరుకొన్నవాతము శీతమువలన ప్రకుపితమగును. ఇట్లు ప్రకుపితమైనవాతము పిత్తమునుచేరి శరీరమున వాతపిత్తసంబంధమైన వికారములను కలిగించుచు చెరుపుచేయును. అందుచే నీఋతువున జఠరాగ్నికి తగు బలమగు నాహారము నుపయోగింపదగును. ఈఋతువున స్నిగ్ధములును, స్వాదువులును (తీయనివి,) ఆమ్లములును (పులుపువి,) లవణములును (ఉప్పనివి) నగు నాహారముల నుపయోగింపవలయును. కఫచయము తగ్గించుటకై తిక్తములును (చేదుకలవి.) కటువులును (కారమైనవి,) క్షారములును, ఉష్ణములునునగువానినిగూడ భుజింపఁదగునని కొందరియాశయము.

బలమును కలుగఁజేయు నూత్నశాలిధాన్యములను, గోధుమలను, మినుములను, నూవులను, అన్నివిధములకూరల నాహారమున నుపయోగింపవచ్చును. గోధుమపిండి మున్నగువానిచేచేయబడిన భక్ష్యములను భుజింపవచ్చును. ఔదకములు, ఆనూపములు, బిలేశయములు, ప్రసహములు అనుజీవజాలములోని బలిసియుండు మృగములయొక్క మాంసముల భుజింపదగును. పాలు, పెరుగు, నేయి, మీగడ, వెన్న మున్నగు క్షీరవికృతులును, పంచదార బెల్లముమున్నగు ఇక్షువికృతులును యథేష్టముగా భుజింపవచ్చును.

ప్లవజాతులయొక్కయు, ప్రాదిజాతులయొక్కయు మాంసములనుగూడ భుజింపవచ్చునని కొందరియాశయము. సుఖోష్ణమగు నుదకమును పానముగ నుపయోగింపవలయు. మదిరము, శీధువు అను సంధానజాతికి చేరినమద్యముల నుపయోగింపవచ్చును. వస (శుద్ధమాంసస్యయస్నేహసావసా పరికీర్తితా—శుద్ధమాంసమునందలి స్నేహము) నుపయోగించుట యుక్తము.

ఈదివసములలో రాత్రిప్రొద్దు ఎక్కువయగుటచేతను జఠరాగ్ని బలమైయుండుటచేతను నావశ్యకాల్యములను శీఘ్రముగా ముగించుకొని పెందలకడనే అన్నమును భుజింపవలసియుండును. వాతపిత్తహరములగు సిద్ధతైలములను తలకును శరీరమునకు బాగుగానంటుకొని జట్టీలుమంగళ్లుమున్నగు వారిచే ఒడలు నలిపించుకొనదగును. పాదాఘాతముల (నేర్పరులగువారు కొందరు కాళ్లతో సయుక్తితో త్రొక్కుచు శరీరమును నలుపుదురు. ఈపద్ధతి ఉత్తరహిందూస్థానమున నత్యధికముగను మనప్రాంతముల నల్పముగను వాడుకలోనున్నది. దీనికే పాదాఘాతమని పేరు)ను జరిపించుకొనవలయును. తైలములంటుకొని కేంతాకస్వేదమునుగాని కుంభీస్వేదమునుగాని జరిపించవలెను. సూర్యాతపమున కూరుచుండియైనను స్వేదమును జరిగింపవచ్చును. పిమ్మట నగరువస్తువులతో తోమి జిడ్డుపోగొట్టుకొని సుఖోష్ణోదకమున స్నానమాచరించి అగరు కుంకుమలగంధము మేనలదికొని అగరు, సాంబ్రాణిధూపముల పొగ వేసుకొనవలెను. ప్రయాణములయందును, కూర్చుండునపుడును, శయనమునను వేడిగానుండునట్లు చూచుకొనవలయును. రత్నకంబళ్లు, శాలువలు మున్నగు ఉన్నిగుడ్డలను ధరించుటకును కప్పుకొనుటకును నుపయోగింపవలయును. ఇట్టివస్త్రములచే కప్పఁబడియుండు శయ్యలపైనను

గర్భగృహములయందును భూగృహములయందును కుంపట్లు పున్నగువానిచే వెచ్చగనుండునట్లును చేసికొనవలయును.

పంటలన్నియు పండి చేతికివచ్చుటవలనను, ధనుర్మాసమును సంక్రాంతిపండుగరోజులు వసుటచేతను ఆంధ్రులీదినములను మిగులఆనందముతో గడపెదరు. వారివారి కుచితమగురీతిని భోగములనుభవించెదరు.

మార్గశిరశుద్ధపూర్ణిమకు కోరలపున్నమయని పేరు. ఆనాటికి మృత్యుదేవత స్వీయసహస్రకపాలమాలా పరికల్పితంబగు ప్రమకష్ఠాలంధరించి చూపరులకు గభీరంబగు ముఖగహ్వరంబున కరాళంబులగుకోరలు వెలువడ నట్టహాసంబొనర్చుచు సంచరించుచుండుననియు నాంధ్రులయందొకనమ్మికకలదు. అందుచే నీకోరలపున్నమనుండు నేరోగనుబచ్చినను నతిభయము చూపుచుందురు. కోరలపున్నమరోజులలోకలిగిన వ్యాధికి తిరుగుండదని వారినమ్మిక. "కార్తికస్యాంతిమాఃపక్షః మార్గశీర్షస్యచాదిమః యమదంష్ట్రా సమాఖ్యాతా అల్పాశీతత్రజీవతి"అని చెప్పుచు వాగ్భటాచార్యుడుకూడ ఈదినములకు యమదంష్ట్రయను నామంబొనర్చియివి మృత్యుప్రదములని సమ్మతించి యీవిషయమున నాంధ్రాశయమున నైకకంఠ్యము నగుపరచుచున్నాడు. "కార్తికస్యదినాన్యష్టావష్టావాగ్రయణస్యచ, యమదంష్ట్రాసమాఖ్యాతా స్వల్పభుక్తోహి జీవతి"యని శార్ఙ్గధరాచార్యుడు యీవిషయమును చెప్పుచు పదునైదుదినములుమాత్రము కోరలపున్నమరోజులని నియమించెను. ఇవ్విధమున నీవిషయములద తద్దృష్టితో పరిశీలించి ఉచితరీతినవర్తించి సుఖించుట ముఖ్యకర్తవ్యము.

## చంపకపుష్పము

హరి రాధాకృష్ణమూర్తిగారు

అమ్మ! యేను చంపకపుష్ప మగుదునేని
పచ్చనగు చెట్టుకొమ్మ పైభాగమునను
అదటుగాలికి నూగుచు నట్టులిట్టు
సంతసంబున నాట్యంబు సల్పుతరిని
కనుగొనగ గల్గెదొక్కొ నన్ననగ గోరి
'ముద్దుబిడ్డడ! యెటకేవు పోయితయ్య'
అనుచుబిల్చెదు. నేను మారాడకుండ
నాదురేకులనన్నింటి నాల్గుదెసల
పరచియూచుచునవ్వుచు మెరయుచుందు.
నీవుస్నానంబొనర్చి వినీలకుంత
లములు భుజములపై బడి ప్రమదమెసగ
ప్రార్థనాగేహమునకు నీబాటనేగు
తరిని నావాసనను నీవు తనివిగనెదు
కానియది నాదియని నీవు కనుగొనంగ
జాలవు. మరొక్కవేళ భోజనముచేసి
వీథిపైన గవాక్షంబు వెనుకగూరు
చుండి రామాయణంబీవు నిండుమతిని
జదువుతరి చంపకమునీడ జననినీదు
కురులపైనను సొగసైన యురముపైన
బడగ నాచిన్నినీడ నీపఠిత పుస్త
కమున నాపుటయందున గానబడెను
కాని యానీడ నీకుఅవానిదనుచు
నెరుగజాలవు దినభాగ మరుగువేళ
గాఢమగుచీకటులు బయల్ గ్రమ్మినపుడు
చేతనొక దివ్వెవెలుగ నీచెంతనున్న
పసులకొట్టాన కీవేగు పనియెరింగి
నేలపై బడి మరల నీవిసువుగనుచు
'అమ్మ నాకొక కథచెప్పవా' అటన్న
'చిలిపిపిల్లడ యెటనుండి జేరితనెదు'
'నేనుచెప్పను పో'అందు నిశ్చయముగ.

—రవీంద్రుని 'చంద్రవంక' నుండి.

# వ్రాయడం

జనమంచి కామేశ్వరరావుగారు

అమ్మా! నువ్వు నాన్న ఎన్నో పుస్తకాలు వ్రాస్తారంటావు; కాని ఏమిటే! ఆయనవ్రాసింది ఒక్కపిసరైనా నాకర్థంకాదు?

పోసీ! ఆయన సాయంకాలమంతా కూర్చుని నీకేవో చదివి వినిపిస్తున్నారు గదా! నిజంగాచెప్పు నీకేమైనా అర్థమయిందేమో!?

అమ్మా! నువ్వు మాకెంచక్కని కథల్చెప్పగలవుగదా! నాకాశ్చర్యం వేస్తుంది నాన్నెందుకల్లా వ్రాయగూడదు? చెప్పు.

అయితే నాన్నకెప్పుడూ వాళ్లమ్మ కథలుచెప్పలేదేమిటే!-రాక్షసుల గురించి, దేవతలగురించి, రాజకుమార్తెలగురించిని-

లేకపోతే, ఆయన విన్నవన్నీ మరచిపోయినారా ఏమిటే?

తరచు ఆయనస్నానానికి ఆలస్యంగాలేస్తే నువ్వెళ్లి వందసార్లు కేకెయ్యాలి. పైగా ఆయనకోసం వంటచల్లారిపోకుండా పొయ్యిదగ్గర పెట్టుంచుకుకూర్చుంటావు. కాని ఆయన అల్లాగేవ్రాసుకుంటూ నీమాటే మరుస్తారు.

ఓహో! చూస్తూంటే నాన్నకస్తమానమూ పుస్తకాలు వ్రాయడమే ఆటలాఉంది.

నేనెప్పుడైనా నాన్న గదిలోకి ఆడుకోడానికివెళ్లే నువ్వు నావెనకాలేవచ్చి "ఒరేయ్! అల్లరిబాజా! ఇల్లారా"అని పిలుస్తావు.

నేను పిసరంత గొల్లుచేయడం సరి, నువ్వు "నాన్నపనిచేసుకుంటున్నారు. కనబడుతోందా?" అంటావు.

ఏమిటే? నాన్నకూవేళాకోళం! బాగానేవుంది. అస్తమానం అదేవ్రాయడం వ్రాయడం? నేనొకసారి నాన్నకలమేనా పెన్సిలేనా తీసుకొని నాన్నపుస్తకంమీద ఆయన వ్రాసినట్టె అఆ, ఇఈ, ఉఊ-లు వ్రాస్తే నామీదనీకంత కోపమెందుకే? అమ్మా! నాన్నకూర్చుని వ్రాసుకుంటూంటే నువ్వొక్కమాటేనా అనవు.

నాన్న అల్లాకూర్చుని బొత్తులుకొద్దీ కాగితాలు పాడుచేస్తూంటే అమ్మా! నువ్వుచూడనట్టె ఊరుకుంటావేమే!

నేనుగనక ఒక్కకాగితం పడవచేసుకుందామని తీస్తేసరి నువ్వు "అరేయ్! అబ్బాయీ నువ్వు నన్నెంత వేగిస్తున్నావురా! ఎందుకుతీశావురా! ఆకాగితం" అంటావు. నాన్నఅల్లాకూర్చుని కాగితంతరువాత కాగితం తీసికొని రెండువైపులా నల్లగాపిచ్చిగీతలుపెట్టి పాడుచేస్తూన్నా నువ్వుకిమ్మనవు. —రవీంద్రుడు.

# పెళ్లి అంటే

వారణాశి రామలక్ష్మీనరసింహంగారు

౧

సువర్ణ డిప్యూటీ కలెక్టరుగారికూతురు. చాలా చురుకైంది. సార్థకనామ. హృదయనైర్మల్యం, శరీర సౌందర్యం, మేలిమిగుణాలు ఇట్లాంటివి అలంకారానికి అర్థస్ఫూర్తినిస్తున్నాయి. చుట్టుపక్కల యిళ్ళ వాళ్ళు "సువర్ణ చూడు ఎంతమంచిదో" అని తమ పిల్లలకి ఆదర్శంగాచూపుతూండేవాళ్ళు.

సువర్ణకి ఐదోయేటే పెళ్లయింది. చక్కా బాజాలొచ్చేయి, చుట్టాలంతావొచ్చేరు ఇంకా రకరకాల అప్పచ్చులు చేసుకున్నారు. ఇవన్నీ ఆపిల్లకోక పెద్ద పండగలాగా అర్థంఅయాయి. ఇంతే.

కూతురిపెళ్ళయిన కొద్దిరోజుల్లోనే డిప్యూటీ కలెక్టరుగారికి తమ వియ్యంకుడుగారివూరు బదిలీ అయింది. అక్కడ అల్లుడు తరచు తమ యింటికొస్తూండేవాడు. డిప్యూటీకలెక్టరుగారు సువర్ణతో అతను తనకి బావవుతాడని చెప్పేరు. అంతచిన్నపిల్లకి మొగుడూపెళ్ళాం ఇట్లాంటిమాటలుచెప్పి అవసరంలేని సిగ్గుతెప్పించి అర్థంకాని గొడవలోముంచటం ఆయన కిష్టంలేదు. బావ తనకి భర్తగా అర్థంఅయేలోగా ఏదోఒక సంబంధంవుంచితీరాలని ఇద్దర్నీ స్నేహితుల్ని చేశారు. యుక్తవయస్సురాగానే యిద్దరినీ ఒకరికొకరిని తెలుపుదాంఅని ఉద్దేశ్యం. ఈఆశయంకారణంగా బావతో సువర్ణని చనువుగా ఆడుకోనిచ్చేవారు.

సువర్ణకి బావదగ్గిర అతిచనువు. బావయింట్లోకి రాగానే 'బావాబావాపన్నీరుబావనిపట్టుకుతన్నేరు' అన్నపాటతో ఆహ్వానం. తరవాత ఆటలుపాటలూ, అప్పుడప్పుడు చదువుకునేవాళ్ళుగూడాను. అంటే బావ చదువుచెప్పేవాడన్నమాట.

౨

ఒకరోజున సువర్ణ బడినించి వచ్చింది. అప్పటికే నాన్నగారు ఆఫీసునుంచివచ్చేరు. కాసేపటికి బావ కూడా వొచ్చేడు. అప్పుడు మొహం యింతపొడుగు చేసి సువర్ణ అంది, "నాన్నా! నాన్నా! బావట, మరే, నాకు మొగుడవుతాట్ట! మొగుడూగిగుడూనూ, బళ్లో అమ్మన్న, చిట్టీ, సుందరం అంతా 'ఒకమ్మాయి మొగుడుదగ్గిర చదువుకుంటోంది' అని వుడికిస్తున్నారు నాన్నా. నేనివ్వాళనించీ బావపాఠానికే వుండను అట్లాఅయితే."

"వాళ్ళకేం తెలుసు వాళ్ళతలకాయ. మొగుడేమిటి నాకు బావవుతాడు అనిచెప్పు. ఉడికిలటం ఎందుకూ ఉడికిలినకొద్దీ మరీవుడికిలిస్తారు."

ఇంతలోనే అమ్మ ఇంట్లోంచి పనివాళ్లా అక్కడికొచ్చి "ఏం, అంటే యేమే నీదేంపోయింది. అవును గనకే అన్నారు. మొగుడైతేనేం ఇంతలోనే ఆడుకోవొచ్చు మరేంఫరవాలా."

"చూశావు నాన్నా! అవునుగనకే అన్నారుటా! అమ్మ అంటోంది" అని కోపంవొచ్చి కొంచంనీళ్ళు కార్చింది అమాయికపు కళ్ళవెంట.

"ఏమిటంట అదినీకు ఊఁ చెప్పుతూన్న కొద్దీను. సువర్ణం! నీకెందుకు నువ్వువెళ్లి బావతో ఆడుకో అమ్మా."

సువర్ణ ఆడుకోవన్నది. కాసేపుండి బావ వెళ్లిపోయాడు.

... ... ...

చీకటిపడ్డది. అంతా అన్నాలుతిన్నారు. సువర్ణ భోంచేసిన కాస్సేపటిలోనే పడుకుని నిద్రపోయింది.

"నీకు చెప్పుతూన్న కొద్దీ ఏమిటది. ఎందుకూ దానికి మొగడూ పింగినాదం ఇట్లాంటివేవీ చెప్పొద్దే అంటేను."

"ఏమిటండీ ఆమాత్రం అన్నా తెలియక్కర్లా, దాందుంపతెగిపోయినచెర. ఇహా యిట్లాఅయితే పెద్దదయాక అతనంటేయేమన్నా లక్ష్యం వుంటుందీ. ఆమాత్రంచెప్పకపోతే రొల్లా? అదుపూ ఆజ్ఞాఅన్నా వుండాలా అక్కర్లేదా?"

"ఇప్పుడు చెప్పితే మాత్రం యేడుస్తుందా యేమిటి అదుపు. మాఅమ్మ వస్తుంది అదుండగానే చెయ్యండి పెళ్లి అని గోలచేసి పోరుబెడితే నీపోరు పడలేక చేశాను. లేకపోతే కూనకి దానికి పెళ్ళేమిటి. చేశాం గదా పోనీ సమర్థించుకుందాం అంటే నీనోటికి తాళం లేదాయె."

"అయ్యో తాళంలేకేం ఇదంతా తాళం వెయ్యటమే. అయినా నాకెందుకొచ్చింది. మీయిష్టం వొచ్చినట్టు చేసుకోండి."

## 3

"ఒకమ్మాయి మొగుడిదగ్గిర చదువుకుంటోంది" అన్నారు చిట్టీవాళ్ళూ.

"మొగుడేమిటే పాపం బేను. ఈమారన్నారా అంటే పంతులమ్మగారితో చెప్పకపోతే అప్పుడనండి."

ఇది బడిపసారాలో జరిగింది. సువర్ణ ఆమాటలంటూ వుండగా పంతులమ్మగారట్లా వొచ్చేరు. అంచాత చిట్టీవాళ్ళకి వాళ్ళనేడిపించేందుకు తావు దొరికింది కాదు. ఊరుకున్నారు.

... ... ...

మధ్యాహ్నం. అంతా బడికొచ్చేరు చిట్టీవాళ్ళూ, సువర్ణాఅందరూను. సువర్ణ వాళ్ళవంక చూస్తూ ఆశ్చర్యం భయంకలిపి అంది "చిట్టీ! నీ మెళ్ళో గొలుసేమైందే? పారేసుకున్నావా?"

"లా. వూళ్ళోదొంగల భయంగా వుందిట అందుకని మాఅమ్మ తీసిదాచేసింది. ఎవళ్ళమ్మాయినో ఎత్తుకుపోయినగలు తీసుకుని వూరుబయట వదిలిపెట్టి వెళ్ళారుటగూడాను"

"అమ్మయ్యో! నగలకోసం పిల్లల్నెత్తుకుపోవడమా. నేను నాదండతీసి జేబులో దాచేసుకుంటాను యింటికెళ్ళేప్పుడు."

"ఏదండ!!"

"ఇదీ" అని మంగళసూత్రం చూపించింది.

"ఛీఛీ! అదేమిటి మంగళసూత్రాన్ని?"

"మంగళసూత్రంఏమిటీ? దండని చూసి దానికోసం నన్నుకూడా యెత్తుకుపోతారేమో దొంగలని భయంచేత దాచుకుంటానన్నాను."

"అది సరేలే. మరి మంగళసూత్రాన్ని తియ్యొచ్చా?"

... ... ...

సాయంకాలం. సువర్ణ బడినించి వచ్చింది. వచ్చే రావటంతోటే అమ్మదగ్గిరకి వెళ్లింది. అమ్మ లోపలి సావిట్లోకూర్చుని జడవేసుకుంటూ పక్కింటావిడతో మాట్లాడుతోంది.

"అమ్మా! యీకాసులదండ తీసెయ్యవ్. దొంగలున్నారు వూళ్ళో, చిట్టిచెప్పింది. వాళ్ళమ్మ అందుకని తన గొలుసుతీసి దాచేసిందని."

అమ్మ వినిపించుకోలా.

"ఏమే అమ్మా! తియ్యవుటే"

అమ్మ వినిపించుకోనేలేదు.

ఇంతలోనే నాన్నగారు వచ్చేరు ఆఫీసునించి. సువర్ణ ఆయనదగ్గిరకువెళ్ళి "నాన్నా! ఈదండతీసి దాచిపెట్టమనవు అమ్మని."

ఆయనేదో ఆఫీసుసంబంధపు ఆలోచనలో పరధ్యానంగాఉండి "అమ్మనడుగుపో" అన్నారు. సువర్ణ అమ్మదగ్గిరకొచ్చి మళ్ళీ గోలచేసింది.

"ఏమిటే మాట వినిపించుకోనీవేం. కాస్సేపుండు. ఒకటేమాయగోల" అని కసురుకున్నది అమ్మ.

సువర్ణ తనపుస్తకాలు దాచుకుని కాళ్ళూచేతులూ కడుక్కుని మళ్ళీ అమ్మదగ్గిరకు వెళ్లింది. సువర్ణ కనపడడంతోటే "మాటాచోరనియ్యవ్ మన్నూచోరనియ్యవ్. చెప్పు. ఏమిటే నీగోల?" అంది అమ్మ.

"కాదే అమ్మా! మరీ వూళ్ళోదొంగలున్నారుటే. నగలకోసం పిల్లల్నెత్తుకుపోతున్నారుట. చిట్టితన మెళ్ళోగొలుసుతీసి వాళ్ళమ్మచేత దాయించుకుంది. నాదండకూడా దాచెయ్యి. నాకుభయంవేస్తోంది బడికెళ్ళడానికి" అంటూ తనమంగళసూత్రాన్ని వూడదీసింది.

"ఛీ! పాడుపిల్లా. మంగళసూత్రం తీస్తున్నావేమిటి?"అని రెండుగట్టిగా చరిచిందివీపుమీద. సువర్ణ ఏడిచింది. నాన్నగారదివిని "ఏమిటి దాన్నట్లా బాది చంపుతూన్నావు" అంటూ లోపలికొచ్చేరు.

"చూశారా? మీ పెంచటం. మంగళసూత్రాన్ని కాస్తా వూడదీసి అక్కడ పెట్టింది."

"దానికేం తెలుసు పాపం."

"ఇంకా యెట్లాచచ్చేది? చెప్పితేచెప్పుతున్నావు అంటిరి. చెప్పకపోతే తెలియదారొనంటిరి. చెప్పకపోతే యెట్లా తెలుస్తుంది. రేపు మరోలాగా గుండు చేయించుకు తిరుగుతానంటుంది. ఎందుకొచ్చింది. మెల్లిగా దాన్ని కిరస్తానల్లో కలిపితేగాని మీకునిద్దర పట్టదు. ఇదీ ఒక పెంపకమేటి?"

"నువ్వు అక్కడికి విరమించు. నేను చెప్పతాన్లే చెప్పాలిసినవిధాన. అయినకాడికి బాదితే తెలుస్తాయా యివ్వి?"

సువర్ణని ఓదార్చి తనతో షికారుతీసుకునివెళ్ళేరు డిప్యూటీకలెక్టరుగారు. త్రోవలో అదిమామూలుదండగాదనీ, ఆంజనేయుని బిళ్ళలాంటిదనీ, అది మెళ్ళో ఉన్నంతకాలం తననేయితరగ్రహంఆవేశించవెలుస్తుందనీ నచ్చచెప్పేరు. అంతగాభయం అయితే బంట్రోతుని వెంటబెట్టి పంపుతానుబడికన్నారు.

౪

సువర్ణకి బావ చదువుచెప్పేందుకుకాలం సాయంత్రం. "సాయంకాలంగూడా యేంచదువు? ఆడుకోనన్నా నివ్వరుదాన్ని పాపం. ఇట్లా అయితే పిల్ల యెల్లాకోలుకుంటుంది?" అంటూ తన అయిష్టాన్ని సూచిస్తూవుండేది సువర్ణ నాయినమ్మ. నాన్నగారు గూడా అవునంటూండేవారు కాని సువర్ణ బావదగ్గిర చదువుకోటంతో ఆడుకోనిలోభం పట్టివ్వటంలేదని వూరుకున్నారు. ఇక వాళ్ళచదువు బహుతమాషాగా వుంటుంది. అత్తగారడుగుతూండేది అప్పుడప్పుడు "బాగాచదువుతోందా? చదువు ఏమన్నా వొస్తోందా దానికి?"అని. "ఆ వొస్తూనేవుంది. పాఠాలు కొలతలేకుండా జరుగుతున్నాయి"అనేవాడు.

బావే నవ్వుకుంటూండేవాడు. "దాదాపు రెండు సంవత్సరాలవుతోంది సువర్ణకి చదువు చెప్పటం మొదలుపెట్టి. ఏపుస్తకంలోనన్నా గాని పట్టుమని పదిపేజీలన్నా నడవలేదు. బలేచదువు"అని.

సువర్ణకి మొగుడూపెళ్ళాం ఇట్లాంటి మాటలు వినటం అసహ్యంగావుండేది. ఏపుస్తకంలోనన్నా యివ్వి తటస్థించాయా ఇహ ఆపుస్తకం అక్కడికాఖరు. సాధారణంగా అన్నిపుస్తకాల్లోనూ వుంటాయియివ్వి. అందుకనే బావకి వారంరోజులు పట్టింది సువర్ణకోసం పెళ్లిమాటలులేని ఒక్కమంచి పుస్తకంఏరేటందుకు.

ఆపుస్తకాలుతెచ్చి చదివించేవాడు. ఒకకథలో ఒకబీదముసలిది. రాత్రివేళ చలిలోవొణుకుతోంది. అదిచూసి ఒకకుర్రాడు ఆముసలిదాన్ని ఇంట్లోకితీసుకువెళ్ళి దానికాళ్లు కడిగి, తుడిచి, అన్నం పెట్టించి పడుకోజేశాడు. అది చదివినవ్వింది సువర్ణ అదేమిటూ అబ్బాయి అడుక్కుతినేదానికాళ్లు పట్టుకోడం అని. బావకానవ్వు అర్థమైంది. "నవ్వుతావేం? బీదదిచలిలో చచ్చిపోకుండా కాపాడేడు. మనంగూడా అట్లాగే చెయ్యొచ్చు. చెయ్యొచ్చేమిటి చెయ్యాలి. ఎవరన్నా దిక్కు తెలియక పోతూవుంటే మనం వాళ్ళ నాదరించాలి—"అని ఇంకా యేమిటో చెప్పబోతూంటే మధ్యే, "మొన్న నే, ఎవరో అబ్బాయే, పాపం అయిదేళ్లుంటాయి, తప్పిపోయి యేడుస్తూ మాయింటిముందర నించిపోతూంటేను—"

"లోపలికిఎత్తుకొచ్చి అన్నం పెట్టించేవా?"

"ఛీ"

"ఛీ! ఛీ యేమిటి. అట్లాంటప్పుడు, మతి, ఆఅబ్బాయి నల్లా వొదిలేస్తే ఏబళ్ళకిందన్నా పడితే."

ఇట్లాగేయేదో ఒకమాటమీద చిన్నచిన్న వుపన్యాసాలిస్తూండేవాడు. వీటితో చదువుసాగేదిగాదు. ఈవుపన్యాసాలనే పాఠాలని వాడుతూండేవాడు.

... ... ...

ఏదోఒక సందర్భంలో ఒకరోజున "మంచిస్నేహితులు కావాలిసొస్తే ఒకళ్ళకోసం వొకళ్ళుత మ

ప్రాణాలుగూడా అర్పించుకుంటారు ఏపనినైనాసరే ప్రేమవల్ల చెయ్యగలుగుతారు" అని చెప్పేడు.

"ప్రేమఅంటే"

"చెప్పుతా—నాకు కాసిని మంచినీళ్ళు తెచ్చి పెడతావ్."

సువర్ణ వెళ్ళి మంచినీళ్ళు తెచ్చి అక్కడ పెట్టింది. బావ నీళ్ళుతాగలే.

"తాగూ"

"ఆ, తాగుతా...ఈనీళ్లెందుకు తెచ్చావ్?"

"నువ్వు తెమ్మన్నావుగా."

"ఐతేమట్టుకు ఎందుకు తేవాలి. లేకపోతే యేం యింతలోనే?"

"మళినీకు కావాలిగా మంచినీళ్లు."

"ప్రేమంటేఅదే. నేను చెప్పినపనిని చెయ్యకుండా వుండనియ్యనిది అదే ప్రేమ."

... ... ...

తరవాత రెండురోజులకి. చదువుకుంటూ చదువుకుంటూ "నేను రేపునాయనమ్మతో వూరికెడుతాను. మూడురోజులదాకా రాను" అంది.

"వెళ్ళకపోతే యేం?"

"ఐతే వెళ్ళొద్దంటావా"

"ఊ" అనివూరికేనే, నవ్వుతూ అన్నాడు.

"వెళ్ళనులే"

"పాపం, ఏం, ఇంతలోనే మార్చుకున్నావు?"

"వూరికేనే"

"అంటే?"

"ఆహా, కాదూ, మళీమొన్న నువ్వు చెప్పావలా అంచాత."

"అర్థంకాలా"

"ప్రేమచేత"

"పోనీలే వెళ్ళు"

"నిజంగాఅంటే వెడతాను."

"నిజంగా"

"సరే ఐతేవెడతా"

అవును. ప్రేమచేతేసువర్ణ వూరికెళ్ళనగలిగింది. ప్రేమచేతే నిజంగా వెళ్ళమంటే వెడతానన్నది. లోకంలో అమలులోవుండేఅర్థంకా దిక్కడ ప్రేమకి.

డిప్యూటీకలెక్టరుగారు వీళ్ళిద్దరికి స్నేహాన్ని కలపదలుచుకున్నారు. ఆవుద్దేశ్యం యిట్లా నెరవేరింది.

౫

బావకావూళ్ళో చదువైపోయింది. ఎఫ్. ఎ. కి చెన్నపట్నం వెళ్ళేడు. సువర్ణ కేమీతోచేదిగాదు బాగా అలవాటైన బావతోటి చదువు మానవలసి నప్పటినుంచి యేమిటో కొత్తగావుండేది. ఆడుకో డానికి వుత్సాహంవుండదు. చదువుకోడానికి యిష్టం వుండదు.

... ... ...

ఒకరోజావ డిప్యూటీకలెక్టరుగారు భార్యతో అన్నారు "మన సువర్ణని అడయార్ పంపుదాం"అని.

"అడయార్ పంపినాసరే యేయేట్లోదింపినాసరే. ముందేచెప్పేనుగా కిరస్తానల్లో కలపమని. అంతే. నాకెందుకివన్నీ.పిల్లనడవడంతా పాడవాలంటే అట్లా చెయ్యండి."

"అదిగాదు. అక్కడికెడితే వాళ్ళచదువూ ఆటలూ పాటలూ ఆర్థోరణీగాని ఇహ యీమొగుడూపెళ్ళాం ఈగోడేమీవుండదు. ఒక్కనాలుగైదేళ్ళుంచితే చాలు. గుణాలకిస్థిరత యేర్పడుతుంది."

"ఈపెటకంయెవళ్ళు పెట్టారుబాబూ. ఇదివరకెప్పుడూలేవే యీవుద్దేశ్యాలు."

"పెటకంయేమిటి నీతలకాయ. ఒకళ్ళు చెప్పేదేముంది యిందులో. బుద్ధిమాంద్యం వొదులుతూంటే అవ్వే స్ఫురిస్తాయి."

... ... ...

అడయారులో డిప్యూటీకలెక్టరుగారు తలచినట్లు మొగుడూపెళ్ళాం ఇట్లాంటివి వినబడవు. కాని ఆవాతావరణంలోవుంటే అన్నిటి నిజరూపాలూ తెలుస్తాయి. ఒకరుచెప్పనక్కర్లేదు.

సువర్ణకి పదిహేనేళ్ళొచ్చాయి. జగత్తుయొక్క ఆస్థిత్వానికిప్రేమేమూలాధారం ఆనేపద్ధతిపిల్ల అయింది

సువర్ణ, మనసారస్వతంలో భద్రములై వున్న సావిత్రీ మొదలైన పతివ్రతలజీవితాలు బాగాచదువుకుంది. అందరూ చదువుకున్నట్టుగాదు. సావిత్రియొక్క పాతివ్రత్యాన్ని బాగా అర్థంచేసుకుంది. అంటే ప్రేమ సర్వాంజయిఅని. ఈవిశ్వాసం సువర్ణహృదయంలో బాగానాటుకుంది.

... ... ...

సువర్ణ నిర్మలప్రేమనుగూర్చి వ్యాసాలువ్రాసేది. స్కూలులో చిన్నచిన్న ఉపన్యాసాలుగూడా యిచ్చేది. "లోకం 'పెళ్లి' అన్నదాన్నిసరిగా అర్థం చేసుకోవాలి. అర్థంతెలుసుకుంటే మరి ఆ'పెళ్ళి' అన్నమాటని మనం మామూలుగావాడుకుంటూన్నట్టు చవకగావాడలేం. దాన్నిఅనవసరంగా అర్థంలేకుండా వాడటంఅంటే భయంవేస్తుంది గొప్పతప్పిదం చేస్తు న్నాంఅని. ఎంతమందో స్నేహితులుంటారు. అందరి పేర్లూ మనకి తెలియవు. హృదయాలు రెండుకలసిన స్నేహితులకి ఒకరిపేరుతో వొకరికి అవసరంవుండదు. వ్యక్తికిప్రాధాన్యం. పేరుకి అదిలేదు. పెళ్ళిఅంటే ఒకళ్ళకొకళ్ళు కావలిస్తే బలియివ్వకోగల ఎన్నటికి విరగని స్నేహసంబంధం. ఇట్లాంటి ప్రేమసంబంధం లోకవిదితం చెయ్యటానికిపెట్టింది పెళ్లిఅన్నఆచారం. కాని యీఆచారసంబంధి అయిన కర్మకాండమూలాన యేర్పడేదికాదు ఆఅవిచ్ఛిన్నసంబంధం. ఒకరికొకరు అప్రయత్నంగానే పెళ్ళియిపోతారు. ఆ'కర్మ'కాదు పెళ్ళిచేసేది"అని చెప్పిందొకసారి స్కూలులో.

అప్పుడు ఎవరో అన్నారు "అట్లాంటిప్రేమ ఇప్పుడున్నదా?"అని.దానికి చమత్కారంగా జవాబు చెప్పింది. "పూర్వంవుండేది. ఇపుడులేదు. దాన్ని దేవతలు ఎత్తుకుపోయారు. 'మీరుచెడి రాక్షసతుల్యు లవుతున్నారు. జీవనాధారం అయినప్రేమని మీకు దొరకనిస్తే రాక్షసులకిఅమృతందొరకనిచ్చినట్టు"అని.

౬

ఎండాకాలంశెలవులు రాబోతున్నాయ్. అంటే ఫిబ్రవరిలో అన్నమాట. డిప్యూటీకలెక్టరుగారు, కూతురూ అల్లుడూరాగానే కార్యంతలపెట్టి తత్ప్ర యత్నంలోవున్నారు.

... ... ...

సువర్ణ పదిహేనురోజుల్లో వొస్తుంది. హడా విడిగావున్నారు డిప్యూటీకలెక్టరుగారు, తుదిరంగం యెట్లాఆడించడమాఅని. సువర్ణకి తెలిసినా బావతన భర్తఅని, తాను వాళ్ళిద్దరినికూర్చితెలియచెప్పి మంగళ హారతితో తన సమర్థింపునాటకం ముగించి తెరదిం పించుదాం అనుకున్నారు.

... ... ...

ఒకరోజున సువర్ణదగ్గరనించి ఒకకవరువచ్చింది. వస్తున్నానని వ్రాసింది కామల్లునని కవరు చించేరు. అందులో ఒక ఇన్విటేషన్ కార్డుంది. నిర్విణ్ణుడైనాడు. మొహం కళాహీనంఅయింది.

"సువర్ణకి, ఆర్. రామన్‌కి 25-వ తారీఖున (అంటేరేపే) అడయారులో పెళ్ళిట"అన్నారు తల వంచి పెళ్ళాంతో.

"ఐంది! అనుకున్నంతా అయింది"అని గొల్లున యేడుస్తూ భర్తని ఆగకతిట్ట మొదలుపెట్టింది.

పాపం ఆయనేంచేస్తారు. మొహం యింకై పోయింది.

... ... ...

నలుగురు పెద్దమనుష్యుల్ని తీసుకుని మద్రాసు చేరేరు. వెంటనే మోటారులో అడయారు వెళ్ళేరు.

"శ్రుతిమించింది. రాగంకూడా ఆలపడ్డది. సువర్ణని మందలించడంకన్నా ఆరామన్ నెవరినో బతిమాలు కుంటే మంచిది''అని అందరు నిశ్చయించుకున్నారు.

రామన్ అన్న ఆయనవుండే యింటికోసం భోగట్టా చేశారు. ఆయింట్లోకి వెళ్ళేరు. లోపల బావకనిపిం చేడు. "ఏం?రమణాయిక్కడున్నావు?"

"సువర్ణపెళ్ళికివచ్చేం. మీరూ అందుకేనా?ఏమిటి? ఇదేమనకిఖిడిది. పెళ్ళికూతురిగారిల్లు కొంచందూరా న వుంది."

"అయితే రామన్ మండాకోడుకేడీ? నీవిట్లా దద్దమ్మలాగు కూర్చున్నావేం నీదాగ నింకోడికిస్తూ."

"ఉండండి మామగారూ! ఇప్పుడేవస్తా. పెళ్ళికూతురు బయల్దేరినట్టుంది మేళాలు వినపడుతున్నాయి ముహూర్తందగ్గిరకొచ్చింది" అని లోపలికి వెళ్ళుతాడు.

"ఇంకా మామగారేమిటి? వెంగళతనం లేనిద్విపాద పశువా!"

... ౯. ...

వాకిట్లో మేళాలు సమీపిస్తున్న అలజడి వినపడుతుంది. వీళ్ళంతా బయటికి పరుగునవచ్చేరు. ఊరేగింపు వాకిట్లో ఆగింది. చుట్టూతా అక్కడి ఆడపిల్లలు నడుస్తూంటే సువర్ణ ఖద్దరు-చీరగట్టి శృంగారించుకుని చేతులో పూలమాలతో ఇల్లుప్రవేశించింది. నాన్నా వాళ్ళూ దిక్కుతోచక చిత్రప్రతిమలలాగునుండిపోయారు. లోపల ఖద్దరుధారియై పెళ్ళికొడుకు పెళ్లికూతుర్ని ఎదుర్కున్నాడు. ఒకరిమెళ్ళో ఒకరు దండలువేసుకున్నారు. "ఆనాటి పెళ్ళిమీకర్థం అయింది, యీనాటిపెళ్ళి మాకర్థంఅయింది" అన్నది సువర్ణ. నాన్నా అందరు దంపతుల నాశీర్వదించేరు. పెళ్ళికొడుకుబావే. "సువర్ణా! ఈసంగతితెలిస్తే మన వాళ్ళనందరినీ తీసుకునొచ్చేవాణ్ణిగా. వాళ్ళూ ఆనందించేవాళ్లు."

"ఇంచింజేముంది. మనవూళ్లో తృతీయంవివాహం చేసుకుంటాం."

## నిశ్రేణి

ఈధనుర్మాససౌభాగ్య మేమిదేమి
ఇంతజీర్ణించుకొన్న నాహృదయమిపుడు
ప్రమానుపడ్డది మధురసంధ్యానిలంపు
శీకరమ్ములనేని హాసింపకుండ.
ప్రకృతికాంతిల్లి మకరశోభనల పుచ్చ
పువ్వు లేతవెన్నెలల నవ్వుకొని ముద్ద
బంతిచేమంతిబంతుల పరువుచూచి
మోమువాంచి సుధాత్రపామూర్తియాయె.
ఏవరులేరేమినాకు నేనేవిముక్త
విరహసుషిరాన మ్రోసిన తరళనయన

### సహదేవ సూర్యప్రకాశ రావుగారు

పాళికామధుమాలికాపదములోలయు
అసురసంజలో గొంతెత్తి అవసిపోతి.
మూగచెరపీడి ఎప్పుడు ప్రొద్దువోవు?
ఇన్నినల్లనికన్నులు నన్నుచూచు
తెప్పవాల్పవు గ్రుడ్లులు త్రిప్పుకొనవు
వెఱచిపోదునేమోయన్న బెదరులేదు.
ఆశతో రాగసూత్రమ్ము లల్లుకొనుచు
మొక్కవోయినలోకమ్ము పొంతబోక
తూర్పురేకలో నిట్టెట్టె త్రుళ్ళిపడుచు
కడలుప్రాకగా నిశ్రేణి గట్టెక్కొదు.

—'వకుళమాల'నుండి.

## వటపత్రశాయి

వటపత్రశాయివై వనజేక్షణా! నీవు
అబ్ధిలోదేల కారణమదేమొ
ఆదిమహాలక్ష్మి హృదయసీమను బాసి
యబ్ధిలోదేల కారణమదేమొ
భక్తనరదుండవు భక్తులబ్రోవలి
యబ్ధిలోదేల కారణమదేమొ

### శ్రీమతి పోతాప్రగడ రాజరత్నమ్మగారు

జగములబోషించి సక్కజేయుటమాని
యబ్ధిలోదేల కారణమదేమొ
ఆశ్రితులరోసి, యర్ధాంగినవలదిగిచి
శంఖచక్రంబులన్ద్రోచి జగమువఱచి
రేయింటి వటపత్రశాయివై యోగనిద్ర
యొడలుదెలియకయుంటకుయొద్దికలదొ?

# సాత్త్విక నిరోధము

కొర్లిమర్ల నరసింహముగారు

"బాబూ! విదేశవస్త్రముకొనవలదు" అను ఆబాలిక మృదువచనములు దుకాణపు గడప నెక్కబోవుచున్న ఆతనిని నిలువజేసినవి. అతడు తీక్షణదృష్టితో నాబాలిక ముఖకమలమును వీక్షించెను. అతని చూపులజూచి అమాయికయగు నాబాలికచూపులు నీరవమయ్యెను. కృతాంజలియై ఆబాలిక తలవంచి అతనికడ్డముగా నిలబడెను.

అతను క్రోధాంధుడయ్యెను. తక్షణమాతడొక్క పెట్టున సుకుమారియగు నాబాలికను త్రోసివైచెను. ఆత్రోపునకాబాలిక క్రిందబడెను. తలపై గొప్పగాయము తగిలెను. రక్తముకాల్వగట్టి బట్టలనెల్ల తడిపివైచెను.

అప్పటికిని ఆబాలిక తనకుగల దేశభక్తి ప్రోత్సాహింప తటాలునలేచి అతనిముందటికిజని "తండ్రీ! నాప్రాణములుపోయిన పోనిమ్ము. విదేశవస్త్రములకొని దుర్భర క్షుద్బాధా పీడితులైయున్న భారతసోదరసోదరీమణుల ప్రాణముల తీయకుము" అని ఆబాలిక యిక మాట్లాడనేరక, తలపైని గాయపుబాధ అధికమగుటచే, అతని పాదములకడ్డముగ "వి..దే..శ...తీయ...కు" మనుచు స్మృతివిహీనయై పడిపోయెను.

సోదరీ! నీదేశభక్తి నిరుపమానము. నిన్నుగన్న నీతల్లి భాగ్యమే భాగ్యము. నీవంటి సోదరీమణులవలననే సుమీ! యథఃపతితమైయున్న భారతనారీమణి గౌరవము దశదిశల ప్రాకమొదలిడినది.

# ఎఱ్ఱక్కసానమ్మ

శ్రీ శేషాద్రిరమణకవులు

ఆంధ్రదేశమునకు శాశ్వతసేవ గావించి యప్రతిమానయశో మార్జించిన ఎఱ్ఱక్కసానమ్మ పవిత్రజీవితము మఱచిపోయితిమి. శాసనాధారములు ప్రవాదములు స్థానికచరిత్రాంశములు ఆధారము జేసికొని ఈవీరకాంత జీవితమును సంగ్రహముగ జేసి తెలిపికొన యత్నించెదము.

ఎఱ్ఱక్కసానమ్మ చతుర్థవంశమున జనించెను. తండ్రి కామరెనాయకుఁడు. తల్లి పేరు దవపేరు నొక్కటియ. తోఁబుట్టువు నామ్ణనాయకుఁడు. తండ్రియు సహోదరుఁడును కాకతీయరుద్రదేవునియొద్ద సేనానాయకులుగా నుండి మహత్తరప్రతిష్ఠ గడించిరి. వీరుఁడగు తండ్రి ఎఱ్ఱక్కసానికిఁ జిన్నతనముననే నాంకనాయకునితోఁబాటు సర్వవిద్యలు నేర్పించెను. బాల్యముననే విద్యావివేకములచేఁ బేరొందిన యీకన్యను మహాశౌర్యశాలియు సత్యవ్రతుఁడును రుద్రదేవసామ్రాజ్యభారవాహుఁడును అమనగంటిపురాధిపతియు నగు చేతభూపాలుఁడు పెండ్లాడెను. ఈయుభయుల దాంపత్య మాదర్శప్రాయమై యుండెను. ఈయుత్తమదంపతులకు వీరరత్నమని ప్రశంసగొన్న మల్లభూవల్లభుఁడు జనించెను. అనంతరము కాకతీయులకును దేవగిరిరాజులకు జరిగిన ఘోరసంగరములలో మహాదేవరాయలపక్షమున దండయాత్రకేగి చేతిరెడ్డి వీరమరణము నొందెను. అచంచలదీక్షావంతురాలును విజ్ఞానశోభితయునగు ఎఱ్ఱక్కసానమ్మ భర్తృమరణమునకుఁ జాల చింతించెను. సహగమనముజేయ సిద్ధముగనుండ బంధువులును గాకతీశ్వరుఁడును గొమారుని జూచుకొని వీరకృత్యము మానుకొమ్మని ప్రతిమాలిరి. విధిలేక ఎఱ్ఱక్కసానమ్మ కుమారునిపక్షమున అమనగంటిరాజ్యమును జిరకాలము పాలించి దేశము సుభిక్షముగావించి యనేకధర్మకార్యము లొనర్చెను.

ఆమనగంటిరాజ్యము కాకతీయులకు సామంతరాజ్యము. చేతిరెడ్డి గతించునటకు మూలధనము విస్తారముగ లేదు. ఆపవ రుద్రదేవునికడ సేనానిగ నుంటచేతను మగనిచాటుననున్న సాధ్విగావను రాజకీయములలో ఎఱ్ఱక్కసానమ్మ జోక్యము కలుగఁజేసికొన వీలు కలుగనందునను రాజ్యస్థితిగతులు కొంతకాలము కల్లోలముగనుండెను. మగఁడు గతింపఁగనే ఎఱ్ఱక్కసానమ్మ రాజ్యమునకువచ్చి చేసిన సౌకర్యములు చాలఁగలవు. దుర్భిక్షమున కాటపట్టుగనున్న తనరాజ్యమునఁ జెక్కుతటాకములు నిర్మించెను. అందు లక్ష్మీసముద్రము, ఎఱుకసముద్రము ప్రధానమైనవి. ఈరెంటికి తన ప్రధానగ్రామములలో తావుపీఠ తోలంగెను. చిరకాలము నీరునిలుచుటకై తటాకగర్భముల పెంపొందించి జీవనదులనుండి కాలువలు పెట్టించెను. పలుతావులఁ జెలువులు వేయించెను.

అంతతోఁబోక మనోహరశిల్పాభిరామములగు దేవళములను పిల్లలమఱ్ఱియను గ్రామమున నిర్మింపఁజేసెను. అందలిశిల్పము దర్శనీయమైనది. ఆలయనిర్మాణమునఁ దానుస్వయముగాఁ బాల్గొని పేరొందినశిల్పుల రావించి సుస్థిరముగ ఆదర్శరూపముగ నుండునటులఁ గట్టించెను. అంతియగాక ఎఱుకసముద్రమను తనపేరింటి తటాకముపయిని గూడ నొకదేవళము గట్టించెను.

పిల్లలమఱ్ఱి జైమినిభారతమురచించిన పినవీరభద్రుని నివాసస్థలము. పినవీరునకంటెఁ బూర్వకాలముననే యీగ్రామమునకుఁ బ్రసిద్ధిగలదు. ఈప్రసిద్ధస్థలమున ఎఱ్ఱక్కసానమ్మ కట్టించిన ఎఱకేశ్వరాలయము దర్శనీయము. ఆలయముచెంత విశేషవిశాలప్రదేశము గలదు. అచట బాటసారులకు విశ్రాంతిమందిరము, భక్తులకు మఠము, పూజాదులకుఁ దనపేరటఁగట్టించినయెఱకపురము దానముగావించెను. తమతల్లిపేరఁ బ్రతిష్ఠించిన ఎఱకేశ్వరదేవరకుఁ, దండ్రిపేరఁ బ్రతిష్ఠించిన కామరేశ్వరునకుఁ, దాను బ్రతిష్ఠించిన త్రిపురాదేవికి ఈవీరమాత

నీరవసతుల నొసంగి సుప్రశస్తి గడించెను. మఱియొకమారు భక్తులకొఱకు మఠముగట్టించి దానికి ఎఱుక మఠమని నామకరణము గావించెను.

ఎఱుకసముద్రము క్రిందిభూమి నీయమ కొంతవిభజించి సత్రము శాశ్వతముగ నడచుటకును సత్రమున వంటచేయు బ్రాహ్మణులవేతనమునకును విద్యార్థులకు అన్నవస్త్రములొసంగుటకుఁ జలివెందరలో నీరుపోయు వారివేతనములకు నొసంగి తగిన కట్టడిగావించి తద్ధర్మములు శాశ్వతముగానడచుటకు గొప్పశాసనము పాతించెను. క్రీ. శ 1208 సంవత్సరమునఁ గాకతీయగణపతిదేవచక్రవర్తి ఒరంగల్లురాజ్యము పాలించుతఱి నీధర్మ ప్రతిష్ఠాపనము జరిగెను. ఈధర్మములను పేర్కొను శాసనమందు విస్తరించి ఎఱ్ఱక్కసానమ్మ గుణప్రశంస గలదు. దానింబట్టిచూడ నీయమ విద్యావివేకములందె గాక దైవభక్తియందును త్యాగమునందుఁ బరిపాలన కౌశలమునందును అసమానురాలని విశ్వసింపవచ్చును. ఆయమ గుణప్రశంస శాసనశ్లోకానుసారముగా నిట నుదాహరించుచున్నారము.

"ఎఱ్ఱక్కసాని నడవడిచే లోకములన్నియుఁ బవిత్రములయ్యెను. ఆమె రూపు కనులపండువుగా నుండును. రంభాద్యప్సరసలకంటె నాయమ సౌందర్యవతి. పాతివ్రత్యమునం దీమె అరుంధతిని మించినది. అన్నిధర్మములకంటెఁ బాతివ్రత్యమె ఉత్తమధర్మమని యీమె పాటించెను. జనులకు సంపత్ప్రదాయినిగను, ఆశ్రితులకుఁ గల్పవృక్షముగను నీయమను బ్రజలు భావించిరి.

ఎఱ్ఱక్కసానమ్మ నందనవనమునకుఁ దీటుపోని ధర్మవనములను నెలకొల్పెను. సముద్రములవంటి చెఱువులఁ బ్రతిష్ఠించెను. కొండవంటి దేవళముల నెలకొల్పెను. అవియన్నియు నేలపాలంతికి విలువగల తొడవులు. సువర్ణమయములగు మందిరములు ధాన్యసమృద్ధిగల పొలములు క్షీరవంతములగు గోవులను బ్రసిద్ధులగు విద్వాంసుల కీయమ పలుమారు దానముగావించెను. మృష్టాన్నములతో బ్రహ్మజ్ఞులకు పలుమారు సంతర్పణములు జరిపి యశస్సు గడించెను.

ఎఱ్ఱక్కసానమ్మ ముఖము సరస్వతీదేవికి నృత్యరంగస్థలము. ఆమె భూమికి నూతనాలంకారము. కవీంద్రు లాయమ గుణగణమును గొనియాడు స్తోత్రపాఠకులు. సకలకళ లామెకుఁ గరతలామలకములు. అసూయాపరుల కామె దూరస్థురాలు. విద్వాంసులకుఁ బెన్నిధి. కుమారుఁడు అగు మల్లనాయకుఁడు శస్త్ర శాస్త్రవిదుఁడు. అతఁడు గణపతిదేవచక్రవర్తి రాజ్యకాలమున మిగులఁ బ్రసిద్ధివహించెను."

ఎఱ్ఱక్కసానమ్మయోగ్యత శేతాళచరిత్రమునం దభివర్ణింపఁబడెను. ఈ శేతాళచరిత్రము ఈయమ భర్తనుగూర్చి చరిత్రానుసారముగా వ్రాయఁబడిన ద్విపదకావ్యము. చరిత్రమున కనుకూలించు అపూర్వాంశము లందు విశేషించి కలవు. ఎఱ్ఱక్కసానమ్మ తనభర్తపేర శేతప్రోలను నగరము తనపేర ఎఱుకపురము అను గ్రామములు గట్టించి అందుఁ జాతుర్వర్ణ్యములకు సదుపాయములు గలిగించెను. మునియేటికాలువలు దీసి తటాకముల వృద్ధిజేసెను. ప్రజలను గన్నబిడ్డలవలె భావించిన ఈయాంధ్రమాతనుగూర్చి చిత్రములగు కథలు లోకమున వ్యాపించెను. ఆకాలపుఁ గవు లీమెకు శంకరుఁడు జంగమువేషములోఁ గనిపించెనని వ్రాసియున్నారు. మహత్త్వశోభితురాలని పేరొందిన ఎఱుకసానమ్మ తనదైశ్వర్యము జీవితము దేవళములకుఁ బ్రజలకు వినియోగించి ప్రజలను బుత్రుని విచారసాగరమునముంచి వార్థకమునఁ బిల్లలమఱ్ఱిలోనె మరణించెను. ఎఱ్ఱక్కసానమ్మ పేర నొకవిగ్రహమును జెక్కించి పౌరు లనంతరము త్రిపురాంబికాలయమునఁ బ్రతిష్ఠించిరి. అనంతరము రెండుమూఁడుతరములవఱకు నీసాధ్వి పాదుకొల్పిన ధర్మములన్నియు యథావిధిగ నెరవేరెను. దురదృష్ట వశమున ఆంధ్రనగరమును మహమ్మదీయులు లోఁగొని యాలయవిధ్వంస మాచరించుటతో నిదియు

అంతరువు పడెను. పదునాలుగవశతాబ్దమున పిల్లలమఱ్ఱిలో రాజ్యముపాలించుచున్న ఎఱ్ఱపోతులెంక పునఃప్రతిష్ఠగావించి శిథిలములైన ధర్మములను ఉద్ధరణముగావించెను. అచిరకాలమున మఱల నాధర్మములు లుప్తము లైనవి.

ఎఱుక్కసానమ్మ ధర్మములు (నిజాము రాష్ట్రమున) నల్లకొండమండలమునఁగల సూర్యాపేటచెంతగల దోసపాడు, నామవరము, నాగులపాడు, పిల్లలమఱ్ఱి, బేతవోలు, ఎఱుకవరము మున్నగు గ్రామములందు నేటికిని గోచరించుచున్నవి. ఈసాధ్వీమణి యౌదార్యమునకు అనాటియవనవిప్లవమునకు అశిథిలములు దార్కాణగా గోచరించుచున్నవి.

ఎఱుక్కసానమ్మ కొన్నిగ్రంథములలో రఙ్గికాంతయని చెప్పఁబడెను. ఒకానొకయాధునికచరిత్రమున వెలమకాంతయని పేర్కొనఁబడెను. దేశకాలపాత్రము లెఱిఁగి చిరకాలము రాజ్యముపాలించి పరిపాలనచాతుర్యమున స్త్రీలకు మేలుబంతిగను కాకతీయాంధ్రసామ్రాజ్యనిర్వహణమునకు శ్రీరుద్రమదేవీమహారాజ్ఞికి మార్గదర్శినియైన ఎఱుక్కసానమ్మ సంపూర్ణజీవితచరిత్రము కాలప్రవాహమున కెదురీది నిలుచుటచే ఇంతవఱకేని గ్రహింపఁ గలిగితిమి. పల్లెపదాలలోఁ ప్రాణమునిలుపుకొన్న ఈయమచరిత్రము మాపరిశోధనఫలితముగ నేనాటికేని లభ్యముకాఁగలదను నాశతో నింతతో ముగించుచున్నారము.

## శిశిరమహిమ

దినముఁ బ్రాతస్స్నాన మొనరించుద్విజులకు
నగుకర్మలోపభయంబుకంటెఁ
బ్రాఁచిపనుల్ సేయ లేచు కోడండ్రకా
నత్తలవలని భయంబుకంటె
గడువులోఁ దూరమేఁగఁగనున్న చరులకు
నధిపుచేనొదవు భయంబుకంటెఁ
గర్షణంబొనరింపఁగడఁగు కాఁపుల కార
యమిఁ బైరుచెడునన్ భయంబుకంటెఁ
గడిఁదియయ్యెసీతు ఖగమృగపశునర
ప్రముఖజంతువులకు పావకుండు
భాస్కరుండు ప్రజకుబంధువులైరి
శిశిరమహిమ వినుతిసేయవశమె?

## "నీదుదర్శనమీకున్న నిలువగలదె?"

శ్రీమతి ఎ. హేమలత గారు

చల్లనౌపిల్లగాడ్పులు సాగజొచ్చె
మినుకుమినుకనితారలు మింటమెఱసె
కోయి కోయని కోయిలకూయుచుండె
వెల్లజాబిల్లి వెన్నెలల్లుకొనియె;
లోకమంతయు మోహాబ్ధిలో మునింగె;
అట్టియానందదాయమై నట్టివేళ
నట్టిప్రేమపూరితమైన యట్టివేళ
నట్టివలపుల పురిగొల్పునట్టివేళ
నీలమేఘంబులనుబోలు నీదుమేన
మెఱుపులనుబోలు హారము మెఱయుచుండ
కారుచీకటులబోలు నీకచమునందు
పచ్చనౌబర్హిపింఛము పొంచిచూడ
మురళికరమున ధగధగ మెఱయుచుండ
మోహవార్ధి నిదేలు నీముదిలకిపుడు
దిక్కునీవనినమ్మిన దీనకిపుడు
నీదుదర్శన మీకున్న నిలువగలదె?



శ్రీ త్యాగరాయచెట్టిగారి శిలావిగ్రహము: మద్రాసు కార్పొరేషను గ్రవుండ్సు.



ఆంగ్లయువతులు బాంజో వాయించుట

# గృహిణి

ఓలేటి సీతారామమూర్తిగారు

౧

ప్రబలనైదాఘమున నేల వాడివ్రాలు
వల్లికను లీలఁ దొలకరిజల్లుభాతి
జీవితేశ్వరు ఖిన్నతప్తాత్మఁ గ్రొత్త
చెల్వమునుగూర్చుఁ బ్రణయవృష్టినిలతాంగి.

౨

సారులేనికారాకుల స్థానములను
జిలుగుచివురులు ప్రకృతిసృష్టించుపోల్కి
జీవితేశు హృదావ్యాకులభావములను
జంపి హర్షంబునిడు నెరజాణ గృహిణి.

౩

గొనబుతళ్కులుజల్లి చకోరమునకు
రక్తినించెడు కౌముదీలక్ష్మివోలె
లేఁత తెలిచూడ్కి వెన్నెలలీలఁ బఱపి
హృదయపతికి నందనసౌఖ్యమిడునుసుదతి.

౪

ఎదఁబిపాసఁజరించెడు భృంగసఖునిఁ
దేనెచేసేదదేర్చు ప్రసూనమట్లు
సతతమోహన చుంబనామృతమొసంగి
జాయ యామోదపరవశుఁ జేయువరుని.

౫

ఈగభీరపు సంసృతిసాగరమున
రక్తిఁబయనించు గేస్తువిలాసనౌక;
తడబడక సౌఖ్యతీరంబుదరికిఁ ద్రిప్పు
కలితసహకారియైనచుక్కాణి గృహిణి.

౬

భవ్యగృహమేధి హృదయంబుపరువపుఁజిగి
నందగించెడు నునుముత్తియంపుఁజిప్ప;
హృద్యనవమోద ముక్తాళి సృష్టిచేయు
స్వాతిచిరుజల్లు స్త్రైణహాసార్ద్రరుచులు.

౭

మృదులగుణసంపద యొకించుకేనిలేని
మనుజుకఠినాత్మయొక్కక్రొమ్మంచురాయి
ప్రణయమురులించి సోయగంబునరహించు
మృగవిలోచన యమృతదృక్కునకరంబు.

౮

భర్తృహృదయంబుమంచురాపానుపులను
సారునించు హిమాలయసానుతలము;
ప్రాజ్యమోహనప్రేమవిపంచి మీటి
తారులాడు వరూధినీతరుణి గృహిణి.

౯

ప్రాణపతిజీవితంబు సౌఖ్యాభలేఖ
ప్రాకులాడని నీరదధ్వాంతవీథి;
విరతిలేక పదేపదే ప్రేమదీప్తి
మవ్వములొసంగు శంపాకుమారిసుదతి.

౧౦

పురుషభావమ్ము ఖేదమేయెరుగనట్టి
కమ్రనృత్యమనోజ్ఞశిఖావళంబు;
కాంతనీలకనీనికాకాంతిచయము
లలితవిన్యాసభాసురజలదపటలి.

# బుడబుక్కలవారు: కులకట్టు, శిక్షావిధానము

భాగవతుల యజ్ఞనారాయణశాస్త్రి గారు బి.ఏ.

ఆంధ్రదేశమున సంచరించుచుండు అనాగరికపు తెగలలో బుడబుక్కలవారు ఒకతెగ. వీరికి ఒక గ్రామము నివాసమనియుండదు. ఎల్లప్పుడును ఒకగ్రామమునుండి మరొకగ్రామమునకు గ్రుమ్మరుచు ఊరి వెలుపలనుండు బయలులోనో పొలములలోనో గుడిసెలనేర్పరచుకొని తాత్కాలికముగ నివాసముందురు.

వీరలకు కుమ్మరులకును, జంగములకు తదితరులకువలెనే ఒకగురువుండును. ప్రస్తుతము గుంటూరుజిల్లాలో నుండువారలకు చేబ్రోలులోనుండు శంభులింగమను నాతడు గురువు. ఆగురువునకు మూడుసంవత్సరముల కొకతూరి పొయ్యికొక రూకచొప్పున వసూలుచేసియిచ్చెదరు. ఇది వారలిచ్చు గురుదక్షిణ. ఇట్లు వసూలు చేయుటకు ఆగురువు వారలలో ఒకపెద్ద నేర్పరచును. ఈపెద్దతనము వారివంశమునుబట్టి సాంప్రదాయముగ వచ్చుచుండును. బుడబుక్కలవారిలో ఎట్టికలహము సంభవించినను ఈపెద్దకు తెలియజేతురు. ఇతను ఆకలహములను పరిష్కరించుచుండును. వీనినే కులపెద్ద అందురు.

ఒకగ్రామములోనున్న బుడబుక్కలవారిలో ఇరువురికి ఒకతగాదా సంభవించినపుడు వారిలోనున్న పలుగురు ఒకచోటచేరి ఆతగాదాను విచారింతురు. విచారించి నేరస్థునకు తగినశిక్ష విధింతురు. ఇటుల వారలలో వారే న్యాయమును విచారించుకొని తగవులపరిష్కారము చేసికొనెదరు. శిక్షితుడు తననేరము నొప్పుకొనక, చెల్లింపవలసిన రుసుములను చెల్లింపక నిర్దోషిత్వమును వాదించుచో కుండపరీక్ష కొప్పుకొందువాయని అడుగుదురు. వాడు దోషమున్నా ఒప్పుకొనవలయును లేదా కుండపరీక్షకైనా యియ్యకొనవలయును. కుండపరీక్షకు ఇయ్యకొనినపుడు కులపెద్దకు కబురుచేయుదురు. కులపెద్దవచ్చి కుండపరీక్షను సక్రమముగా జరిపి తగాదా పరిష్కారము చేయును.

కుండపరీక్షావిధానము ఈక్రిందివిధమున జరుగును. ఒకకలహములో ప్రతివాది నేరస్థుడుగ నిరూపింపబడెననుకొనుడి. అతడు తాను నిర్దోషినని బలముగవాదించుచు నేరము నొప్పుకొననపుడు కులపెద్దయున్న తావునకు తక్షణమే రావలసినదిగ కబురంపెదరు. అప్పుడు కులపెద్ద వెంటనే బయలుదేరివచ్చును. మార్గమధ్యములో అతనికి త్రాగుడువగైరాల కయ్యే సకలఖర్చులు వాది ప్రతివాదు లిరువురు భరింపవలెను. కులపెద్ద వచ్చినతరువాత మరల నాతడు వారలతగాదాను బాగుగ తనబుద్ధిమేరకు విచారించును. తనకు న్యాయముగ దోచినరీతిని యెవరియందో నేరము ఆరోపించును. అనగా నేరస్థుడెవరో తేల్చి తీర్పుచెప్పును. ప్రతివాదియే నేరస్థుడుగ పరిగణింపబడెననుకొనుడు. మరల నాతడు నిరపరాధిని బాబూఆని మొరలిడుకొనినచో వానికి చాలవరకు నయాన చెప్పిచూచెదరు. అప్పటికిని వాడు ఒప్పుకొననిచో - ఇకనిజానిజములు భగవంతుడే తేల్చవలెనని-వానిని కుండపరీక్షకు సమ్మతింపకోరెదరు. వాడు నేరమునూ ఒప్పుకొనక, కుండపరీక్షకూ ఇయ్యకొనక ఎదురుతిరిగినచో కాళ్ళుచేతులు కట్టిపడవైచి ఉడుకునీళ్ళుపోసి హింసించెదరు. కాని ఇట్లు జరుగుట అరుదు. నేరమొప్పుకొననివాడు కుండపరీక్షకొప్పుకొనితీరును. అట్లు ఒప్పుకొనినతరువాత కులపెద్ద తనకైన ఖర్చులను ఇరువురనుండి తీసికొనును. పిదప వాదిప్రతివాదులు చెరి యేడురూపాయలు ధరావతు కట్టవలెను. ఆదినము కులమువారందరికి త్రాగుడు పోయించి పంక్తిపెట్టవలెను. ఇందులకు సాధారణముగ నాలుగైదువరహాలవునట. రేపు కుండపరీక్ష జరుగుననగా ఆదినమున సాయంత్రమునుండి వాదిప్రతివాదు లిరువురు నియమముగానుండెదరు. శుభ్రముగ స్నానముచేసి, ఎవరిని తాకక కోమటింట భోజనముచేసెదరు. చుట్టనైనా త్రాగకూడదు. కోమటింట భోజనముచేయుటకు కారణమేమన నీచువగైరా తినకుండుటకే.

మరునాడు దండయమున నేలేచి కావలసిన సామగ్రినంతయుకొనెదరు. ఈసామగ్రికి అగుఖర్చుఅంతయు వాదియే భరించవలెను. పసుపు, కుంకుమ, కొబ్బరికాయలు, హారతికర్పూరం, ముగ్గు, తమలపాకులు, వక్కలు, తవ్వెడుబియ్యముడుకు కుండ, తవ్వెడుపైన అరసోలెడు గానుగాడిన నువ్వులనూనె, కట్టెలు ఇవి కావలసిన సామగ్రి. ఈదినమున ఎవరును త్రాగకూడదు. అందరును ఒకవిధమయిన నియమమును పాటింతురు. ఈసామగ్రి నంతయు తీసికొని అందరు ఊరిబెలుపలనున్న వాగువద్దకో, చెరువువద్దకో దూరముగాపోదురు. వాది ప్రతి వాదులిర్వురు తలనిండ స్నానముచేసి తడిబట్టలతోనే యుందురు. వాది ఒకచోట స్థలమును బాగుపరిచి ముగ్గులుపెట్టి దానిపై పసుపునీళ్ళను చల్లి శుభ్రమైన రాళ్ళుతెచ్చి పొయ్యినమర్చును. కుండకు పసుపుపూసి కుంకుమబొట్లు పెట్టును. తరువాత నిప్పుచేసి దేవునితలంచుకొని "స్వామీ! వీడునాసొమ్మునిని అబద్ధములాడు చున్నాడు. నీవు న్యాయము పాలించాలి. వాడు నాసొమ్ముతింటే వాడిచెయ్యికాల్చు. లేకుంటే చల్లగా నుండుము" అని ప్రార్థించి కొబ్బరికాయ పగులగొట్టును. ఈకొబ్బరికాయను ఎవరును తినరు. అవల పారవేయుదురు. స్వామిని తలచుకొనునపుడు ఏనేరమునుగూర్చి ఈవిచారణజరుగుచున్నదో ఆనేరమును పేర్కొనెదరు. పిదప కుండలో నూనెనుంచి మండుచున్నపొయ్యిమీద నుంచును. నూనె సలసలాకాగుచున్నపుడు ప్రతివాది కుండయొద్దకుపోయి తానుకూడ దైవప్రార్థనచేసి "స్వామీ! తమరు న్యాయంపాలించాలి. నేనే అన్యాయమైనా ఎరిగియుంటే నాచెయి కాల్చు. లేకుంటే చల్లగాఉండు నాస్వామి!" అనుచు తన చేతిని మడికట్టువరకు ఆసలసలక్రాగుచున్న నూనెలోనుంచును. కొంచముసేపయినపిదప చేతినితీసి ముడివడ్లను నలువవలయును. వాడు అపరాధియేఅయినచో వానిచేయి బాగుగకాలి ముడివడ్లు నలుచునపుడు తాట ఊడును. వాడు నిరపరాధియైనచో వానిచేయి కాలక మామూలుగానేయుండును. చేయికాలి అపరాధిగా పరిగణింపబడినవెనుక వాడు వాదికయిన అన్నిఖర్చులను-కులపెద్ద కిచ్చినది - కులమువారికి త్రాగుడువగైరాలకయినది-ధరావతుకట్టినది-సామగ్రికయిన ఖర్చు-భరించి తననేరమునొప్పుకొని వాదితో పరిష్కారము చేసికొనవలెను. అట్లుగాక ప్రతివాది నిరపరాధియని తేలినచో వాది ప్రతివాదికైన అన్నిఖర్చులను తాను భరించి పరిష్కారము చేసికొనవలెను. ఇట్లు నూనెలో చేయియుంచి కాలక తమ నిర్దోషత్వమును ప్రకటించుకొన్నవారలు పలువురు కలరట. ఇది ఇతరకులములవారికందరకు తెలిసినవిషయమేనట. కనులారచూచినవారు కలరు.

అసలు శిక్షితుడు నేరస్థుడైనది లేనిది కుండపెట్టునపుడే తేలునట. శిక్షితుడు నిరపరాధి యగుచో నిప్పు త్వరగా కాదుట. నూనె మసలక మాడిపోవునట. శిక్షితుడు అపరాధియగుచో నూనె సలసలక్రాగి పైకి దూకుచుండునట. బుడబుక్కలవారు చెప్పుదురు. వీరిలో మరియొకవిధానముకూడ కలదు. గడ్డపలుగు ఎర్రగకాల్చి నిర్దోషినని వాదించువానిని చేతితో పలుగును క్రిందినుంచి పైకిదూయుమనెదరు. నిర్దోషియైనచో చేతి కేబొబ్బయునుండదు. దోషియైనచో కాలితీరును.

ఈవిధానములు ఇచ్చటికిని వీరిలో అరుదుకాదు. ఈసాంప్రదాయమును వీరు పరికెముగ్గులవాండ్లనుంచి గ్రహించిరి. అంతకుపూర్వము ఈవిధానములు వీరిలో లేవు. అప్పుడు ఇంకొకవిధముగానుండెడిది. నిర్దోషత్వమును వాదించువాడు గుడిలోనికిపోయి దీపారాధనచేసి దానినిఆర్పి తీసికొనిరావలెను. ఆదినము మొదలు వారముదినములలోపల వానికి ఏమాత్రము అస్వస్థతకల్గినను నిందితుడుగానే పరిగణింపబడును. పడిశము పట్టినను చాలును వానియందు దోషమారోపించుటకు. ఈవిధానమిప్పుడు అమలునందు లేదు.

ఇటుల బుడబుక్కలవారు తమ సకలవిధములైన తగవులను - మరొకకులస్థునితో సంబంధము లేకుండ-తమలోతామే పరిష్కరించుకొనెదరు. అట్టి కులకట్టు వారికికలదు. వారిలో వారిచ్చుకొను ఋణములకు పత్రములుండవు. డబ్బులు ఎగవేయుటలు నుండవు.

# ముద్దులగుమ్మ పెండ్లిముచ్చట

సంపాదకుఁడు

సీరిపి ఆంజనేయులుగారు

[రాయలసీమయందలి యెఱుకలజాతి కీ 'ముద్దులగుమ్మ' పాట వెన్నతోఁ గూడినది. దీనిఁ దెలియనివా రాకులమున నరుదవఁదగుమ. ముఖ్యముగ వీథివీథి నన్నమడుగుకొనుటకయి వచ్చెడు నాలెగ యూఁడువాం(డ్ర కిది సొమ్ము. ఎఱుకల యొంటిగఁగాని - లవతోడిచేడియతో జంటగఁగాని - దీనిని శ్రావ్యధ్వనితోఁ బాడుచుండ మళ్లిమళ్లి వినఁ గుతూహలము పొడముచుండును.]

"నంబా నావారి ముద్దులగుమ్మా" అను పల్లవి

ప్రతిచరణముతుదిని పాడవలెను

పెద్దలందఱుఁగూడి పెత్తనముసేయఁగ
బేమ్మనడిగినారు బెంగుళూరియందు
ఆకులు తెచ్చిరి ఆకుమళ్లలోన
వంగనూరికాడ వక్కాకుపంచిరి.
చీరేలు తెచ్చిరి చిలుముకూరిలోన
గాజులు తెచ్చిరి గాండ్లపత్తిలోన
సొమ్ములు తెచ్చిరి సోలుకుత్రిలోన
బండ్లపల్లెకాడ బండెచేయించిరి.
పాముదుత్రిలోన పందెలేసినారు
పేరూరిగ్రామంలో బీము తెచ్చినారు
పొట్టిచెఱువులోన పొవులుత్రవ్వినారు
ఆత్మకూరికాడ అరివేండ్లునిల్పిరి.
గంజికుంటలోన గంజివంచినారు
చాగంటిదగ్గిర చారుగాచినారు
పప్పూరిసత్రాన పప్పుచేసినారు
పాతపాళెంకాడ పరమాన్నంవండిరి.

దివిటీలుపట్టిరి దిగువపల్లెలోన
మేళాలువాంచిరి మేడికుర్తిలోన
తాళాలుగొట్టిరి తాళ్లపొద్దుటూళ్లో
నాగలమడ్కకాడ నలుగుపెట్టినారు.
కడవకోళ్లులోన కంకణాల్ గట్టిరి
బాసింగంగట్టిరి బద్వేలీదగ్గిర
దాసంగంబెట్టిరి దంకువార్పల్లెలో
తాళ్లపొద్దుటూళ్లో తలఁబాలుపోసిరి.
యిస్తళ్లుకుట్టిరి యీరన్నపల్లెలో
బండ్లపల్లెలోన బంతికూచున్నారు
బువ్వతినినారు బుక్కపట్నంలోన
చెన్నపట్నంలోన చెయ్యిగడిగినారు.
తిరుగులుమరుగులు తిప్పెడ్డిపల్లెలో
నడిమిదొడ్డిలోన నాగేలిచేసిరి
సోదెన్నపల్లెలో శోభనంజరిగింది
పడకవేసినారు పామిడిపురమందు.

# లతాంతకి పండుగబహుమతీ

పాలెపు వేంకటరత్నముగారు

మాఅత్తారిది ప్రకృతిశోభాపరిపూర్ణమైన ఒకచిన్న పల్లెటూరు. పుష్యమాసంలో ప్రకృతి సౌభాగ్యలక్ష్మీ నిలయమై, నయనానందదాయకమై, దర్శనీయమై ఆగ్రామశోభ ద్విగుణీకృతమైంది. నే నసలుకళోపాసకుణ్ణి. మాఅత్తగారిపెరట్లో చాలగానాటబడిన బంతిచెట్లపువ్వులుచూస్తుంటే నాహృదయ ముప్పొంగుతూఉండేది. ఆబంతిచెట్లప్రక్క నే వికసితసుమసంపదచే నొప్పారు చేమంతంటులు. ప్రకృతికళోపాసకులకు పుష్పదర్శనం కంటె పరమానందం ఏముంటుంది?

ఈమధ్య రాజమండ్రీవచ్చినప్పుడు మామామగారు కాలేజీకి సెలవులివ్వడంతోటే వారి ఊరురమ్మని నన్నాహ్వానించేరు. నేనూ సెలవులివ్వడంతోటే మానాన్నగారిసెలవుపొంది మూటుకేనుసర్దుకొని బయలు దేరేను. చిగురికి ఒకరాత్రి పడవప్రయాణంకూడాచేస్తేనేగాని ఆఊరుచేరలేం.

ఉదయం ఆరుగంటలకు పడవదిగి ఊళ్లోకి నడిచివస్తున్నాను తలకుకట్టుకున్న ఫానలుమఫ్లరు, వల్లెవాటుగా కప్పుకున్న కాష్మీర్‌శాలువ, కాళ్లకి స్నోప్రూఫ్‌శాండల్‌ను నేను. వెనక కూలిమనిషి పెట్టెపట్టుకొస్తున్నాడు. ఊరిబయట కాపుగారొకరు ధూమపానంచేస్తూ, కుక్కుటరాజాన్ని చంకపెట్టుకొని యెదురై చల్లోవణకుతూ "యేవూరుబాబూమన్ది!" అన్నాడు. "రాజమండ్రీ" అనిచెప్పి ఒచ్చేస్తున్నాను. "అయితే మనివి. యెవరింటికి బాబూ!" అన్నాడు.

"కరణంగారింటి"కనిచెప్పి నానడకవేగాన్ని హెచ్చించి, ఈపల్లెటూరికాపుల కీప్రశ్నపరంపర సహజ మేమనుకుంటూవస్తున్నాను. "అలాగా బాబూ! చిన్నమ్మాయిగారిపెనిమిటా?" అని సంతోషిస్తూ కాపుగారు నిష్క్రమించేరు.

గ్రామంలో కాలుపెట్టాను. చిగురింటమ్మాయిలు వీథిలో ముగ్గులుపెట్టుతూ గొబ్బెమ్మలకి ప్రదక్షిణం టున్నారు. వారిలోఒకమ్మాయి తలెత్తినన్నుచూచి ప్రక్కమ్మాయితో "ఒసేవ్! మనచిన్నమ్మాయిమొగు డేవ్!" అంది. వెంటనే ఆబాలికామూర్తి ముందుగా కబురందించడానికి మావాళ్లింటికి చెంగునపరుగెట్టింది. ప్రక్కయింటిఅరుగుమీద కొందరుయువకులు-వారూఅల్లుళ్లేకావచ్చును-చతుర్ముఖపురాణం సాగిస్తున్నారు. ప్రక్కనొకకుర్రాడు 'స్థిరమైనదడవడి' గానంచేస్తున్నాడు.

మాఅత్తగారిగుమ్మంలో కాలుపెట్టేను. వంటలక్క సుబ్బమ్మగారు పెద్దచెంబునీళ్లతో ప్రవేశించి "వచ్చారు బాబూ!చిలకతండ్రీ! కాళ్లుకడుక్కోండి"అంది. నేను 'సేండల్సు'తీసేసి కాళ్లుకడుక్కుంటున్నా. మాఅత్తగారుసావిట్లోకివచ్చి "కూచో బాబూ! ఇంటిదగ్గిర్నుంచేనా! అంతాక్షేమమేనా!" అని కుశలప్రశ్న మడిగింది. ఆ! క్షేమమే! అని జవాబుచెప్పేను.

ఇంతలో సుబ్బమ్మగారుతెచ్చిన ఖద్దరుతువ్వాలుతో కాళ్లుతుడుచుకొని శాలువకొంకెకుతగిలించి మఫ్లరు విప్పేసి క్రాపుసర్దుకుంటూ ఈజీఛెయిరులో కూర్చున్నాను. వీథిలోనుంచి మాబావమరదివచ్చి "ఇదిగో! వసంతంబావా! మేమనుకుంటున్నాం ఈవేళొస్తావని. ఏమిటిసంగతి? పరీక్షలు బాగారాశావా?" అంటూ యెదురుగుండా 'రోజ్‌వుడ్డు'కుర్చీలో కూర్చున్నాడు.

ఇంతట్లో ఆచిగురింటమ్మాయిచెప్పినకబురు పనిచేసిందాఅన్నట్లు సుబ్బమ్మగారు రెండుప్లేట్లఉప్మా, కాఫీకూజా, రెండుచైనాకప్పులు, సాసర్లతోటీప్రవేశించి టేబిల్‌మీదుంచి వెళ్లిపోయింది. మామామగారు పల్లెటూరువారైనా నాగరికతాపరిపూర్ణులు. మామగారేరంటే పొలంవెళ్లారన్నారు. నేనూ మాబావా కబుర్లు చెప్పుకుంటూ 'టిఫెను' తీసుకుంటున్నాం. మాఅత్తగారు నాచదువునిగురించి ప్రశ్నలువేస్తోంది. "సేనీజీఛైర్లో

కూచున్నప్పటికీ నాకళ్లు లతాంతకోసం చుట్టుప్రక్కల వెతికేస్తున్నాయి. నాకెదురుగానున్న గదిలోనుంచి ఒక ముఖపద్మం నన్ను తొంగిచూస్తున్నట్టు కనిపించింది.

ఆమరునాడు నేను పావిట్లో 'స్క్రీన్' ప్రక్క కుర్చీలో కూర్చునియున్నాను. వీథిలో నొకకోయస్త్రీ - భిక్షుకురాలు - మధురమధుర గాత్రంతో భిక్షాప్రార్థనం చేస్తోంది.

బిచ్చమెట్టుతల్లో! - బిచ్చమెట్టుతల్లి!
బిడ్డలుగలతల్లో! - పాపలుగలతల్లి!

మాభావమరదిభార్య మణీదేవి బిచ్చగత్తెకు తండులములతో ప్రవేశించి నవ్వుతూ "లతాంతా! లతాంతా! ఇదిగో ఈకోయవాళ్లపిల్ల చూడవే, నీలాల్లాగ మెరిసిపోతున్నకళ్లతో యెంతబాగుందో! యిలారా" అని పిలిచింది.

నేనూ మందహాసంతో ప్రియాసందర్శనానికి 'రడీ' గాకూచున్నాను.

నాకెదురుగానున్న గదితలుపు తెరుచుకొని ముగ్ధమోహనకల్యాణమూర్తి లతాంతపావిట్లోదాకవచ్చి నను చూచి త్రపాభరానతయై వదినెగారిని "పో" అంటూ నన్ను తిర్గిచూస్తూ గిరుక్కునమళ్లిపోయింది.

మణీదేవి నాప్రక్కనిలబడి తప్పట్లుకొట్టి నవ్వుతోంది.

నాకళ్లల్లో అమృతంకురిపినట్టయింది. లతాంతవేషం చాలామనోజ్ఞంగానుంది. కెంపురంగు ఖద్దరు పరికిణీ, స్నేక్ కాలర్, బ్లౌజ్ కాలరు ఖద్దరుజాకెట్టు, సన్నటిఖద్దరువోణీపయట. పయటకొక పెద్దబ్రోచ్, కృష్ణసర్పమువలె దీర్ఘమగువాలుజడ, కాళ్లకు జాలరుపట్టాలు.

నేను కార్యమైనతరువాత మాఅత్తారింటికదే ప్రథమపర్యాయం రావడం. అందుచేతనే లతాంత ప్రేమమధు వెంతగ్రోలినను తనివిదీరకుండానుంది. చూచినప్పుడల్లా క్రొత్తభావాలు కలుగుతున్నాయి. అప్పుడు తోచినభావానికి ప్రతిఫలంగా ఈక్రిందిగీతం నానోటుబుక్కులో వ్రాసుకున్నాను.

ముగ్ధమోహనకల్యాణమూర్తి నీదు
ప్రణయవినిబద్ధవీక్షణాప్రగ్రహములు
తేల్చుచున్నవి సతతవర్ధిష్ణువిపుల
మోహవారాశిలో నేను మునుగకుండ.

లతాంతసౌందర్యమును సంపూర్తినొందించుటకు లోలాకులు లోటుగానున్నాయి........

ఈరీతిగా నేను మాఅత్తారింట్లో మహదానందంగా, పౌష్యప్రకృతిసౌందర్యానికి ముగ్ధుణ్ణౌతూ, భావగీతాలురాసుకుంటూన్నాను.

ఒకనాడుఉదయానికి మావదినెగారు, తోడల్లుడుగారూవచ్చేరు. మాఅత్తగారువచ్చి మావదినెగారిని ప్రేమపూర్వకాలింగనంతో లోనికితీసుకెళ్లింది. మావదినెగారు నన్ను పలుకరించి లోపలికెళ్లింది. మాతోడల్లుడుగారికి ఉచితమర్యాదలన్నీ జరిగాయి. ఆయన నన్ను కుశలప్రశ్న చేసినారు. మాతోడల్లుడు విద్యాధికుడు. విశాఖపట్టణమందలి సుప్రసిద్ధన్యాయవాది. ఎం. ఏ; బి. యల్. వారూ నేనూ అత్యానందంగా రోజులుగడుపుతున్నాం.

భోగినాడుదయం కాఫీలుపుచ్చుకొని నేనూ, మాబావా, అన్నగారు షైరు బయలుదేరాం పొలాలకేసి. వీథులో గంగెద్దులవాండ్రు సన్నాయిపాటతో డోళ్లచప్పుళ్లతో యెద్దులనాడిస్తున్నారు.

"పండుగరోజులకు ఈబిచ్చగాండ్రవల్లకూడ ఒకవిధమైనశోభ కలుగుతుందిసుమండీ! అన్నగారూ!" అన్నా నేను.

"నీకవితాదృష్టి ఆసౌందర్యమును గ్రోలగలదు" అంటూ ముందునడుస్తున్నారన్నగారు.

రెండుప్రక్కలా నిలువుపొడుగునా పెరిగి పచ్చనిపువ్వులతో దట్టముగానున్న జనపచేలప్రక్కనుంచి పడుస్తుంటే నామనస్సానందతరంగాల్లో ఉయ్యాలలూగేది. తిరిగితిరిగి ఇంటికిజేరుకున్నాం. లతాంతపావిట్లో కూమఫి నక్కితో చేమంతిపువ్వుదండలు గ్రుచ్చుతోంది. తదేకధ్యానంతో నున్న లతాంత మమ్మల్ని చూడనేలేదు.

అన్నగారు నాకు సేలంశాండువా అడ్డంగాపట్టుకుని "లతాంతా! నీకో తమాషాచూపిస్తా! 'నా' కేమిస్తావు?" అన్నారు.

"ఆ! నాకుతెలుసులే!" అని లేచినించుంది లతాంత. అన్నగారు తెరతీసేసారు. దోసెడుచేమంతి పువ్వులు మామీదజల్లేసి నవ్వుతూ వెళ్లిపోయింది లతాంత.

"నేనుచూసాలే! నువ్వుచేసినపూజ లతాంతా! ఇంకేం? వ్యవహారంముదిరింది" అంటూనవ్వుతోంది లోపల మణీదేవి. "పోనీలే" అని లతాంత. మాపదినెగారు లతాంతపక్షం సమర్థిస్తోంది. ఇల్లంతా ఆనంద కోలాహలం. నామనస్సంతా నవ్యభావకోలాహలం.

మధ్యాహ్నంతూర్చుని 'సమర్చన' అను శీర్షికక్రింద రెన్నోగీతాలూ, గీతికలూ రాసుకున్నాను.

ఒకప్రక్క చిన్నటేబిల్ మీదనున్న బెడ్ రూమ్ లైట్ ధవళకాంతులు గదంతానింపేస్తోంది.

దోమతెరకట్టిన చెన్నపట్టణపుమంచమునకెదురుగానున్న రోజ్ వుడ్ టేబిల్ మీద లతాంతచేఅల్లబడిన లేసుక్లాత్ ఒకప్రక్క అగరువత్తులచెట్టు, ఒకప్రక్క ఫ్రేములోనమర్చబడిన సరస్వతీఫోటో, నడుమ పారిస్ సెంటులు, గోడలమీద ఆంధ్రచిత్రకారులచే తయారుచేయబడిన చిత్రమాతృకలు, శారదానికేతనములో చదువుచున్నప్పుడు లతాంతచేవ్రాయబడి బహుమతులందినమల్లిక, వనలక్ష్మీ-వసంతము అను రెండుచిత్రములు టేబిల్ కు కొంచెముపైగా కట్టిఉన్నాయి. ఎదురుగా రెండురవుండుఛెయిర్స్. ఒకదానిలో పరిపూర్ణాలంకృత లతాంత. ఒకదానిలో నేను.

"లతాంతా! ఉదయాన్నేనీవు నాకుచేసిననుమార్చనకు నీకేంవరమివ్వాలోఅని ఊహిస్తున్నాను. అయినా రేపు పండుగకదా! యేంకావాలో కోరుకో" అన్నా నేను.

"ప్రేమమూర్తీ! సమగ్రమైన నీప్రేమభాగ్యంకంటె నాకు వరణీయం వేరేముంటుంది?" అంది లతాంత చక్కనిభావంతో.

"అయినా నామాటుకేసులో యేముందోచూచుకో" అని చేతాళాలిచ్చేను. లతాంత నాపెట్టె తెరిచింది. దానిలో ఒకవెడల్పాటి మంచిగంధపుకర్రపెట్టెమీద 'లతాంతకి పండుగబహుమతి' అని రాసిఉన్నదితీసింది. "మహాభాగ్యము"అంటూ పెట్టెతెరిచింది లతాంత.

దానిలో లోలాకులజతఉన్నపెట్టె, గృహలక్ష్మిసంక్రాంతిసంచిక,

లతాంత పరమానందభరితురాలైంది. "లోలాకులకంటె గృహలక్ష్మిసంచికప్రియతరం. దానికంటె మీప్రేమ ప్రియతమం" అంది లతాంత.

నాప్రేమసాగరం వేలనతిక్రమించింది.

బహుమతీ ఆమెపెట్టెలోనికి ట్రాన్స్ఫరుఅయింది.

* * * *

తెల్లవారుజామున సంక్రాంతిదాసరి "హరోరంగ! కస్తూరిరంగ!" అని చిందులుత్రొక్కుతున్నాడు. మెలకువవచ్చింది.

ఆనాడు పెద్దపండుగ. వీధులోనిండా యెక్కడా సందులేకుండా చిత్రవిచిత్రంగా రంగవల్లులు రచించేరు. ఆంధ్రనారీమణుల చిత్రరచనానైపుణ్యం ఆముగ్గుల 'డిజైన్ల'లో గోచరిస్తోంది. కొన్నిముగ్గుల క్రింద మాపదినెగారిపేరు ఇంగ్లీషున రాయబడిఉంది.

ఉదయాన్నుంచి మణీదేవీ, అన్నగారూ ఈబహుమతుల్ని గురించి లతాంతను తెగవేళాకోళాలు చేస్తున్నారు. తగినసమాధానాలు చెపుతోంది లతాంత.

పండుగ మహదానందంగాగడిచింది. మధ్యాహ్నం గానసభ పెట్టించాం. నేనూ, అన్నగారూ, మాబావా, మణీదేవీ, మాఅత్తగారూ, మామగారూ సభికులం. మావదినెగారు వీణ, లతాంత గాత్రం. పాటకచ్చేరీ.

ఈరోజున లోలాకులుకూడా పెట్టుకొని లతాంత సంపూర్ణ సౌందర్యంతో నాకళ్లకి నిజమైనపండుగ చేసింది.

ఆసాయంకాలం ఓకఫోటోగ్రాఫర్ని పిలిపించి చాలాఫోటోలు తియ్యించుకున్నాం.

ఫామిలీగ్రూప్ ఒకటి. దంపతులు ఒక్కొక్కటి.

మరునాడు వెడతానంటే కనుమన్నారు. ముక్కనుమునాడు లతాంత, వదినెగారూ, మణీదేవీ పేరంటాండ్రతో బాజాలతో బొమ్మలనోము కెడుతున్నారు. నేను మనిషిచేతిమూటు కేసిచ్చి ప్రయాణమై వెడుతున్నాను. లతాంత హరిణేక్షణాలు నామనస్సును వెనక్కిలాగుతున్నా శరీరంమాత్రం విధిలేక ముందుకెడుతోంది.

తక్షణం జ్ఞాపకమొచ్చింది.

'చీనాంశుకమివ కేతోః ప్రతివాతంనీయమానస్య'

వాల్తాడ్జిలో ప్రవేశించేవరకు నాకానాటి లతాంతపలుకే స్ఫురిస్తోంది. "లోలాకులకంటె గృహలక్ష్మి పంచికే ప్రియతరం దానికంటె మీప్రేమయే ప్రియతరం."

# విరిదండ

డా. మెర పెద వెంకయ్యగారు

మావిచివురాకు చెంగావి తీవకొనలఁ
బికము మధుమాసగీతమాలికలఁగూర్చు
లలన! భవదీయకంఠ మలంకరించు.
మంజులశ్రుతిగదియు బంభరముకడఁక
మధుకణమ్ముల నొంటొంట మాలఁగూర్చు
లలన! భవదీయకంఠ మలంకరించు.
పూవుటీరాలు చివురాకు మొనలఁదీర్చి
మంచుబొట్టులముత్యాలమాలఁగూర్చు
లలన! భవదీయకంఠ మలంకరించు.
దిక్తటమ్ములఁబనివడి తిరిగితిరిగి
లీల సీగాలి వలపులమాలికలఁగూర్చు
లలన! భవదీయకంఠ మలంకరించు.
ప్రణయసూత్రపుగ్రొవ్వాడి కొనలఁదీర్చి
లలితభావప్రసూనమాలలఘటించి
లలన నీడెంద మేనయలంకరింతు.
పలపలని జాలువారెను వలపుఁజూచి
తొంగలించెను కంఠమాధురిఁదలంచి
తరుణి! నీడెందమునకివి తగినవనుచు
నీనలదండ నేరచియించినాఁడ.
నక్కటా! యివిభావసూన్యమ్ములంట!
వలపు నిండారమాధురుల్ వచ్చికొనఁగ
విమలభావతరంగముల్ వెల్లిగొలుప
విరియునాహృదయంపు గ్రొవ్విరియొకండె
వెలఁది! ప్రియమార దాని నర్పింతునీకు
దాల్చుమీడెందమున విరిదండవోలె!

—బాప్పములు.

# పెద్దాపురంరోడ్డే దొంగలభయం

కవికొండల వేంకటరావుగారు

తిమ్మాపురంనుంచి రెండెడ్లసవారీబండి వచ్చిందీఅంటే ఇంట్లోకుఱ్ఱాళ్లందఱికీ సరదా. ఏమా ఆబండిమీద పోల్నాడుచెఱుకులు, తేనెపాకంచట్టి, పెద్దాపురీబెల్లం, అన్నీ తియ్యని సరుకులేదిగేవి. మఱిక్కడవన్నీ తినేశేశేవాళ్లం.

ఆలాంటిబండిమీద వొత్తుగా ఓమాటు గడుకొయ్యపైకంటా వట్టిగడ్డిపఱచి చాపేసి ఆబండిమీద కుఱ్ఱాళ్లనందఱినీ ఎక్కించుకుని కొంతదూరంవెళ్లేక 'దిగండి. మీరంతాదిగండి' అన్నాడు వెంకట్రామయ్యమామ. మేందిగంఅంటే మేందిగం అన్నారు. "అయితే పెద్దాపురంరోడ్డునిదొంగలు కొడతార్రోయి. వెఱ్ఱి వెంగళప్పల్లారా! దిగండి దిగండి" అంటూ మావూళ్లో పిల్లలపిడుగునాఁబడే యొకానొకబ్రాహ్మణోత్తముడు పాపయ్యగారు—ఆలా ఆవెంకట్రామయగార్ని సాగనంపుతూ కేకేసి యొక్కొక్కళ్లనే అందర్నీ దింపేసేరు. నేను ఒక్కణ్ణే గడుకొయ్యట్టుకుని ఆయనెంతలాగినాదిగజాఱక "చీకటిపడకుండాచేరుకుంటాం: చీకటిపడకుండాచేరుకుంటాం" అన్నాను.

వెంకట్రామయ్యమామ ఏమన్నాడో పాపయగారితో ఆయన నన్నొదిలేసి తక్కిన వాళ్లనందరినీ తఱుముకుంటూ వెనక్కిగెంటుకుపోయినారు. "అమ్మతోటి నాన్నతోటి చెప్పాలా? నేనువస్తూవున్నానని—నాతో—"అనిఅడిగాను వెంకట్రామయ్యమామను.- ఆయన బండిచక్రంమీదఅడుగేసి, కొయ్యపట్టుకుఎక్కుతూ బండివాణ్ణి కాడిలేచిపోకుండా చూడంటూవుంటే—"అమాటేచెప్పేను పాపయ్యగారితో-ఇంటిదగ్గఱచెప్పమని నిన్ను నేను తీసుకువెళుతూవున్నానని" అన్నాడు.

ప్రపంచంలో నాకానాఁడు ఆవెంకట్రామయ్యమామంత మంచివాడు మఱి కనబడలే.

అతణ్ణో "పైకింకాజఱగొచ్చు చోటుంది, చోటుంది. నీవూనేనేగా" అంటూ, ఆతక్కిన కుఱ్ఱవాళ్లందరికంటే అదోవిధమైనయాధిక్యత నాయందుఉందనుకుంటూ బండివాణ్ణి "తోలు గబగబాతోలు" అన్నాను. రెండెడ్లనూ రెండుతోకలూపట్టుకొని ఓకేపర్యాయము చల్ చల్ అన్నాడు బండివాడు. ఒక్కమాటుఒడళ్లు జలదరించుకొని గమ్మున ముందుకు బండి లాగినయి యెడ్లు.

"బండి రోడ్డంటిపోసీక రాగంపేటమీదుగా పోనిమ్మన్నాడు" బండివానితోమామ. అదీఒకందుకి మంచిదేననుకున్నాను. ఏలాగన్నా రోడ్డుతప్పడంకావాలిసింది. ఏమో వెధవ ముండాయెడ్లు పొడుగునా చురుగ్గా నడుస్తాయన్నమాటేమిటి, చీకటిపడకుండా తిమ్మాపురం చేరుకుంటామన్నమాటేమిటి?

కాని రాగంపేట వెళ్ళేసరికి ఓగుమ్మంలో బండాపమని దిగి వెంకట్రామయ్యమామ బండివానితో "బండి నిమ్మదిగాపోనిస్తూవుండు ఇప్పుడే కలుసుకుంటాను" అన్నాడు. బండివాడు "చిత్తం" అన్నాడు.

బండి మెల్లిమెల్లిగా పల్లెటూళ్ళ అడ్డబాటలంటవెడుతూవుంది. ఎంతకూ రాడు వెంకట్రామయ్యమామ. బండి చుట్టుగ్గాతోలమంటే "రానియ్యండి వెంకట్రామయ్యగార్ని రానియ్యండి" అన్నాడు బండివాడు. కాస్సేవుండి మళ్లీ ప్రేరేపించానుబండివాణ్ణి "కాస్తంతఅదలకించు, మువ్వలుకట్టినందుకన్నా అదలకించరా. చప్పుడవ్వాలా? వద్దా?" అన్నాను. అలా నడుస్తూనేవుంది బండి నిదరోతూవున్నట్టోగడియ, ఉలిక్కిపడ్డట్టు ఓగడియ. పొద్దుకునికిపోయింది. "ఇంకారాలేదేమిరా" అన్నాను బండివానితో. బండివాడిలాచెప్పేడు కాస్సేపు.

"వెంకట్రామయ్యగారి దసలు ఈవూరే, రాగంపేట. ఇక్కడ వీరికింకాఇప్పుడు ఒకపాటిపెఱడూ పడిపోతూవున్న ఇల్లూవున్నయి. ఆపెఱటిలో ఒకతాడిచెట్టూ రెండుకొబ్బరిచెట్లూ తక్కినవన్నీ పోయినా తాముపడిపోక చెడిపోక ఏటేటాకాస్తూవుంటాయి. మఱిపెఱడొకడి కూరికేచేసికోరాఅని ఇస్తే వాడందులో పచ్చిమిఱపమొక్కలు నీటివంగ పాదులువేసి రవంత పచ్చపచ్చగాచూపిస్తూవుంటాడు. తానాసంతా అనంతా వాటికాపులవల్ల బేడబ్బులు తెచ్చుకుంటూవుంటాడు. బహుశా వెంకట్రామయ్యగారు అక్కడ ముంజెలుకొట్టించి ఆకొబ్బరికాయలోపది వలిపించి, ఇన్ని పచ్చిమిరపకాయలుపుణుక్కొని అవన్నీ బుజాన్నేసుకు నెమ్మదిగా అడుగులోఅడుగేసుకుంటూ ఏకోండయకాపుతోటొక బుర్లు చెప్పివస్తారనితోస్తుంది" అన్నాడు. "అవునవును పచ్చిమిరపకాయలువుంటే ఆయనకింకేమీ అక్కఱలే. ఉత్తవేకోటికేళాస్తాడు" అన్నాను. "ఇంకా పెళ్లికాలే. బ్రహ్మచార్లు అయన" అన్నాడు. "పెళ్లి అయితేనో" అన్నాను. "పచ్చిమిరపకాయల్లో ఉప్పుకలిపి సన్నికల్లుమీద నూరుకు తినాలనైనా బుద్ధిపుడుతుంది" అన్నాడు.

ఇలామాట్లాడుకుంటూపోతూవుంటే మాకెదురై ఓగాజులబళ్లీ మలారం చప్పుడు చేసుకుంటూ "పిల్లలుడితేనో" అన్నాడు. "అప్పుడు వంకాయఇగురుపచ్చట్లో ఉప్పూ పచ్చిమిరపకాయలు కలుపుకుతిన బుద్ధుడుతుందేమో" అన్నాను.

నాకేసి చూచేడు గాజులమలారపతడు. "ఏమండో అబ్బాయిగారూ! మీరు చిన్నప్పుడు మాగాజులవంటకందగ్గఱకువచ్చి చిన్నచిన్నవుంగరాలు చేయించుకూపెట్టుకునేవారు కాదటండీ, మఱచిపోయారూ?" అన్నాడు. "నాకేంజ్ఞాపకంలేదు" అన్నాను. "చూడండీ! ఇలాంటివుంగారాలు" అనిచూపించేడు. కొద్దికొద్దిగాజ్ఞాపకంవచ్చింది, ఎప్పుడో ఆడూళ్లోమకాం చేసినట్టు గాజువుంగరాలు చిటికెనవ్రేళ్లకు పెట్టుకున్నట్టున్ను-బండివాడన్నాడు "చూపిస్తే కాదు. ఒకటివ్వాలి" అన్నాడు. "నీకా? ఆయనకా?" అన్నాడు అబ్బి. "నాకూఆయనకూ కూడా" అన్నాడుబండివాడు. "నీక్కాదుగాని అబ్బాయిగారికిస్తాను. ఎప్పుడైనా పెద్దోరై

వస్తే నాకేమన్నా బహుమతీఇస్తారు" అంటూ ఒకచిట్టిగాజువుంగరం నాచిటికెనవ్రేలిచివర్ని తొడిగి "వెడతానండీ" అన్నాడు అబ్బి. "నీకెదురైతే వెంకట్రామయ్యగార్ని త్వరగా రమ్మనవోయి సందెలడింది" అన్నానునేను. "ఎందుకండీ! ఆయనకు రెండడుగులు ఈదూరం. ఎంతదూరమన్నా నడిచేస్తారు. ఆయనకోసం బండి నెమ్మదిగాపోనియ్యక్కఅలేదు. సందెలడి పోతూంది. పోనీయమ్మా! పోనీయి! ఓబండిఆసామీ!" అని హెచ్చరించాడు అబ్బి. నేను దాంతో ఎడ్లకేసితిరిగి, వాటిపిల్లలమీదోమాటుచెయ్యేసి, టిర్ టిర్ ఛఛ అన్నాను. బండి వాడు "మీకెందుకండీశ్రమ? నేతోల్తానంటూ" కమిచాదెబ్బ తో రెండు దాపటదాన్ని రెండు వెలపటదాన్నికొట్టాడు. ఓ! అవింక పరుగుచ్చుకున్నాయి. గుముకుగుముకు ఫుంతంటే మట్టి బెడ్డలు చితికేటట్టు, దుమ్ము రేగేటట్టు బండిని లాగాయి.

నాదంతా ముందుచూపుగానేవుంది. చీఁకటిపడిపోయింది. "పోనియ్యి! మళ్లీ తోక లొదిలేస్తున్నావు" అంటూ కూడా బండివాణ్ణి ప్రోత్సహిస్తూ ప్రయాణంలో తన్మయుణ్ణాయి పోయినాను.

గబుక్కున ఓకాడ బండివాడు "జాగ్రత్తండోయ్! రోడ్డొస్తూంది!" అన్నాడు. హడిలిపోయి "ఆపు! ఆపు! బండాపు!" అని వెనక్కిచూచా: దూరాన్నే వెంకట్రామయ్య మామ వస్తూవున్నాడు. "రా! రా! దబ్బునరా!" అని గొంతుకచించుక్కేకేశాను. వెంక ట్రామయ్యగారు "పోనీయండి. వస్తావస్తా!" అన్నట్టు చెయ్యూపడమేగాని గబగబారాడు.

ఎడ్లు ఒక్కఉడామున బండినిఏదోఎక్కించినయి. బండివాణ్ణి "వెధవా! ఆపమంటే అంతహాములేమిరా?" అంటూ గుభాలునదూకినాను. నేను దూకీదూక్కుండానే అంటే నేను బండిచక్రానికీభూమికీ మధ్యనుండగానే ఆకాసంత అంతారాళాన్ని ఆందోళనపూర్వకంగా ఆలోచిస్తూవుండగానే బండి మళ్లీవల్లంలోకి దిగిపోయింది.

బండివాడు "ఏంటండి అబ్బాయిగారూ! అంతభయం. ఏంచూసిజడుసుకున్నారండీ?" అనిబండిదిగి వెనక్కివచ్చి "లేదులేండి, లేదులేండి" అంటూవుంటే, వెంకట్రామయ్యగారు వచ్చికలుసుకుని అయనబుజాన్నివున్న 6 కొబ్బరికాయలు జాఱిపోతూవున్నా, కండువాకొంగు నున్న పచ్చిమిరపకాయలువిడిపోతూవున్నా సరుదుకోకుండా నాదగ్గఱకువచ్చి బండివానితో "ఏంజరిగిందిరా? ఏంచేశావు? బండిబోల్తాకొట్టిందా? ఏమిటి?" అన్నాడు. బండివాడు "ఏమి లేదండి. రోడ్డొచ్చింది జాగ్రత్తన్నానండి. అనేసరికి అబ్బాయిగారు కంగారుబడ్డారు. నేనేం చెయ్యలేదండి" అన్నాడు.

వెంకట్రామయ్యమామ "ఏంనాయనాఏం?" అన్నాడు నన్నుబుజ్జగిస్తూ. "పాపయ్య గారు పెద్దాపురంరోడ్డుమీద దొంగలభయంఅన్నారు. బండివాడురోడ్డొచ్చిందిజాగ్రత్తంటాడే గాని బండిఆపడు. నిన్నురమ్మంటే నీవు గబగబావచ్చేవుకావు. మామయ్యా! నేనేంచేసేది? బండిదూకేశాను, ఫుంతలోనిల్చునివుందామని నీవువచ్చినాక రోడ్డెక్కదామని దూకేశాను"

అన్నాను. "మరి మాకినా రోడ్డుమీదేవున్నావు!" అన్నాడు మామనవ్వుతూ. "ఆమాటలు బండివాణ్ణడుగు. వాడాపందే వెధవ బండాపందే" అన్నాను. ఆపాళంగా వెంకట్రామయ్య మామ నావీపుతట్టి బండివాణ్ణి "వెధవా! కుఱ్ఱనాగమ్మను హడలుగొట్టావు" అన్నాడు. బండివాడు "అబ్బే! లేదండి: పుంతలోనుండి మెఱక్కరోడ్డెక్కుతూవుంటే బండికుదిపిస్తుంది గదా గనుకొయ్యపట్టుకుంటారని జాగ్రత్తన్నాను" అన్నాడు బండబ్బి. వెంకట్రామయ్య మామ నాచెయ్యిచూచి "పులకరంగాలేదుగదానాయనా!" అని బండివానితో "చవలా! ఇంటిదగ్గఱకువచ్చి బెదరగొట్టావుబిడ్డని" అన్నాడు. బండివాడన్నాడు "అబ్బాయిగారికంత భయమని తెలిస్తే రోడ్డనక ఇదీపుంతేఅని అనుందును. రోడ్డంటే పెద్దాపురంనుంచి జగ్గంపేటకు తిన్నగాపోతేరోడ్డుగాని ఇదిపుంతేకదండీ? కాట్రావులపల్లికి తిమ్మాపురానికీమధ్యవున్న పుంతే కదండీ. ఇదీపుంతేఅని అనుందును" అన్నాడు. నేనూఆకే తోవలోసంపాదించిన నాగాజుంగరంకేసి చూసుకుంటూ "ఉందిమామా! ఉంది! పోలేదు. దొంగలపాలుకాలేదు" అన్నాను. ఏమిటన్నాడుమామ. "నాగాజుంగరం" అన్నాను.

"అంతభయం గాజుంగరం తెచ్చిపెట్టిందినీకుచూచేవా?" అన్నాడు వెంకట్రామయ్య మామ. "లేదు. రోడ్డనడంవల్ల"అన్నాను నేను. "కాదు ఆదిలో పాపయ్యగారు పిలికిమందోయడంవల్ల"నన్నాడు బండబ్బి. అవన్నీకావు. ఇంతకూ చీకటిపడ్డంకారణమన్నట్టు ఎవరో లాంతరువేసికుంటూ వూళ్లోనుంచివచ్చి మాబండికి తోవచూపుతూ తీసికొనివెళ్లినారు.

ఎవరతడన్నాను వెంకట్రామయ్యమామను. "మనకోసమేవచ్చేడు. గొల్లగంగన్న. మనింట్లోపాలుపితికేమనిషి" అన్నాడుమామ. గంగన్న "ఎడ్లమువ్వలచప్పుడుగల్లని ఇంటిదాకావినిపిస్తే-ఎప్పుడూవినబడలేదింత ఒడుదుడుగ్గా- బండికేదో మోసంవచ్చిందిఅని లాంతరేసుకువచ్చాను. అబ్బాయిగారా? వెంకట్రావుగారా?" అన్నాడు.

అవునన్నాను భయంగియుంపోయి.

## నామతము

శ్రీమతి వింజమూరి వేంకటరత్నమ్మగారు

శక్యమగునంత సాధుత్వసరణిమనుట
ఏడఁగాని మానుషము పోనాడకుంట
మంచిచెడ్డలనొక్కపోల్కి నెంచికొంట
ఆత్మవిశ్వాసమర్యాద లంటియుండ
చేతనగునంత యుపకృతిఁజేయుచుండి
దానిమనసులోమాత్రమే దాఁచికొంట
నాకపజయమేగల్గినన్ వీఁకవిడక
భావికాలవిజయకాంక్షఁ బాటుపడుట.

పాపభీతినో యపవాదభయమువలనో
తలనుదాచుకోఁదగుచోటు గలుగకుంట
ఒంటరిగనున్న నాచేతలోరులకెఱుక
పడినయపుడైన నేనొక్కసడలఁగనుట,
నేనుద్రొక్కినదారిని మానకెట్టి
భయముఁబిఱికితనములేక బ్రదుకుగనుట
సిగ్గుగానిడంబముగాని చెందకుండఁ
బ్రజలునన్నెట్లుదలఁతు రబ్బంగినుంట.

# జీబున్నిసా*

ముద్దా విశ్వనాథము గారు (కవితాసమితి)

ముసల్మానువనితాలోకమున నగ్రస్థానమువహించిన విదుషీరత్నములలో నొకతెయు, జ్ఞానవతియునగు "జీబున్నిసా" ఔరంగజేబుచక్రవర్తిగారి ప్రథమతనూజ.

అద్భుతమేధానిధియగు నీపె లేఁబ్రాయమున తన 7-వ యేటనే తురుష్కులపవిత్ర గ్రంథము "ఖొరాను" కంఠస్థముగావించుకొనినది. అటుపై నాలుగువత్సరములలో అరబిక్, పర్షియను భాషలలో ప్రావీణ్యతగడించెను. ఇదిగాక గణితఖగోళశాస్త్రము లామె యభిమానశాస్త్రములు. ఈరాజపుత్రికి 21 ఏండ్లప్రాయమప్పుడు "ముల్లాసయీద్ అష్రఫ్" అనుపేరొందిన కవీశ్వరుఁడు గురుపదవినిస్వీకరించి, చాలపట్టుదలతో తనధర్మము నిర్వహింప 13, 14 వర్షములు ఆమె దివ్యవిద్యాసాగరమున నీఁదులాడుచుండెను. ఖగోళవేదాంత శాస్త్రాదివిషయములు సరసతయుప్పతిల్ల గురువుగారితో చర్చించుచుంటయు నామెకు ముచ్చట గొల్పుచుండెడిది. అప్పటి పండితప్రకాండములనెల్ల దర్బారుకురప్పించి, వారివలన ఉత్తమోత్తమవిద్యవడసినది. ఇంతయేల? ఏవిద్యయందును ఆమెకు సరియగుచేయిలేదనిన అతిశయోక్తిగాదు. ఇకదస్తూరీ ముక్తాఫలములే! జీబున్నిసా గొప్పకవయిత్రిగాగూడ ప్రతీతిగాంచినట్లు చరిత్రకారు లుగ్గడించియున్నారు. ఈమెచే నప్పటప్పట వ్రాయఁబడినలేఖలు "జీబు మన్షట్" అనుపేర గ్రంథరూపమున వెలువడినవి.

విఖ్యాతకవిపుంగవులను సన్మానించి సత్కరించుటయం దీపెకు మిక్కిలి అభిలాష. ఆమెదర్బారు ఆదర్శప్రాయమగు నొక 'పరిషత్త'నవలసినదే. అటనుండు పండితబృందము శాస్త్రకళాభివృద్ధికై వలయు గ్రంథజాలమంతయు పర్షియనుభాషలోని కనువదించుటలో రాత్రింబగళ్లు తెఱపిలేక మునిఁగియుండువారు. రాజపుత్రి తర్జుమాచేయించిన పుస్తకములన్నిటికిని పేర్లుంచుటలో తనయింటిపేరు "జేబీ" ప్రతినామమునకును మొదట చేర్పఁబడుచుండెను. ఆమె ఏర్పఱిచినగ్రంథాలయమునకు సరితూఁగుభాండాగారము మఱియొకటేదియు ఆకాలమున లేదు.

రాజపుత్రి సంభాషణచమత్కారమును, అందలిహాస్యరసమును ఔరంగజేబుయొక్క పెడబుద్ధినిమరలించుట కనుకూలముగనుండెను. తనబుద్ధినైశిత్యముచేతను, సద్గుణసంపత్తిచేతను తండ్రిలోపములు కప్పిపుచ్చి సవరించుచుండగల్గెడిది.

కవితయనుమాట చక్రవర్తికి చెవినిబడఁగూడదు. అయినను జీబున్నిసాకు అభిరుచిగల అట్టివిషయములలో కాలము వినియోగించుకొనుట కతఁడడ్డంకిపెట్టెడివాఁడుకాఁడు; పూర్ణమైనస్వాతంత్ర్య మామెకొసంగెను. ఒకనాఁడాయన హఠాత్తుగా ఆమెగదిలోనికి వచ్చెను; అపుడు తనపుత్రి "దివాని-హాఫీజు" అను నుత్కృష్టగ్రంథముఁజదువుటలో నిమ

* శ్రీ ఎ. హమీద్ హసనుగారి ఆంగ్లేయవ్యాసము నాధారముచేసికొని వ్రాసినది—ము. వి.

గ్నమైయుండుటఁగనెను. ఆమె భయభ్రాంతురాలైనది. మర్యాదాపూర్వకముగ చప్పున లేచి నిలఁబడుటవలన వణఁకుచున్న మృదుహస్తములనుండి పుస్తకము మెల్లగజాఱి క్రిందబడెను. అంత నౌరంగజేబు కొమార్తెను భయపడవలదని సముదాయింపగా నామె స్వస్థచిత్తయై తండ్రితో నిట్లనెను:—"నాయనగారూ! మీరిచట అడుగిడినపుడు నేను "దివాని-హాఫీజు" గ్రంథము నతిశ్రద్ధతో పఠించుచుంటిని; ఈపనికి మీరుగ్రులగుదురేమోయనుభీతిచే నాకు దేహముకంపించినది." అందులకు చక్రవర్తి:—"అమ్మా! ఆగ్రంథములోని ఏభాగము నాకుఁ గోపముగల్గించునని నీవనుకొంటివి?" అని యడిగెను. అపుడు రాజపుత్రి ఈవాక్యములు వినిపించెను;—"నిన్నను దేవతలువచ్చి పానశాలలతలుపులు బ్రద్దలుగొట్టుట నేకనులారఁగాంచితిని. వారు అదాముయొక్క మట్టితో నొకలోటారూపము తయారుచేసిరి."

ఔ.—దీనిభావ మేమనిగ్రహించితివి?

జే:—ఈరెండువాక్యములలోను 'హాఫీజు' మానవజీవితతత్త్వము చక్కఁగనిమిడ్చి వర్ణించియున్నాడు. అతనియభిప్రాయ మేమన పానపాత్ర ఒకచేతినుండి మఱియొకచేతికి తిరుగుచుండును. భూమికూడ పాత్రవలెనే గుండ్రముగనున్నది; అదియు తిరుగుచుండును. మనుజుఁ డొకమట్టిప్రతిమ. దేశ, కాల, పాత్రత లెటులున్నను అతనికి చిత్తచాంచల్యము స్వాభావికము. ఎట్టిప్రశాంతపరిస్థితులలోనైనను మనోవేగముయొక్క ఉద్ధతి వర్ణనాతీతము. ప్రతివిషయములోను మనసు సదా కలఁతనొందుచునేయుండును. దుర్దశాబాధలు సంభవించినపుడు వేదనవడలి మెట్లీవలఁబడుదుమాయను తహతహ; సౌఖ్యాంబుధిలో నోలలాడుతఱి ఇదిలేదు అదిలేదు అని ఏవోకొఱఁతలుకల్పించుకొని మఱికొన్ని సౌఖ్యములకై ప్రాఁకులాడుట; ఇది మనసు నిర్వర్తించుపని. మనమువసించుభూమియే తిరుగుచున్నపుడు మనము (మనమనస్సులు) తిరుగుట అసహజముగాదు." ఈచక్కనివ్యాఖ్యానము చక్రవర్తికి మనసున గాఢముగనాటుకొని దానిని మిక్కిలి రంజించెను.

తన పూఁదోఁటలోను, 'మహలు'లోను జేబున్నిసా స్వేచ్ఛగా విహరించుచుండెడిది. అందుచేత ఘోషాపద్ధతివర్జించినదని మనమనుకొనఁగూడదు. కులాచారమునను సరించి ముఖమున మేలుముసుఁగు (పరదా) లేకుండ ఆపె యెవరికంటను బడకుండెను.

జేబున్నిసాను ఒకయింటియామెగఁజేయవలెనని రాణిగారు మిక్కిలి యాశించుచుండెను. వైవాహికవిషయములో రాజపుత్రియభిప్రాయము లుదారములుగనుండెను. ఉద్వాహమునం దనిష్టతలేదుగాని, తనకు నచ్చినఘనుఁడు లభించుట దుర్లభమాయెను. ఎందరెందఱో జమీందారులు, రాజపుత్రులు నామెను బరిణయమాడ తగుయత్నములుసల్పిరికాని వారెల్లరకును 'ఉహు' అనియే జవాబువచ్చుచుండెడిది.

ఆగ్రాకురావలసినదని పర్షియాదేశపుయువరాజగు "ఫరూక్"నకు రాణిగారు కబురంపిరి; ఎటులయిన కూఁతునకు నచ్చఁజెప్పి ఈసంబంధము స్థిరపఱుపవలెనని యామె

ముఖోద్దేశము. ఈతఁడు మంచి సుందరాకారుఁడేకాని యతనిసౌందర్యము జేబున్నిసామనసు నాకర్షింపఁజాలకపోయెను. ఈబాంధవ్యమొప్పుకొనుమని రాణి మఱిమఱి హితబోధము చేసినది. వరుని విజ్ఞానసామర్థ్యాదులు పరిశోధించికాని ఏదియు నిర్ధారింపఁజాలనని జేబున్నిసా వివక్కాణించెను. అంతట నొకదినమున ఫరూక్ రాజపుత్రుఁడు 'మహాలు'లో విందున కాహ్వానింపఁబడెను. చక్రవర్తిగారితనయ వరులకగపడనియేర్పాటుగల తెరచాటున ఆసీనురాలయ్యెను. రాచకుమారుఁడు అతని మంత్రిబృందము, సహచరులు ఎల్లరును భోజనమున కుపక్రమించిరి. కొంతసేపయినపిమ్మట ఫరూక్ తన చతురోక్తులచే రాజపుత్రిని ఆనందింపఁజేయుతలంపుతో నామెకు వినఁబడులాగున నిట్లనెను:—"సాన్ భోసా బిసాన్ మి ఖాహామ్" అనఁగా—"నాకు 'బిసాన్ సాన్ భోసా' కావలెన"నియర్థము. 'సాన్ భోసా' అనుమాటలో 'సాన్' అనుపదము విడఁదీసినచో "భోసా" అనుమాట మిగిలియున్నది. దీనికి 'ముద్దు' అనియర్థము. శౌర్య హీనములును, అమర్యాదకరములునునగు నీలఘువచనములు జేబున్నిసావంటి ఉత్తమరాజపుత్రిమనసునెంతకలఁచివైచెనో దెలుపనలవికాదు. ఆమె రోషావేశపూరితయయ్యు కొంచెము నిదానించి నిశ్చలచిత్తముతో 'చెప్పుదెబ్బకొట్టినట్లు' లీజవాబు వెంటనేయిచ్చెను:—"అజ్ మతాబఖ్-ఎ-మదార్ తలాబ్"-అనఁగా "నీతల్లినుండియే గ్రహింపుము" ఈసమాధానము వినినవెంటనే 'ఫరూక్' నకు గర్వభంగమైనందున నతఁడు తలవంచుకొని, రెండవకంటివానికిఁ దెలియకుండ ఆరాత్రియేమూటముల్లెయఁగట్టుకొని తనరాజ్యమునకు పయనమైపోయెను.

జేబున్నిసా తనజీవితాంతమువఱకును అకలంకబ్రహ్మచారిణిగనేయుండినది. "వివాహ" మనుమాట ఆమెచెవిసోఁకినయంతయు బాధకరముగనుండెను. పురుషసంపర్కమన్న నామెకు తలనొప్పిదెచ్చుచుండెను. కలికాలమున నొకరిద్దఱట్టిపవిత్రస్త్రీలున్నను జనసామాన్యములో నట్టివారున్నారనునమ్మకముపుట్టుట వట్టిమాట. మీఁదు మిక్కిలి 'లోకులుకాకుల' నునట్లు సచ్చరితలఁజూచి పెక్కురు కన్నులలోదుమ్ముపోసికొందురు! అసూయాగ్రస్తులగు కొందఱు ఈమెకును, లాహోరులో ముఘల్ గవర్నరుగానుండిన కవిసత్తముఁడగు 'అకిల్ ఖాను'నకు నుశృంగారవిషయకపరస్పరసంబంధములుండెనని యపవాదములు చేసిరి. వివేకము గలవారెవ్వరును ఆయసంబద్ధప్రలాపములు నమ్మరైరి. కాని ఉబుసుపోక అట్టి నిందాసంభాషణములే కూడును, గుడ్డయునుగాఁజేసికొను సోమరిపోతుల నోళ్లరికట్టఁగలమా? రాజపుత్రి పెండ్లియాడకపోవుటచేతనే యపనిందలకుపాల్పడవలసివచ్చెనని కొందఱు చరిత్రకారులఊహ.

పరమపూజ్యురాలును, ప్రఖ్యాత ముసల్మన్ నారీరత్నమునునగు నిట్టి రాజపుత్రి తన 65-వ యేటఁ బరమపదమునొంది లాహోరుదరినున్న "నవనోకట"లో సమాధినందెను.

ఆలలనయొక్క పవిత్రాత్మసుప్రసిద్ధమృతజీవులతోఁగలసి మింటమెఱయుచు తన జీవితములో సుగుణములేవేనియున్న గ్రహించి శక్త్యనుసారమాచరింపుఁడని తోడిసోదరీ మణులకు ప్రబోధముసేయుచున్నది!

## ౨

### అకుండి వేంకటశాస్త్రిగారు

ఈమె మొగలాయిపాదుషాయగు ఔరంగజేబునకు జ్యేష్ఠపుత్రిక. ఈమె 1639-వ సంవత్సరమున జన్మించెను. ప్రసిద్ధమగు తైమూరులేన్, జెంగీజ్ ఖాన్ అనువారల వంశమునకు చెందినదీమె. ఈమె కాలమునకు ముందున్న మొగలాయిచక్రవర్తులు విద్యాశోభితులును, విద్యాపోషకులునై వెలసిరి.

ఇట్టి వైదుష్యసాంప్రదాయముగల మొగలాయిప్రభువులలో నొకడగు ఔరంగజేబు కొమరితయై జేబున్నీసా పర్షియన్ భాషలో పాండిత్యప్రకర్షను చాటునట్టి పద్యములను రచించి యజరామరకీర్తిని గడించినది. ఆధునిక పర్షియన్ భాషాపండితు లామె కవితామాధురికి చొక్కియున్నట్లు తెలియవచ్చుచున్నది. ఈమె జీవితములోని ప్రత్యేకవిశేషములనెల్ల తెలిసికొనుట కీమె జీవితచరిత్ర మేమియు వ్రాయఁబడియుండలేదు. ఈమె జీవితపు కడపటిభాగమున తీవ్రకోపియగు నీమె తండ్రియాగ్రహమునకు పాత్రుఁడు కావలసివచ్చునేమో యని ఔరంగజేబు దర్బారునగల చరిత్రకారులలో నొక్కడైనను ఈమె జీవితచరిత్రను వ్రాయ సాహసింపలేదు. ఈమె తల్లి దిల్ రసుబానుబీగం. ఈమె బాల్యమునుండియు తనబుద్ధివైశద్యమును వెల్లడించుచున్నందున నీమెకు సమర్థులగు విద్యాగురువులచే తండ్రి చదువుచెప్పించుచు వచ్చెను. ఈమె కడుచిన్నతనముననే 'ఖొరాను' కంఠస్థ మొనర్చుకొనెను. తండ్రి 'జేబున్నీసా' ఖొరాను కంఠస్థముచేసికొన్నందులకు కడు సంతసమంది తనకోటలో గొప్పవిందుచేసెను. ఢిల్లీలోగల మైదానమున తన సైనికులకెల్ల మృష్టాన్నముతో విందొసగెను. బీదలకు ధర్మముక్రింద ముప్పదివేల బంగారుమొహర్లు ఖర్చుపెట్టెను. రెండుదినములు సర్కారుకచ్చేరీలు మూయఁబడెను. జేబున్నీసాకు 'మియాబాయి' యనునామె ఉపాధ్యాయినిగా నియమింపఁబడెను. ఈమె నాలుగువత్సరములు 'అరబిక్'భాష శ్రద్ధతో నేర్చెను. ఈమె గణితశాస్త్రమును, జ్యోతిశ్శాస్త్రమును చదివి అందధికప్రావీణ్యమును గడించెను.

ఈమె 'ఖొరాను'పై వ్యాఖ్యను రచింపఁబూనెను. కాని తండ్రి యాసంగతి తెలిసికొని ఈమె యట్టి కార్యముచేయ దలపెట్టసాహసమని తలచి ఈమెను వారించెను. ఈమె చిన్నతనమునుండియు పద్యములననర్గళముగ రచించుచుండెను. మొదట ఈమె 'అరబిక్'భాషలో పద్యరచనము నారంభించెను. ఈమె తన మాతృభాషయగు పర్షియన్ భాషలో కడుధారాళముగ పద్యరచనమును చేయగలదు. షారుస్తుంఘాజీ యను మహాపండితుడొక డామెకు పర్షియనుభాషలోని మహత్తరగ్రంథములను చెప్పుచుండెను. ఈగురువే ఈమెకు పద్యరచనమందు ప్రవేశముగల్గించినాడు. ఈమె తాను పర్షియనుభాషలో రచించిన పద్యములను తనగురువునకుకూడ చూపుటకు సిగ్గుపడుచుండెడిది. కాని ఆమె యప్పుడప్పుడు రచించిన గీతములను చిన్న కాగితములపైవ్రాసి వానిని తన పాఠపుస్తకములలో నక్కడక్కడ భద్రపరచుచుండెను. ఆమె యెదుట లేనప్పు డాపండితు డామె పాఠపుస్తకములలో నక్కడక్కడనుంచబడిన పద్యములువ్రాయఁబడిన కాగితములనుగాంచి యందలి పద్యములనుగాంచి ఆశ్చర్యపడుచుండెడివాడు. మఱియు నత డీమెపేరు వాసిగాంచగల యంతటి కవయిత్రి కాగలదని వ్రాసిచ్చెను. ఈపండితుడు ఔరంగజేబును తన నౌకరులను దేశములోనికి పంపించి పర్షియానుండియు, కాశ్మీరమునుండియు మరియితరప్రాంతములనుండియు గొప్పపండితులను వెదకింపఁజేసి వారిని ఢిల్లీఆస్థానమునకురప్పించి వారలతో రాకొమరితకు విద్వద్గోష్ఠిఁగలిగింప హెచ్చరించెను. ఔరంగజేబునకు పండితులు, కవులు అనిన నధికగౌరవాదరణభావములు లేనివాడయ్యు రాకొమరితకై పేరుప్రాసిన కవులనురప్పించి వారిని పోషించుచువచ్చెను. ఔరంగజేబు హాఫీజురచితగ్రంథములు పాఠశాలల



సినీమానటి గోహరుకన్య



శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు



అనాథ బాలిక

గుంటూరునందలి శారదానికేతనసంస్థాపకురాలు శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు దేశసేవపరాయణులగు ఆంధ్రస్త్రీలలో మిన్న. లవణ సత్యాగ్రహోద్యమమునందు పాల్గొని ఈమె కారాగారమునకు బోయియున్నది. ఆమె వేలూరు చెఱసాలయందుండగా వేలూరు సెంట్రల్ జెయిలులో ఖయిదీగానుండిన అన్నెం పేరమ్మ అనే స్త్రీ చనిపోయినది. ఆమె హిందూస్త్రీ. ఆమెకొక కుమార్తె. ఆమె పేరు కల్యాణి. తల్లిని గోల్పోయిన ఈ పిల్లను పోషించువారు లేనందున గవర్నమెంటువారు వేలూరిలోనుండు క్రైస్తవమిషనరీలకు ఒప్పగించిరి. హిందూ బాలికలను క్రైస్తవులకిచ్చు పాడికాదని అప్పుడు లక్ష్మీబాయమ్మగారు ఆందోళనసల్పిరి. ఈవిషయము శాసనసభలోకూడ చర్చింపబడినది. అందుపై గవర్నమెంటువారు ఈబాలికను లక్ష్మీబాయమ్మగారికి అప్పగించిరి. ఈ అనాధబాలిక ఇపుడు గుంటూరు శారదానికేతనమునందు పోషింపబడుచున్నది.

లోని బాలురచేగాని, జనానాలో బీగముచేగాని చదువబడుటను నిషేధించినను 'జీబున్నీసా' మాత్రము వానినిజదువ నియ్యకొనెను. రాకొమరిత విద్వద్గోష్ఠికై నాసిర్ అలీ, సాయా, షాముష్‌వాలీఉల్లా, బెహురాజ్ అను విద్వత్కవులను పాదుషా పోషించుచుండెను. నాసిర్ అలీ పారిస్యనుభాషలో మనోహరమగు పద్యములను రచించుచుండెను. 'జీబున్నీసా' యాపద్యములనుచదివి వానిని మెచ్చుకొనుచుండెను. అతడు పద్యములు వ్రాయుటలో నామెకు ప్రతిస్పర్థియగుచువచ్చెను. ఈమె తన విద్వద్బృందముతో వినోదగోష్ఠిగా సమస్యాపూరణాదులనేర్పాటుగావించి వినోదించుచుండెడిది.

ఇట్టి వినోదగోష్ఠిని 'ముషాయిరా' అందురు. ఈవినోదగోష్ఠియందు 'జీబున్నీసా' కడు చాకచక్యమును బుద్ధివైశద్యమును ప్రకటించుచువచ్చెడిది. షాజహాన్ జీవించియున్నప్పుడీమెను తనపెద్దకుమారుడగు దారాకొమారుడగు 'సొలైమాన్ షెకో'కునిచ్చి పెండ్లిచేయఁదలపెట్టెను. ఔరంగజేబు దారాయనిన యసహ్యించుకొనును. అతడనిన కడుభయము. అందుచే నతడు తనకొమరిత దారాకొమరునకివ్వబడుట కిష్టపడలేదు. తన యిష్టమునకు వ్యతిరేకముగ తండ్రియావివాహమును కావించునేమోయని దారాకొమరునికి విషము పెట్టించి చంపించెను. ఈమెను వివాహమాడ నెందఱో రాజపుత్రులు ప్రయత్నించిరి. కాని యీమె తాను స్వయముగ రాజపుత్రులనుచూచి తనకిష్టమగువానిని నిర్ణయించుకొని వివాహమాడుదు ననుచుండెడిది. అందుచే నీమెకు నచ్చినవరుడు లభింపమి చాలకాలము యవివాహితగనే యుండెను. అదిగాక తానావీరపుత్రుని శౌర్యవైదుష్యాదిగుణగణములను పరీక్షించి మరి వివాహమాడుదు ననుచుండెడిది. అట్టివరులలో పిరాన్ దేశపు రాజైన రెండవ షాఅబ్బాస్‌అను రాజుకుమారుడైన మీర్జాఫారూక్ అనువతడొకడు. జీబున్నీసాయాతనిని ఢిల్లీకిరమ్మనియు, యాతనిని చూచినమీదట పరింతుననియు యతనికొకలేఖ వ్రాసెను. అతడును యామె యాహ్వానము నంగీకరించి పరివారసమేతముగ ఢిల్లీకివచ్చెను. జీబున్నీసాయు నాతనిని తన యుద్యానవనమున గల ప్రత్యేకమందిరమున విడియఁజేసి, తానేస్వయముగ మేలిముసుంగు ధరించియే యాతనికివలసిన భోజనాది పరిచర్యలనుగావించెను. అతనికి బహువిధభోజ్యపదార్థములతో (పిండివంటలు, మిఠాయిలు) విందులను జేసెను. ఒకనాడాతడు విందారగించునపుడు, తనకొకవిధమగు మిఠాయి వడ్డింపఁగోరుచు అందులకై యుపయోగించిన భాషలో మిఠాయికేగాక ముద్దుఅను నర్థమునిచ్చునట్టిదియైనగు నొకపదమును బ్రయోగించెను. అంత నామె సునిశితమగు బుద్ధిగలదగుట యందలి 'ధ్వని'ని (ద్వంద్వార్థమును) గ్రహించి కుపితయై మావంటశాలనుండి మీకుకావలసినది మాత్రమడుగుఁడు. అది వడ్డింపఁబడునని ప్రత్యుత్తరమిచ్చెను. తదనంతరము ఆరాకొమరునిగూర్చి చెప్పుటలో యతని రూపాదులు తనకునచ్చినను యాతని 'ఫాయి' మాత్రము నచ్చలేదనియు, యందుచేత నాతనిని వివాహమాడననిచెప్పెను. 'మీర్జాఫారూక్' అటుల తిరస్కరింపబడియు యీ క్రింది భావముగల పద్యమువ్రాసి యామెకు పంపెను. "నే నీమందిరమును విడిచివెళ్లను. నేనిచ్చట సాష్టాంగముగ పరుండియుండెదను. నాకీజీవితమున సౌఖ్యానందములు జీబున్నీసావలననేగలవు." ఆపద్యమునుచదివి, యతని మౌఢ్యమునకు కోపించి 'ఓబాలుడా! ప్రేమించుటయన నొకయాటయనుకొంటివా? ప్రేమనెంత యల్పమైనదానినిగా నెంచితివి! ప్రేమ యుజ్జ్వలదీప్తి; దానివలనగల్గు కాంక్షాతీవ్రత, విరహవేదన అను వీనినిగూర్చి నీకేమియు తెలియద'ని వ్రాసి యాతనికి తుదిచీటినంపెను. అంత నాతడునిస్పృహుడై పరిష్యావెళ్లిపోయెను. ఈవిషయము చరిత్రయం దంకితమైయున్నది.

రాజనగరున 'జీబున్నీసా' అత్యంతస్వేచ్ఛావర్తినియై యుండెను. ప్రసిద్ధులగు విద్వాంసుల కీమె లేఖలు వ్రాసి తన యాస్థానమునకు వారిని రప్పించుకొని వారితో శాస్త్రవిషయములను చర్చించుచు వచ్చెడిది.

ఈమె తనకు పెదనాన్నయగు దారాషికోయెడల భక్తిగౌరవములుగలిగి మెలగుచుండెడిది. ఏలనన, అతడు గొప్ప విద్వాంసుడు. ఈమె పరిష్యన్ భాషలో పద్యములల్ల నేర్చుకొనునాడీమె తనపద్యముల నతనిని గూర్చి వ్రాయుచుండెడిది. అప్పుడప్పుడీమె తండ్రిన్యాయసభకువెళ్లి తీర్పులిచ్చుటలో తండ్రికి తోడ్పడుచుండెడిది. ఈమె యంతఃపురములలో యసూర్యంపశ్యయైయుండియు జీవితమునందలి యానందముల ననుభవింపఁగల్గియుండెను. ఈమె వ్రాయుటకుపయోగించు కలమునకు 'మక్ఫీ' (నిండి నిబిడమైనశక్తి కలదిఅను నర్థమిచ్చును) అనుపేరిడెను.

ఈమె తనమతమునందధికమగు నభిమానమును గలిగియుండెను. తనతండ్రి యవలంబించు సంకుచిత, పరమతసహిష్ణుతారహితమై దూషితమగు ఛాందసమతమును గాక, యీమె విస్తృతౌదార్యపరిపూర్ణమైన సూఫీ మతమునవలంబించెను. ఈమె తండ్రివలెనే 'సూనీ' తెగకు చెందినదయ్యు, మతవిషయిక వివాదాంశములను గూర్చి వాదించి యిత్థమిత్థమని, నిర్ణయింపఁగల చతుర. మతవిషయములలో మిక్కిలి యుదారదృష్టిగలది. ఒకానొక సమయమున నీమె తన యుద్యానవనమున విహరించుచు నచటగల ప్రకృతిదృశ్యములగని యానంద వివశయై యిట్లని పాడుకొనుచు బోవుచుండెను. "ద్రాక్షసారాయి, పుష్పములు, వినీలజలప్రవాహము, ప్రియుని ముఖారవిందము అనునవియే నాకానందదాయకములు." 'లయ' కుదురిన పరిష్యన్ గీత పాదముల రెంటిలో నీయానందదాయకములగువస్తుసమితినిమెచ్చి, యామె కానందమురేకెత్త, పాడుకొనుచు యావనమున నెవ్వరైన యాపాటను వినుచుందురేమోయనిదైన సంకోచింపక, విచ్చలవిడి విహరించుచుండ, నావనముననే, నొకచ్ఛాయావృక్షముక్రింద నొకచలువరాతితిన్నెపై నాసీనుఁడై నిమీలితనేత్రుఁడగుచు 'యల్లా'ను నామము జపించుచుండిన తండ్రినికనుగొని సంభ్రమమును భీతియునంది యాగీతములో నొక పాదమునట్లు త్రుటిలో మార్చివేసి పాడదొరకొనెను. "ప్రార్థనలు, ఉపవాసములు, అశ్రువులు, పశ్చాత్తాపము అనునవియే నాకానందదములు."

మతవిషయికములగు తగవులేవేనివచ్చినచో విచారణకై 'జీబున్నిసా' సిద్ధపడుచుండెను. ఔరంగజేబు ఆమె విదుషియని యామె కట్టియవకాశమొసంగెను. మతవిషయికమగు తగవులన్నియు నామెచే పరిష్కరింపఁబడుచువచ్చెను. ఆమె తీర్పులన్నియు న్యాయసమ్మతములై యామె న్యాయైకదృష్టిని చాటునవిగా నుండుటచే ప్రశస్తినిఁబడసి గ్రంథస్థములైనవి. ఆమె తీర్పులకు ప్రతులువ్రాయబడి యవి ఇరాన్, తురాన్ దేశములకుకూడ పంపబడుచుండెడివని ప్రతీతి. ఈమె న్యాయాధిపురాలై ప్రతిభతో కావించు తీర్పులనుగని కొందఱు తీగము లామె యవలంబించు 'సున్నీ' మతము నవలంబింపఁబూనిరి.

ఈమె యందుగల ప్రేమచే ఔరంగజేబు ఈమె ఖర్చులకొఱకు వత్సరమునకు నాలుగులక్షలరూపాయల నిచ్చుచుండెడివాడు. ఈమె యీధనమును స్వీయమగు నైహికభోగానుభవములకై వెచ్చింపక, విద్వత్పోషణమునకును, వితంతువుల సంరక్షణమునకును, తలిదండ్రులులేని బాలబాలికల రక్షణమునకును, ప్రతివత్సరమును మక్కామదీనాలకు యాత్రకైపోవు మహమ్మదీయభక్తుల నిమిత్తమును వినియోగముచేయుచుండెడిది. ఈమె మతాభినివేశము, దైవభక్తియు మానవసేవకై పూర్తిగా వినియోగింపఁబడినవి.

ఈమె యుద్గ్రంథములను సేకరించి యొకగ్రంథభాండారమును నిలిపెను. శిథిలమగుచున్న వ్రాతప్రతుల కుత్తమప్రతులను నేర్పుగవ్రాయగల వ్రాతగాండ్రకు వేతనములనిచ్చి వ్రాయించెను. ఇందులకై వ్రాతగాండ్ర కొకప్రత్యేకమందిరము నేర్పరచి వారిచే గొప్పగ్రంథములకు ప్రతులను వ్రాయించుచుండెను. చక్కని వ్రాత వ్రాయగల కాశ్మీరదేశపులేఖకులచే ప్రసిద్ధమగు చక్కని కాశ్మీరదేశపు కాగితములపై పటగ్రంథముల

ప్రతులను వ్రాయించెను. ప్రతియుదయమున నామెకడుశ్రద్ధతో యాలేఖకులు వ్రాసినప్రతులను పరిశోధించి మూలమునకును దానిపుత్రికకును గల్గిన భేదపాఠములను సవరించుచువచ్చెడిది. ఈమె సమకాలికులగు కవులెల్లరీమెను కవయిత్రియని ప్రత్యేకమగుగణ్యతతోఁ జూచుచుండిరి. పరిష్యను, ఉరదూభాషలలో గ్రంథములను రచించినకవులు తమకృతులనామె యభిప్రాయార్థమును విమర్శనార్థమునుకూడ పంపుచుండిరి. ఆగ్రంథముల నామెశ్రద్ధతో చదివి యవి గుణయుక్తములైనచో యాకృతికర్తలకు బహుమానములను పంపుచుండెడిది.

కొందఱు మహమ్మదీయవనితలవలె నీయామె తనదంతములకు 'కప్పు'నుగాని, కనురెప్పలకు కాటుకగాని ధరించెడిదిగాదట. ఈమె తన మాధుర్యమైన కంఠమెత్తి 'కొరాను'నుండి కొన్నిఘట్టములను చదివెనేని శ్రోతల హృదయములుకరగి మతావేశముచే యశ్రువులరాల్తురట. ఈమెదేహమున వేయలంకారములను ధరించెడిదిగాదు. కంఠమున నొకముక్తాహారమును మాత్రము ధరించెడిదట. కష్టసహిష్ణుతలో గొప్ప యాధ్యాత్మిక బలమును ప్రదర్శించుచుండెను. ఈమె కొకప్రధానురాలైన మిత్రురాలుగలదు. ఆమెపేరు 'ఇమామి'. ఈమెకు కవిత్వమునందభినివేశముమెండు. జీబున్నిసాకు యుద్ధపాండిత్యముకూడగలదు. తనతండ్రికి యుద్ధములలో సహాయముచేయుచుండెడిది.

1662-వ సంవత్సరమున ఔరంగజేబునకు జబ్బుచేసెను. వైద్యులాతనిగాలి మార్పునకై స్థలాంతరమునకు బోవలయునని చెప్పిరి. అంతట ఔరంగజేబు సకుటుంబముగ లాహారునకు వెడలెను. తనమంత్రికొమారుడగు 'అఖిల్ ఖాన్' ఆనగరమున గవర్నరుగానుండెను. అఖిల్ ఖాన్ సురూపశౌర్యాదిగుణగణవిరాజితుడేగాక కవికూడను. అతడు 'జీబున్నీసా' కవయిత్రియని యెఱిగియుండెను. ఆమెనెట్లయినచూడ సమయమునకై నిరీక్షించుచుండెను. నగరరక్షణవ్యాజమున, తనయశ్వరాజముపై నధిరోహించి, ఆమె నెట్లయినచూడగల్గుట తటస్థించునను నాశతో నౌరంగజేబు నివసించురాచనగరుచుట్టు గోడలవెలుపలి ప్రదేశమున పలుమారుతిరుగుచుండెను. ఒకనాటిసాయంకాలమున జీబున్నీసా దానిమ్మపూవన్నెగల వస్త్రమునుధరించి మేడపై విహరించుటనుజూచెను. అతడామెకు వినబడునట్లు "రక్తాంబరధారిణియగు నొకస్త్రీవ్యక్తి నాకు స్వప్నమునందువలె కన్పట్టుచున్నది"అనెను. ఆమె యదివిని "ఆమెనీకు శౌర్యముచేగాని, ధనముచేగాని, పాపము! లభింపదు." అని యాతని వాక్యమును పూర్తిచేసెను. మరియొకసమయమున నామె చెలికత్తెలనుగూడి తనతోటలోగల చలువరాతితో కట్టబడుచున్న మందిరమును చూచుటకు పోవుచుండుటనుగాంచి అఖిల్ ఖాన్ తానొక 'తాపీ' పనివాని వేషమువేసికొని పనివాండ్రతో చలువరాతితో కట్టబడుచున్న మందిరముకడకుజేరి ఆమెకు వినబడునట్లు పరిష్యనుభాషలో 'నీకొఱకై యిట్టినీచపాత్రము ధరింపవలసిన వాడనైతి'ననెను. అందులకామె 'నీవు వాయురూపము ధరించినను నాకచభారమునగల నొక్కకేశమునైన కదల్పజాల'వని తృణీకారముతో ప్రత్యుత్తరమిచ్చెను. రెండవసారి యతడు పరిభవింపఁబడియు ఆమె నెచ్చటనైన తోటలోకలసి మాట్లాడనభిలషించి తిరుగుచుండెడివాడు. ఆమె తాను స్వయముగ తన వరునెన్నికొందుననియు, అందులకై యాయారాజుల చిత్రపటములను దెప్పించుమని తండ్రినికోరెను. అటుల తెప్పింపఁబడిన చిత్రపటములనుచూచి వారిలో 'అఖిల్ ఖాను'నువరించి యాతని కొకలేఖవ్రాసెను. అందుపై రెండుసారులు పరిభవింపఁబడిన అఖిల్ ఖాన్ నీవంటి చక్రవర్తిపుత్రికను వివాహమాడుట నావంటివానికి యొకబాలక్రీడవంటిది గాదని యెఱుంగుమనియు తానామెను వివాహమాడననియు తెలిపెను. అఖిల్ ఖాన్ యామెను కలిసికొనుచు యామెను వివాహమాడుటకుఁజేయు యత్నములను తెలిసికొని యామె నెవనికో వివాహముచేసి అఖిల్ ఖానువంటి వరులయెరపిడిలేకుండఁ జేసికొనుటకై యౌరంగజేబు యత్నించెను. ఒకనాడు అఖిల్ ఖానును, జీబున్నీసాయును నొకయుద్యానవనమున మాట్లాడుకొనుచుండ జీబున్నీసా, ఔరంగజేబు వచ్చుచుండుటనుగాంచి యాతని నచటగలనొక 'డేగిసా'లో

కూర్చుండబెట్టి 'నీవు నాయందు నిజముగ వలపుగలవాడవేని నిశ్శబ్దముగ నందుకూర్చుండుము. వలపు తెవులుచే బాధపడువారల కిట్టిదుర్దశయేకదపటికాస్తి' యనుచు నొవ్వనాడెను.

ఈమె తనకు శత్రువగు శివాజీయెడల సానుభూతిగల్గి వర్తించుచున్నదనియు, ఒకవేళ యాతనియందు వలపునిలిపి యాతనిని వివాహమాడు నేమోయనియు భయమంది యౌరంగజేబు జీబున్నీసాను కొంతకాలము 'సలీమ్‌ఘుర్' కోటలో బందీకృతనుజేసెను. ఖైదులోనుంచబడినప్పు డీమె పరిష్యనుభాషలో కొన్ని భావగర్భితములగు గీతములరచించెను. మతవిషయమున నీమె యక్బరువలె హిందూమహమ్మదీయసమ్మేళమును వాంఛించెను. ఈమెకు యిస్లాముమతరహస్యములేగాక, హిందూమతమునుగూర్చియు, జోరాస్ట్రియన్ మతమును గూర్చియు బాగుగఁదెలియును. ఈమె రచించిన కొన్నిగీతములలో సూర్యభగవానుని కీర్తించెను. ఈమె రచనలలో 'దివానీమక్ఫీ' అను పేరుగల పద్యగ్రంథము హిందూదేశమంతటను పలువురచే చదువఁబడుచున్నది. అది పరిష్యనుసారస్వతమున ప్రసిద్ధినిగన్నది.

తనకు సముచితుడగువరుడు లభింపమి తనజీవితాంతవరకు నవివాహితగనే యేబదిసంవత్సరములు జీవించి యీమె 1689-వ సంవత్సరమున పరమపదించెను. ఈమె తాను చనిపోవుటకుముందు రచించినగీతమున నిట్లు తన్నభివర్ణించుకొనెను. "నేనొక రాకొమరితను. నాజీవితకాలమున నేనొకవిరక్తమార్గము ననుసరించితిని. 'స్త్రీ'లోకమున నేనొక ప్రతినిధియైనవ్యక్తినను నానామమునగల యర్థము నాయెడల సార్థకమైనదను తృప్తితో నీలోకమును వీడుదును."

**—From The 'Diwan of Zebunissa' of 'The Wisdom of the East Series'**

పునశ్చ: ఔరంగజేబు, 1663-వ సంవత్సరమున కాశ్మీరముననున్నప్పుడు బుషిపీర్*తో, తాను భుజించునప్పుడెల్ల తనకురక్తము కన్నులకుగట్టినట్లు కనుపడుచుండుననియు అందులకు కారణమేమైయుండునని యడిగెను. అందులకు 'బుషిపీర్' ఔరంగజేబు నిష్కారుణముగ జంపించిన 'శర్మద్'రక్తమేయట్లు కనబడుచున్నదని చెప్పెను. 'శర్మద్' సూఫీమతతత్వమునం దభినివేశముగల యొక సన్యాసి. ఇతడు గొప్పజ్ఞాని. పరిష్యన్ భాషలో గీతముల నాశుధారగరచించి పాడగలకవియు, గాయకుడునై యుండెను. ఒకనాడతడు ఢిల్లీ రాజనగరు సమీపమునుండి పోవుచుండగా మేడమీదనుండి యౌరంగజేబుకుమార్తె జీబున్నీసా యాతనిపాటలను కౌతుకముతో వినుచుండెను. శర్మద్ ఆసౌందర్యరాశింగనుఁగొని మోహవశుడై గంభీరస్వనమున నిట్లనెను. "మానవహృదయసంక్షోభమును తొలగించి దుఃఖమును రూపుమాపునవి ఈప్రపంచమున నాల్గేగలవు." జీబున్నీసా ఆమాటనందుకొని "సారాయి, ఆకుపచ్చని మైదానము, జలజలప్రవహించు సెలయేరు, సుందరి ముఖారవిందము అను నీనాల్గే మానవునిదుఃఖమును మాన్పునవి" అని పూరించెను. ఆమెకుసమీపమున గదిలో కూర్చుండిన ఔరంగజేబు తనకుమార్తె యశ్లీలవాక్కులకామెపై కోపించెను. జీబున్నీసా తనతండ్రిప్రక్కనున్నట్లు తెలిసికొని మరల నిట్లనెను. "ప్రార్థన, ఉపవసించుట, జపమాలిక, పశ్చాత్తాపము అనునవియే ఈశ్వరానుగ్రహముబడయుటకు సాధనచతుష్టయము" అని మార్చిపలికెను. అంతట ఔరంగజేబు జనానాస్త్రీలు సంచరించెడు మేడసమీపమున శర్మద్ వివస్త్రుడై తిరుగుచున్నందుల కతనినిబంధించి యాతనిని విచారణచేసి యతనికి ఉరిశిక్షవిధించెను. ఇట్టిఘోరశిక్షవిధించినందులకే 'శర్మద్'రక్తమే ఔరంగజేబునకు భోజనసమయమున కనబడుచుండెనని బుషిపీరు ఔరంగజేబుతోననెను. బుషిపీరు ప్రార్థనసలిపి ఔరంగజేబునకు భోజనసమయమున రక్తముకనబడకుండఁజేసెను.

---

*ఆనందకౌలుగారి 'ఇండియన్ అంటిక్వెరీ', జూలై, 1931 పత్రికలోని బుషిపీర్ జీవితచరిత్రమునుండి.

# జోల పాటలు

(సంపాదకురాలు) శ్రీమతి కల్వటపు రుక్మిణమ్మ గారు

జోలారిపండెరుపు దొండపండెరుపు
తానెరుపుఅమ్మాయి తనవారిలోను.
చిన్నమాఅబ్బాయి చిట్టిలుకమాకు
పప్పుగింజచూస్తే బ్రతుకనివ్వడు.
చిన్నవాడ! రారా, చెన్నుడా! రారా
చెన్నుడా! అమ్మాయిచేతి చెండందుకోరా!
అందరిమామల్లు చందమామల్లు
అమ్మాయిమామల్లు రామలక్ష్మణులు
రామలక్ష్మణులంటి మామల్లువుంటె
రాకపోకలుగలవు అమ్మాయినీకు.
కలవారిపట్టిన్ని గారాబామన్ని
కంసాలిచేయించె కాళ్లగజ్జెలు
అవికట్టిఅమ్మాయి అడుగోబోతే
ఎత్తుకొనిముద్దాడె అమ్మిమామల్లు.
నిద్రపోఅమ్మాయి నిద్రపోవమ్మ
నిద్రకన్యకలొచ్చి నిన్ను లేపేరు
భద్రకన్యకలొచ్చి పాటపాడేరు
నాగకన్యకలొచ్చి నాట్యమాడేరు
దేవకన్యకలొచ్చి వీణెమీటేరు
జోలజోలలపండు నీవరటిపండు
పల్లెజోలలపండు పాపడమ్మాయి.
కృష్ణ! కృష్ణ! అనిమేవు కృష్ణుతలచేవు
కృష్ణుడేమికావలయు? శ్రీరాధాకృష్ణా!
శ్రీరామ! జయరామ! శృంగారరామ!
చారువిక్రమరామ! చంద్రగిరిరామ!
రామ! రామ! అనియేవు రాముతలచేవు
రామేమికావలయు? రాఘవులసీతా!
చిన్నఅమ్మాయి చన్నగిరిమొగ్గా
వీథుల్లనాడేటి విరజాజిమొగ్గ.
పడవకుపడవకు వెఱ్ఱిఅమ్మాయి!
పడి స్తేనీకళ్లు నీలాలుగారు
నీలాలుకారితే నేచూడలేను
పాలైనకార్చవే బంగారుతల్లీ!
ఆటమాణిక్యమే పాటమాణిక్యం
అందరికీఅమ్మాయి రత్నమాణిక్యం
రత్నమాణిక్యమ్మ ఎవ్వరిపట్టి?
రాజుల్లచేతిదే గజనిమ్మపండు
ఆడపోయినచోట మాడదొరికింది
మాడపెట్టిచేయిద్దు మద్దికాయల్లు
తాతలకుముద్దమ్మ తండ్రులకుముద్దు
మిక్కిలీముద్దమ్మ మేనమామలకు
మేనమామలముద్దు మేలిమ్మిముద్దు
తావిదుతోఅమ్మాయి తల్లులకుముద్దు.
జోలల్లుపాడితే జొన్నల్లుపండు
అమ్మాయినిపాడితే రాజనంపండు
గాజులసెట్టి వోయికనకాలసెట్టి
తేవోయిఅమ్మాయికి తేనెగాజుల్లు
తేనెగాజులసెట్టి టెంకాయసెట్టి
నల్లగాజులసెట్టి మావాడరమ్మ
మావాడకొచ్చి మాయిళ్లకొచ్చి
మాబాలకు గాజుల్లు తొడిగిపోవోయి.
వూరుకోఅమ్మాయి వూరుకోవమ్మ
వూరువ త్తకులంత నీఅ త్తమొగలు.
చిన్నమాఅబ్బాయి సిరిముఖముచూచి
సిగ్గుపడిచంద్రుండు పొడవనేరాడు.
మరునాడుఅమ్మాయి మాటల్లుచూచి
మాణిక్యాలతో పొడిచెసూర్యుడు.
కోరిమాఅమ్మాయి కన్నుల్లుచూచి

కలికిచందమామ కానరాడాయే. ✓
హాయిభోయిల్లాలు ఓబాలలారా!
మాబాలరాదుగా మీతోడఆడా?
అందరిమామల్లు దూరానగలరు
అమ్మాయిమామల్లు చేరగలరు.
ఉత్తముని పేరేమి? ఊరుపేరేమి?
సప్తపురుషునికన్న తల్లిపేరేమి?
ఉత్తముఁడు దశరథుఁడు, ఊరుఅయోధ్య
సప్తపురుషునికన్న తల్లికౌసల్య
పట్నమ్మపేరేమి? పల్లెపేరేమి?
పట్నభద్రునిగన్న తల్లిపేరేమి?
పట్నంబుద్వారకా, పల్లెరేపల్లె,
పట్టభద్రునికన్న తల్లియశోద.
చిలకల్లుచెలరేగి జీడికొమ్మెక్కు.
అమ్మాయినికొట్టినకొట్లు ఊరెల్లరట్లు.
అమ్మాయికివ్వరమ్మ ముత్యాలమెట్లు.
అమ్మాయినెవ్వరే కొట్టిన్నవారు?
కొట్టికొబ్బరిబెల్లం చేతికిచ్చారు.
వెండిదిఉయ్యాల పమిడిగొలుసుల్లు
వరలక్ష్మి! ఊపవే అమ్మాయితొట్టి
పట్టుపరుపులు పట్టుదిల్లు
పార్వతీ! ఊపవే అమ్మాయితొట్టి.

౨

శ్రీమతి నీలాపాలెం వేంకటసుబ్బమ్మగారు

శ్రీపతికృష్టమ్మ రేపల్లెలోను
పాపడై పెరిగనే బహువిధంబుగనూ
అంతకంతకుముద్దు ఆయశోదకును
వింతలుగజూపెనే వేడ్కనొకనాడు.
ఓయమ్మ! ఓతల్లి! ఓగోపిదేవి!
యెన్నినోములునోచికనెనె కృష్ణున్ని?
గోవింద! గొల్లపల్లెకు బోకుమయ్యా!
గోపికలునినువచ్చి కొట్టుదురుస్వామి!
ఓరుగుండానించి ఒకవీధినుంచి
అప్పుగాగొల్లాపె పండ్లమ్మవచ్చా
వాకిట్లోదించవే ఓపండ్లగంపా
మంచిపంచాదార పోసేముగాని
పారిపొయ్యేఅబ్బాయి పండ్లెత్తుకొచ్చా
తిట్టకవెముసిలాపె! దీవించవమ్మా!
కొట్టకవెగొల్లాపె! కొఁకుకూలతల్లీ!
మాబిడ్డదుష్టని వ్రూరంతతెలుసు
రుద్రాక్షపండైతె రూకలిచ్చేము
మావిడిపండైతె మాడలిచ్చేము
ముత్యాలబొట్టుకట్టి పట్టుచీరకట్టి
అటుకులువడిగట్టి ఆశీరమ్మందూ.
ఆడపోయినచోట మాడదొఁకింది
మాడక్కుచేయింతు మద్దికాయల్లు
మద్దికాయలుముద్దు మాటల్లుముద్దు
అందరికిఅబ్బాయి అల్లారుముద్దు.

3

శ్రీమతి పాకల శ్రీలక్ష్మీకామేశ్వరమ్మగారు

చిన్నమాఅమ్మాయి చీరకేశిస్తే
నెయ్యిరా సాలోడ! నేత్రానపట్టు.
నొష్టనుబెట్టెట్టి పట్టుచీరెకట్టి
అటుకులూఒడిబోసి అడబంపేము
ఆడబోయినచోట మాడదొరికింది
మాడకూమరిమాడ మద్దికాయల్లు.

చిన్నారిపొన్నారి గాజులాసెట్టీ
తేవెఅమ్మాయికీ తేనెగాజుల్లు
దిష్టితగులాకుండ ముష్టిబొద్దుల్లా
పరదిష్టితాకాక పాలపూసల్లూ
నరదిష్టితాకాక నల్లగాజుల్లూ.
చిలుకలూ చెలరేగి జోడికొమ్మెక్క
అమ్మాయి చెలరేగి మామభుజమెక్క.
మామభుజమెక్కితా నేమేమియడుగూ?
పాల్ద్రాగుగిన్నడుగు పాడావునడుగు.
కోవెలాపిల్లలను కాకితా దెచ్చి
కొట్టకాతిట్టకా గర్భానబెంచు
ఈకలొచ్చినదాక యిరువైనదాక
రెక్కలొచ్చినదాక పక్షైనదాక
పక్షిబోయివృక్షాన పండుతినుదాక
తనబిడ్డగాదాని తగుబానజేసు.
అమ్మాయిఆటల్లు తండ్రులకుముద్దు ✓
మాటల్లుఅశంగ మామలకుముద్దు
అందరికిఅమ్మాయి అల్లారుముద్దు. ✓
నీఘులానాడేడి నోబాలలారా!
మాబాలనెందైన కంటిరామీరు?
అమ్మ! మీబాలాకు ఆనవాలేమి?
జడజడారత్నాలు జడరావిరేక
పాపటాపన్నీరు నొష్టకస్తూరి
రాలేద మాబాల మిముగూడియాడ
ప్రొద్దుప్రొద్దొకచాయ ప్రొద్దొక్కచాయ
ప్రొద్దున్నఅమ్మాయి పొగడపూచాయ
మాపుమాపొకచాయ మాపొక్కచాయ.
మాపున్నఅమ్మాయి మల్లెపూచాయ
జాముజామొకచాయ జామొక్కచాయ
శ్రీరామచంద్రుండు సీతవల్లభుడు
ఇచ్చుమాఅమ్మాయి కిష్టసంపదలు. ✓

౪

(సంపాదకురాలు) శ్రీమతి టి. కృష్ణమ్మగారు

ఊరుపేలేవాడు ఉత్తముడైతె
పాలుపొంగీనట్లు పొంగుదురుప్రజలు.
ఉత్తముడిపేరేమి? ఊరుపేరేమి?
సత్యపురుషులకన్న తల్లిపేరేమి?
ఉత్తముడుదశరథుడు ఊరుఅయోధ్య
సత్యపురుషులకన్నతల్లి కౌసల్య.
ఒక్కొక్కముత్యమ్ము వనకూడినట్లు
ఒప్పేటికోమాళ్ల ఏతల్లికనెను?
లక్షవేలముత్యాలు రవచల్లినట్లు
రమణాలకన్నదే తానుకౌసల్య.
ఊరికిఉయ్యాల లమ్మవచ్చినవి.
కోమాళ్లకన్నతల్లి కొనవెఊయాల
కోమాళ్లకన్నతల్లి తానుకౌసల్య
కోటివేలుపోసి కొననెఊయాల
కోటకుర్చీమీద రాజుకూర్చొనీ
కొమ్మనిమ్మపండు కోరితెమ్మనెనూ
రత్నకంబళిమీద రాజుకూర్చొని
పారాడెపంజరపు చిలుకతెమ్మనెను
కోటకుర్చీమీద రాజు మీతాత
కొమ్మనిమ్మపండు తానుఅమ్మాయి.
రత్నకంబళిమీద రాజుమీమామ
పారాడెపంజరపు చిలుకఅబ్బాయి
ఎండాడపోయినది చిన్నఅమ్మాయి
ఏస్వామిఇచ్చెనే యెత్తిముద్దాడ.
పరమేశ్వరులరాణి పార్వతీదేవి
పార్వతిఇచ్చింది పాపఅమ్మాయిని

చీమంతపులిగోరు చుట్రావిరేక
చిన్నవాండ్లాడేరు రేపల్లెలోను
మాడంతబంగారు మద్దికాయల్లు
మహారాజమాతండ్రి మనుమలాడేరు.

*

(సంపాదకురాలు) శ్రీమతి యస్. వి. సరళాదేవిగారు

చుక్కలలోను చిన్ని బ్బాలుడున్నాడు
ఆబాలగోపాల బాలుడున్నాడు
పంచదారకుప్ప పాలపై తెప్ప
మాచిన్ని అబ్బాయి బంగారుకుప్ప.
చిచ్చోసిబచ్చల్లి చీమల్లమఱ్ఱి
మఱ్ఱిక్రిందబ్బాయి మాటల్లవెఱ్ఱి.
చిన్నారిపకువకు చిలుకపకువకు
నవరత్నంపకువకు నాచిన్ని అబ్బి.

రావెరావెచిలుక రత్నాలచిలుక
పల్లెలకునీవెళ్లి తెచ్చినాపండు
తోటలకునీవెళ్లి తెచ్చినాపండు
చిన్నిమాఅబ్బాయి చేతికందివ్వ.
రావేమె? చిలుకా! ఓరామచిలుకా!
వాడలకునీవెళ్లి పండ్లుతేవేమే?
వాడలకునీవెళ్లి తెచ్చినాపండ్లు
గ్రద్దవలెతన్నుకపోయెకృష్ణుండు.

# సంక్రాంతి తలపులు

పమ్మి రామశాస్త్రిగారు

ధవునిదరిఁజేరి కిసలయాధరయొకర్తు
నగవు ముఖపుష్కరంబున నాట్యమాడ
పలుకుపలుకున నాసక్తి చిలుకరింప
"వచ్చె నాకమ్మ ఈవేళ? వ్రాయలేద?
ఎపుడువచ్చును మానాన్న యిచటికనుచు
నడుగుమాటలె, వెనువెంట నడుగుచుండ,
నా మె ప్రశ్నలనన్నియు నాలకించి,
తలనుపంకించి, యూకొట్టి, దరహసించి,
మిన్నకుండిన తననాథు మేలములకు
నగుచు "పోనిండు, మీరలే నన్ను బిలచి
చెప్పుదురు కమ్మవచ్చినయప్పు"డనుచు
నల్లనల్లనసరిగె నాయమ్మ మిన్న.
ఇంతియొక్కతె, పుట్టింటి కేగుయువతిఁ
గనుచు నీరాటరేవున గండ్లనీరు
గ్రుక్కుకొని, "యంతభాగ్యంబుగూడ నేను
పెట్టిపుట్టితినే!" యంచు బిట్టునొగిలి
"ఆఁడుఁబుట్టువు పుట్టింటికాసపడుట—
కలదులోకంబునన్ గాని కలదెనాకు?"
అనుచుఁ దపనైవదనయత్త యాగ్రహించు
ననెడుభయమున వేవేగ నరుగుచుండె.
భామయొక్కతె సంక్రాంతిపండుగునకు
ధవునిబిలువంగనేగిన తండ్రియెపుడు
వచ్చునో? భర్తవచ్చునో రాడో? యనుచు
పలువిధంబులఁదలపోసి పచ్చబండ్ల
నెల్లఁజూచుచు లోలోన నుల్లసిల్లె.
ఒక్కబరణినిపసుపు, వేరొకకరాట
మందు కుంకుమయును బోసి యత్తలకు
బరణివేరొండుసమకూర్చి ప్రాంగణమున
గొబ్బెళులబెట్టి నొకబాల యుబ్బుచుండె.
అట్లు కొందరు సంతోష మందుచుండ,
కొందరెంతయుమనముల గుందుచుండ
సంతసమునందువారల సంతసంబు,
వగనుబొగిలెడువారల వగయు హెచ్చ,
కడురయంబునవచ్చె సంక్రాంతియంత.

## పదునెనిమిదవ పుష్పము: సత్ప్రవర్తనాఫలితము

తోటలోని భవనము జమీందారువారి రాకకు పూర్వమే మనోహరముగ అలంకరింపబడినది. జమీందారును, ఆయనను చూడవచ్చిన అతిథులును హాలునందు కూర్చొనియుండిరి. లింగరాజు కాంతమ్మనుగూర్చి చెప్పినసమాచారము నందరును శ్రద్ధమెయి నాలకించిరి. కాంతమ్మ పడినకష్టములను భావోద్రేకమున లింగరాజు చెప్పునపు డచ్చటివారి హృదయములు విషాదతరంగితములైపోయెను. ఆమె పితృభక్తిని, ధైర్యమును గూర్చి అతడెన్నో విధముల శ్లాఘించెను. ఈసమయమున కాంతమ్మ చెయ్యిపట్టుకుని అమ్మాజీ లోపల ప్రవేశించినది. ఆమె రెండవచేతిలో పూలసజ్జయుండెను. హాలులోనున్న వారందరును ఆమెను పలుకరించెడివారే. ఆమె నిర్దోషిత్వము ప్రకటితమై మరల యథాప్రకారము సగౌరవముగ జమీందారుల గృహప్రవేశ మొనర్చినందుకు వారు హర్షాశ్రువులు రాల్చిరి.

జమీందారు దయార్ద్రహృదయముతో కాంతం చెయ్యిపట్టుకుని "అమ్మాయీ! ఎంత నీరసించిపోయావు? నీముఖం ఎంత వివర్ణమైపోయింది? దీని కంతటికీ కారణం మాదూరదృష్టిలేని ప్రవర్తనయేకదా! మళ్ళీ నీకు పూర్తిసౌఖ్యం సమకూర్చేవరకూ నాకు నిద్రపట్టదు. ఏయింటినుండి మిమ్మల్ని తగిలేశామో ఆఇంటిని యింతటినుండీ నీస్వంతఆస్తికింద యిచ్చేస్తున్నాం. జీవనమున్నంతవరకూ మీతండ్రిని అనుభవించమన్నాం కాని యిప్పుడు శాశ్వతంగానే నీఅధీనం చేసేశాం. దానికి తగిన దస్తావేజులూ వగైరా వ్రాతమూలములన్నీ చూడవలసిందని ఈవేళే మాదివాన్‌కి కబురంపుతాం. నిన్ను తనప్రాణసమానురాలినిగాచూసుకుంటూవున్న అమ్మాజీ నీకాయింటిని బహుమానంగా ఇచ్చినట్లుగా వ్రాయించేస్తాం" అన్నాడు.

జమీందారుని ఉదారహృదయమునకు సభికులు సంతోషించి శ్లాఘించిరి. లోపలికి వెళ్ళినతరువాత జమీందారిణి అశ్రుగళితనయనములతో ఆమెను కౌగలించుకొని "కాంతం! మాఅమ్మాజీకిని నీకును ఏమీ భేదం లేకుండా ఇంతటినుంచీ పెంచుకుంటాం. నువ్వు నాకు మూర్తిపై కోటలో హాయిగావుండమ్మా!" అని చెప్పుచు తనచేతనున్న ఉంగరమునుతీసి కాంతంవ్రేలికి తొడుగుచు ఆమె మరలనిట్లనెను: "కాంతం! ఇదుగో! నీకష్టాల కన్నిటికీ కారణమైన యీఉంగరాన్ని తీసుకో. ఇది చాల విలువకలదే. అయినా నీనిష్కళంక ప్రవర్తన దీనికంటె కోటిరెట్లు అధికమైనవిలువకలదని నేను చెప్పగలను. నీవు మామూలాన్ని అనుభవించిన కష్టాలకు నిష్కృతిగా ఈస్వల్పవస్తువును యిస్తున్నాను. దీన్ని నువ్వు అంగీకరించకతప్పదు. నాకు నీయెడల గల ప్రేమకి నిదర్శనంగా దీన్ని దగ్గిరవుంచుకో."

అత్యనురాగమున కన్నతల్లివలె తన్ను కౌగిలించుకొని జమీందారిణి చెప్పినమాటలను వినుసరికి కాంతమ్మకు సంతోషబాష్పములు ప్రవహించినవి. తనయందు జమీందారిణిచూపిన దయారసమునుగ్రోలి యామె తన్మయురాలైపోయినది.

జమీందారుల కోరికపైని లింగరాజారాత్రి కక్కడేయుండిపోయెను. "ధర్మపరావతారులగు ప్రభువులను సర్వేశ్వరుడు రక్షించుగాక! దిక్కుమాలినపక్షియగు కాంతానికి తలిదండ్రులై నిల్చిన శ్రీవారికీర్తి ఆచంద్రార్కమూ నిల్చుగాక! శ్రీవారామెకుచేసిన మహోపకారములనన్నిటినీ భగవంతుడు కోటిగుణితంగా వారికుమార్తెకు ప్రసాదించుగాక!" అని ఉద్రేకపూరితుడగు లింగరాజు జమీందారుల ధర్మబుద్ధిని కొనియాడెను.

## పంథొమ్మిదవ పుష్పము: లక్ష్మీవిలాసమునందు

కాంతమ్మను అమ్మాజీ ప్రయాణమునకు సిద్ధముచేసినది. తనదుస్తులలో నొకదానిని తీసి ఆమెకిచ్చి "అమురికిగుడ్డలు వొదిలెయ్యి కాంతం! ఈచీరకట్టుకో. ఇంతటినుంచీ నువ్వు మా స్నేహితురాలువుకాని నౌఖరువు కావు. ఎంత అందంగావున్నావు యీచీరకట్టుకుంటే!" అని యనుచు నామె కాంతమ్మను ముస్తాబు చేసినది. మొదట కొంత అసమ్మతి కలిగినను అమ్మాజీకి వ్యతిరేకము చెప్పలేక కాంతం ఆమెయిచ్చిన విలువ దుస్తులనే ధరించినది. ఈమార్పువల్ల నామెలో కలిగిన నూతనసౌందర్యమునుచూసి అచ్చటివారందరును ముచ్చటపడిరి. జమీందారువారినాలుగుగుర్రములబండి ఇంతలో గుమ్మముముందు నిలిచినది. జమీందారును భార్యయును ఒకవైపును, కాంతమ్మయును అమ్మాజీయు వేరొకవైపును కూర్చొనిరి. ఉచితవేషములధరించి ముగ్గురునౌఖర్లు వెనుకనుముందును నిలుచుండిరి. "ఇప్పుడు కోటకి ప్రయాణంలేదు. లక్ష్మీవిలాసానికి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాను. జగ్గయ్యని ఆదరించిన ఆసజ్జనులనుచూడాలనివుంది" అని జమీందారు భార్యతో అన్నాడు. బండికదిలినది. దారిలో జమీందారు రామన్న స్థితిగతులనుగురించి కాంతమ్మను అనేకప్రశ్నలు వేసి భోగట్టా తెలుసుకున్నాడు. వారి సత్ప్రవర్తనమును, ఔదార్యమును అతడు మెచ్చుకున్నాడు. వారి ప్రస్తుతస్థితినిగూడ కాంతమ్మ దాచకుండ చెప్పివేసినది. వృద్ధులైపోయి అవసానదశలో వారనుభవించుచున్న దీనావస్థనుగురించి జాలికలుగునట్లు వర్ణించినది.

డవాలానౌఖరులును, నాలుగుగుర్రములబండియును గుమ్మముముందు నిలుచుసరికి లక్ష్మీవిలాసమునందు ప్రమాదమైన అడావిడి బయలుదేరినది. ఆయిల్లుకట్టినదిమొదలెన్నడుకాని అంతగొప్పశకటమచ్చటికి వచ్చియుండలేదు. బండిఆగుటతోడనే రంగమ్మ ఆతురతతోవచ్చి "ఎవరో జమీందార్లువచ్చేరు, ఎదురుకోవాలి" అనుకొనుచు బండికెదురుగాపరుగెత్తినది. జమీందారుకుమార్తెలకు చేయూతనిచ్చుటకామె హస్తమును చాచినది. కాని అంతలోనే కాంతాన్ని హఠాత్తుగా పోల్చుకుని చటాలున చేతినివెనుకకులాగుకొన్నది. నిరుపేదరాలై తనసేవచేయుచున్న కాంతం మహదైశ్వర్యసంపన్నులతో సమానముగ గుర్రపుబండిలో కనబడుటతోడనే యామెకు మతిపోయినది. తోట మారుమూలని కూచుని పాదులుకట్టుచుండెను రామన్న. రంగమ్మతో మాటాడకుండనే వచ్చినఅతిథులునలుగురును రామన్నను సమీపించిరి. జమీందారతని చెయ్యిపట్టుకొని లేవదీసి నిస్సహాయస్థితియందు జగ్గయ్యకాతడొనర్చిన మహోపకారములకు తన కృతజ్ఞతను వెల్లడించినాడు. ఉదారస్వభావుడగు రామన్న గ్రుడ్లనీళ్ళుగ్రుక్కుకొనుచు "మహాప్రభో! నేనేం ఉపకారంచేశాను? ఏంచేస్తే నేను జగ్గయ్యరుణం తీర్చుకోగలను? నాశరీరం చెప్పులుకుట్టియిచ్చినా అతనిరుణంతీర్చుకోలేను. అతను ప్రవేశించగానే మాయిల్లు నిత్యకళ్యాణమూ పచ్చతోరణమూ అయిపోయినది. అతని సలహాప్రకారం నడుచుకుని వుంటే నాకీపాట్లు రాకపోయివుండును, బాబూ! నాసంతోషమంతా అతనితోనేపోయింది, నాయనా! ఈపాడుకట్టె యింకాయిల్లావుంది" అని విలపించినాడు.

తోటలో నీసంభాషణ జరుగుచున్నప్పుడే కాంతమ్మ లోపలికిపోయి ముత్యాలును తీసుకొనివచ్చినది. వచ్చినవారినందరినిచూచి యామె గాభరాపడినది. జమీందారును కుటుంబమును ఒక్కసారిగ తనకు కృతజ్ఞతను వెల్లడించుటచూచి ఆమె కంగారుపడినది. ఒకపావుగంటకుగాని యామెకు మనస్సు కుదుటబడలేదు. సంతోషాతిరేకమున ఆవృద్ధులు పసిపిల్లలలాగు విలపించిరి. చివరకు రామన్న కాంతమ్మనుచూచి "అమ్మా! నీపితృభక్తికి దైవం సంతోషిస్తాడని నేనుచెప్పినమాటలు రుజువైనవి. చూశావా?" అన్నాడు.

వారికి కొంచెముదూరములోనిలబడి అసూయాపూరితదృష్టులను బరపుచు రంగమ్మ కాంతమ్మనుచూచి తనలో "ఆహా! ఎంతచిత్రం! నిన్నటివరకూ ముష్టిదానిలాగు నాయింట్లోచేరిన ఈనిర్భాగ్యురాలి కెంత దశ

పట్టింది? ఇంతలోనే ఇన్ని వింతలుపుడతాయని ఎవరెరుగుదురు? ఇప్పుడు దీని కెంతసౌందర్యంవొచ్చింది!" అని గొణుగుకున్నది. ఈమాటలు జమీందారు వినలేదు. కాని ఆమెఅమాయపూరితదృష్టులును, కోపఘూర్ణితమైన ముఖమును ఆయన కనహ్యముకలిగించినవి. "పరమదుర్మార్గురాలిలాగేవుందియిది" అని కొంతసేపు బాగాఆలోచించి రామన్నను చూచి "ఏమోయ్! నేనొకమాట చెబుతాను విను. జగ్గయ్య కిదివరలోయిచ్చిన యిల్లు ఇప్పుడు శాశ్వతంగా కాంతానిదై పోయినది. నువ్వుకూడా అక్కడికొచ్చి ఆయింట్లో వుండకూడదూ? నీ కక్కడ మనశ్శాంతికుదురుతుందని నాఅభిప్రాయం. దానిచుట్టూ తోటకూడావుంది. కనక ఏమొక్కలో పాతుకుని నీఅవసానదశను ప్రశాంతంగా గడపడానికి నీకభ్యంతరంవుండదు" అని జమీందారు నెమ్మదిగా బోధించినాడు.

కాంతమ్మయును అమ్మాజీ మొదలగువారందరును జమీందారుచెప్పినట్లు ఒప్పుకోనవలెనని రామన్నను బలవంతపెట్టిరి. కాని చెఱసాలలోనున్నట్లు దుఃఖించుచున్న రామన్నను బలవంతపరచవలసిన పనిఏమున్నది? కోడలుపెట్టు బాధలను సహించలేక 'ఎప్పుడు లక్ష్మీవిలాసమును వదిలిపోవుదునా' యని చూచుచున్నాడతడు. అందుచేత రామన్న తక్షణమే ధర్మవరముపోవుట కంగీకరించినాడు.

ఇంతలో పొలముపనిచూచుకొని గంగన్న అచ్చటికివచ్చెను. నాలుగుగుర్రములబండిమీద తనయింటికి వచ్చినయతిథు లెవరైయుందురాయని యతనిమనస్సు ఆత్రతనందుచుండెను. జరిగినసంగతి పూర్తిగా తెలుసుకున్నతరవాత అతడు చాల సంతోషించినాడు. కాని వృద్ధులగు తలిదండ్రులను విడిచిపెట్టుట అతనికి కష్టముగానే కనబడినది. తనభార్యమూలమున వారికిన్నికష్టములుకలిగినవికదాయను దుఃఖమతనిని క్షోభింపజేయుచుండెను. అయినను ఎక్కడనో ఒకచోట వారిజీవనములు సుఖించునుకదా అనుకుని చివరకు సమాధానపడినాడు.

తనమీదనుంచి గొప్పభారము తగ్గినట్లుగా రంగమ్మ సంతోషించినది. కాని లేనివిచారం కొంతతెచ్చుకుని "ప్రభువులు ధర్మస్వరూపులు. తమరంతదయార్ద్రహృదయంతో పోషిస్తామన్నప్పుడు ఒప్పుకోకపోవడం మాకు గౌరవంగావుండదు. ప్రభువులపోషణ దొరికినందుకు వాళ్ళు మహాఅదృష్టవంతులు" అన్నది. గంగన్న కూడ తనకృతజ్ఞతను వెల్లడించినాడు. అతడు భార్యనుచూచి "పెద్దవాళ్లను దయతోచూడక వున్నంతకాలం వారిని వేపుకుతినేశావు. ఇప్పుడు నీబాధ వొదిలిపోయి సుఖపడతారులే" అన్నాడు.

భర్త మాటలకు రంగమ్మశరీరము మండుకుపోయినది. కాని జమీందారులముందు ఏమనినను బాగుండదని యామె కోపమునణచుకొనెను. "ధర్మవరం వెళ్లినమీదట తగినయేర్పాటులుచేసి కబురుపంపిస్తాం" అని జమీందారు రామన్నతో చెప్పినపిమ్మట వచ్చినవారందరును మరల బండిమీద వెళ్లిపోయిరి. —కొదువ.

## కమలకాంత

శ్రీమతి వంతరాం సుశీలాదేవిగారు

అవనియందున నీనాట్యమందు తప్పు
దారినిఁద్రొక్కనీకుండ ధవుని యెల్ల
కాలములనుఁగాచునవతె, కరమునందు
హాసచంద్రికమాలల నాథునమయించు
నవతె, నవనీతమాధుర్యనిర్మలాంబు
దములకునిధియౌ హృదయంబుదానమీయు
నవతె, దీనమై రక్షణనీయునవతె,
మృదుభయముల ఛేదించి హాయిదరిఁజేర్చు
నవతె, నాథుకై ప్రాణమునీయునవతె,
యీమెకా గృహారవింద, కమలకాంత.

# మేరీ

కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు

సాయంకాలంఅయింది. మబ్బు దట్టంగాపట్టింది. వర్షంవొచ్చేలాఉంది. దూడలు "డీ"నది అవతలవైపున బయలులోమేస్తూన్నాయి. "డీ" **(Dee)** నదిచిన్నది. ఎప్పుడూ నీళ్లుండవు. ప్రవాహం **(Tide)** వొచ్చినప్పుడుమాత్రం ఉంటాయి. ఉత్తప్పుడు బంగారులా మెరుస్తూన్న ఇసుకమాత్రంఉంటుంది. చూచేందుకు ఎంతోబాగుంటుంది. ప్రవాహంవొచ్చే వేళఅయింది. దూడలు కొట్టుకుపోతాయని తొందరతో మేరీతల్లి గబగబా గట్టుమీదికివచ్చి మేరీకోసం ఇటూఅటూచూచింది. మేరీ పిల్లలతో గట్టుమీదఆడుకుంటోంది. మేరీ ఇల్లు డీనదికి ఇవతలగట్టునఉంది. తల్లినిచూచి మేరీ ఆటమానేసి తల్లిదగ్గరకువొచ్చి నిలుచుంది. తల్లి మేరీనిచూచి "మేరీ! చప్పునవెళ్లి దూడలనితోలుకురావూ? గాలిఎల్లావీస్తోందో! వర్షం వొస్తుందేమోనే!" అంది. "ప్రవాహంవస్తుందేమోనే అమ్మా! భయంవేస్తోందే"అందిమేరీ. మేరీఎంతోమంచిపిల్ల. ఎప్పుడూ తల్లిమాట అతిక్రమించిఎరుగదు. అనలేకఅనలేక ఈమాట అంది. తల్లికికూడా జాలివేసింది. కండ్లనుండి అశ్రువులుజారిపడ్డాయి. ఏంచేస్తుంది? పని తొందరలోఉంది. భయంవేసినా చెప్పకతీరిందికాదు. "మేరీ! ఏంభయంలేదు. తొందరగా వెళ్లి తోలుకురా! మీకు బువ్వవొండిపెట్టవద్దుమరీ అంది తల్లి. మేరీ మారుమాట్లాడలేదు. చకచకాబయలుదేరింది. నదిలోకి దిగింది. గాలి ఎక్కువగావీవనారంభించింది. మంచుకురుస్తోంది. మేరీ బంగారులా తళతళలాడేఇసుకకేసి వెర్రిగాచూస్తూబయలుదేరింది. మధ్యకివెళ్లేసరికి ప్రవాహంవొచ్చేసింది. నీరుమోకాలులోతునుంది. వర్షం హోరునకురుస్తోంది. చుట్టూ మంచుకప్పేసింది. దారితెలియడంలేదు. గాలిహోరు ప్రవాహంహోరు వినేసరికి మేరీకి భయం వేసింది. దూడలినిపిలుస్తూ ముందుకుఅడుగువేసింది. చూస్తూంటే ప్రవాహం పెద్దదైపోయింది. మేరీ అవతలగట్టుకివెళ్లిపోతుందని కంగారుకొద్దీ పెద్దకెరటాలువొచ్చేశాయి. మేరీ మంచిగుణాలకిమెచ్చుకొని కెరటాలతో గట్టిగా కౌగలించుకొని ఈపాపలోకంతోనీకు సంబంధముతీరిపోయింది, ఏనుదగ్గరకు దారిచూపిస్తారా! అని కూడాతీసుకొనిపోయింది ప్రవాహం. కొంతదూరాన్ని పల్లెవాళ్లుచేపలకోసం గడలుపాతి వలలుపన్ని వెళ్లిపోయారు రాత్రి చేపలు పడతాయని. మేరీ! యీపాపుశరీరమేనా మీవాళ్లకిఉండనీయమని మేరీ శరీరాన్ని కర్రల్లో వొదిలేసి మేరీని ముందుకుతీసుకొనిపోయింది ప్రవాహం. ఉదయాన్నే జాలర్లు వొచ్చేరు. ఓప్రక్కనివలలో మేరీజుట్టు సూర్యకిరణాల్లో ప్రకాశిస్తోంది. వాళ్లు ఏదోపెద్దచేపఅని ఆశపడి దగ్గరకువొచ్చిచూచారు. మేరీజుట్టుఅది. మేరీని పడవమీద ఎక్కించుకుని దూడలు మేసే చోటున సమాధిలోపూడ్చేశారు. వాళ్లకి ఆసమాధిదగ్గర ఎప్పుడూ మేరీ దూడలనుపిలుస్తూన్నట్టు వినిపించేది. ఇప్పటికీ ఆసమాధిదగ్గర మేరీ దూడలని పిలుస్తూన్నట్టు వినిపిస్తూఉంటుందట. పాపం! మేరీ ఎంతమంచిపిల్లో!

*—Charles Kingsley's "The Sands of the Dee."*




## ఉర్లగడ్డలసోమాసి

శ్రీమతి నాయిని హనుమాయమ్మగారు

గోధుమపిండి అప్పడములుపాగువట్లుగా తడిపిఉంచుకొనవలయును. ఉర్లగడ్డలు (బంగాళాదుంప) బాగా పొట్టుగీరివేసి ముక్కలుగాతరిగి దొరుకుచోనైనచో పచ్చిబటానీ, ఎఱ్ఱముల్లంగిముక్కలుచేర్చి తగు మాత్రపుఉప్పు, కొద్దిగకారముచేర్చి ఉడుకబెట్టవలయును. ఉడికినతర్వాత ఉర్లగడ్డలనుమాత్రము చేతితో పొడి అవునట్లుపిసికి, బాణలిలోనెయ్యిపోసి (ఇష్టమైనవారు నూనెకూడచేర్చవచ్చును) ఉల్లిగడ్డలు, కొద్దిగ పచ్చిమిఱప, అల్లము ముక్కలుగతరిగి పైచమురులో వాడ్చవలయును. ఎఱుపుడాలునచ్చువఱకూ వాడ్చి ఉర్లగడ్డల కూర దానిలోవేసి వేయించి గోధుమపిండిఅప్పడములుచేసి అందుఈపూర్ణముఉంచిచుట్టి నేతిలోవేయించునది.

## అక్కాళా అరిస

శ్రీమతి పాకలరత్నమాలగారు

బియ్యము ¼ శేరు; పెసరపప్పు ¼ శేరు; శనగపప్పు ¼ శేరు గ్రహించి శుభ్రముగకడిగి పొయ్యి మీద పెట్టవలెను. అది జావగానుండునట్లుగ ఉడికినపిదప జీడిపప్పు, ద్రాక్షపండ్లు, ఎండుకొబ్బరిముక్కలు (సన్నగాతరిగినవి) ఇవి నేతిలోవేయించి పైనచెప్పిన జావయందువేయవలెను. వేరొకపొయ్యిపైన 1½ వీశె బెల్లమును లేతపాకముగాకాచి ఆజావలోపోయవలెను. దానితో కొంత ఉడికినపిమ్మట ½ శేరు పాలనుపోసి పాలతోకూడ ఉడికినపిదప 5 పలముల నేయినిపోసి యాలకులు పొడిచేసి వేసి దించవలెను. ఇదికొద్దిగా పలుచగానుండును. కాన అరటియాకుల దొన్నెలలోగాని లేక గిన్నెలలోగాని పోసుకుని భుజించవలెను. ఇది చాలరుచ్యముగానుండును. దీనినే "అక్కాళా అరిస" అందురు. దీనిని దక్షిణదేశస్థులు ఎక్కువగచేయు చుందురు. సంక్రాంతిపండుగ నెలదినములును దేవునికి నైవేద్యముపెట్టెదరు. ఆనెలదినములలో 16-వ దినమును "నాయికానాయక"అనియు 27-వదినమును"కూడారవల్లి"అనియుఅందురు. పూర్వము అండాళ్లు శ్రీకృష్ణునే పతిగా పడయవలెనని ఈనెలదినములును నోమునోచెనట. అందు 16 దినములవరకును దినమున కొక్కొక్క గోపికను లేపుకొనుచు 16-వ దినమున గోపికలతోకూడ అండాళ్లు స్వామి ఆలయమున ప్రవేశించెనట. అందు వలన నాదినము "నాయికానాయక" అనుపేర ఎక్కువైనదినమనియు, 27-వదినమున శ్రీకృష్ణునకు అండాళ్లు నిచ్చి పరిణయమొనర్ప బంధువులందరును నిశ్చయించి కూడుకొనినందుచే నాదినము "కూడారవల్లి"యనియు ప్రతిదినమును ఒక్కపొంగలిమాత్రమేచేసి దేవునకు నైవేద్యముపెట్టుచూ ఈరెండుదినములును నాలుగుపొంగ లులనుచేసి నైవేద్యమొనరింతురు. భోగిపండుగనాడు అండాళ్లుకళ్యాణమైనది. ఈనోము దక్షిణదేశమందు హెచ్చు. "కూడారవల్లి"నాడు అండాళ్లు అక్కాళాఅరిసచేసి బంధువులకు పెట్టెనట.

# పొలి పాట

(సంపాదకుడు) దేవగుప్తాపు వేంకటరమణము శ్రీపంతులుగారు

పొలి, పొలో, పొలో అను పల్లవి ప్రతిచరణముకుదిని పాడుచుండవలెను.

ఎయ్యేలుకెయ్యేలూ మాటనూరేళ్లూ
సరస్వతీ! నినుదలవా సాగవ్వాపనులూ
గణపతీ! నినుదలవా గ్గడవవ్వాపనులూ
వ్వూళ్లోవినాయకా ఉండ్రాళ్లభోగీ!
పొలములోవినాయకా! పొగునాళ్లభోగీ
గట్టుమీదవినాయకా గంధాలభోగీ!
నాయకానాయకా స్వామివిఘ్నేశా
దొప్పచెవులావాడా దోనికడుపోడా
ముందరాజూచితే ముంగిరూపంబూ
వెనుకనుజూచితే ఏనుగారూపూ
నొసటకిరీటమూగలవాడుస్వామీ
వీపునా వింజామరగలవాడుస్వామీ
బొడ్డునావొన్నయ్యాపువ్వుగలస్వామీ
వళ్లవనసావేదీగలవాడుస్వామీ
అరికాలుపద్మామూగలవాడుస్వామీ
ఇన్నిగలగణపతికీ పూజేమిపూజా
క్రావునేతులూ కరకుబెల్లాలూ
ఖండించినచెరకులూ గానుగచిమ్మిలీ
చిప్పతోగంధములూ చిరుశనగపప్పూ
దొప్పతోగంధములూ దోరావునెయ్యి
అల్లాలుబెల్లాలూ అమృతపాణీలూ
టెంకాయగొబ్బరలూ తేనరటిపళ్లూ
అవియుమాగణపతికీ ఆరగింపులుగా.
మాచేనుమారుదలా రావులేగలవ్వూ
రావిమీద మాశీతమ్మా రాగాలుదీశే
మాచేనుమారుదలా జవ్వులేగలవ్వూ

జవ్విమీద మాశీతమ్మా జూదమాడిందీ
పొలిగలశీతవైతే మాపోతుమీదకిరమ్మా
భక్తిగలశీతవైతే మాబరిమీదకిరమ్మా.
వూరువెలుపలరె మాములగచెళ్లగలవ్వూ
దానిఆకులే వెళ్లేయీ అంతరిక్షముదాకా
దానికొమ్మలే వెళ్లేయీకోటిపల్లీదాకా
దానివేళ్లువెళ్లీనాయీ జలనిధులుదాకా.
గున్నచింతలుక్రింద చిరుకోలుములెట్టీ
వూరూరికమ్మరులా వూరూరబిలిచీ
తనవూరికమ్మర్ని తనపేరబిలిచీ
నిమ్మపండోర్నార్ని నిప్పొక్కటేశీ
కొలిచికుంచెడుధనమూ కొలుములేయించీ
పూడేటితిత్తులూ వురమడముబోలి
వేశేటిసమ్మెటలూ రణభేరిమ్రోతా.
బంతిమాలిబంతిమాలిఉయ్యాలో
మనదోరెడ్లబంతిమీదుయ్యాలో
బంతిమాలిబంతిమాలిఉయ్యాలో
మనక్రెడ్లబంతిమీదుయ్యాలో
బంతిమాలిబంతిమాలిఉయ్యాలో
మనయల్లెడ్లబంతిమీదుయ్యాలో
బంతిమాలిబంతిమాలిఉయ్యాలో
మనపుల్లెడ్లబంతిమీదుయ్యాలో
బంతిమాలిబంతిమాలిఉయ్యాలో
మనమైలెడ్లబంతిమీదుయ్యాలో
బంతిమాలిబంతిమాలిఉయ్యాలో
మనబట్టెడ్లబంతిమీదుయ్యాలో

బంతీమాలిబంతీమాలిఉయ్యాలో
మనరాచెడ్లబంతిమీదుయ్యాలో
బంతిమాలిబంతిమాలిఉయ్యాలో
మనచిప్పెడ్లబంతిమీదుయ్యాలో
బంతిమాలిబంతిమాలిఉయ్యాలో
మనచుక్కెడ్లబంతిమీదుయ్యాలో
బంతిమాలిబంతిమాలిఉయ్యాలో
మనలక్కెడ్లబంతిమీదుయ్యాలో
బంతిమాలిబంతిమాలిఉయ్యాలో
మనబోడెడ్లబంతిమీదుయ్యాలో
బంతిమాలిబంతిమాలిఉయ్యాలో
మనపైడెడ్లబంతిమీదుయ్యాలో.
ఎవరునేయించేరు ఉయ్యాలో
మననాయుడేయించేనుఉయ్యాలో
ఎవరుఊగీనారుఉయ్యాలో
మనకరణమూగీనారుఉయ్యాలో
ఎవరుఊపీనారు ఉయ్యాలో
మనరైతులూపీనారు ఉయ్యాలో
ఇటునుంచిఊపితే ఉయ్యాలో
వింజామరలమోత ఉయ్యాలో
అటునుంచిఊపితే ఉయ్యాలో
తుమ్మెదలామోత ఉయ్యాలో
ఉయ్యాలఉయ్యాల ఉయ్యాలో
బంతిమాలిబంతిమాలిఉయ్యాలో.

## ౨

(సంపాదకుడు) తూచిభొట్ల ప్రభాకరశాస్త్రి గారు

ఒలియ ఒలియో ఒలియ
రావేలుగలవాడ! రారపొలిగోడ!
పొలిగోణ్ణిగొట్టంగ పోగాయెరాశి
రావేలుపోవేలు రాశిపదివేలు
వెయ్యేలుగలవాడో! రారపొలిగోడ!
పెనుమాకగట్లల్లె పెరిగెమనరాశి
తాడికొండగట్లల్లె తరిగెమనరాశి.
బెజవాడకనకదుర్గాంబ! నీపెళ్లినాకు
చిన్నిచెంబుతోనీళ్లు సీకాయసీరు.
మంగళగిరినరశింహ్వా! నీపెళ్లినాకు
చిన్నిచెంబుతోనీళ్లు సీకాయయుదకంబు.
మాసేనుముందోట రెండుమారేళ్లుగలవు
మారేడుఘనపత్రి మనగణపతికిపూజ
మాసేనుముందోట రెండువెలగల్లుగలవు
మాసేనుముందోట రెండుజమ్ముల్లుగలవు
జమ్మాలపత్రీ యెంచక్కాగపూజ
యేసుకొండలవాణ్ణి యెంతోనుభక్తి
కొలువరోతమ్ముడా! కోర్కెలీయంగ.
రాశిపై విఘ్నేశు రారతీయుదము
విఘ్నేశుడే మన కింకవెయ్యేలు
రోరన్నరోగాలు పారంగద్రోలి
సౌఖ్యాలనిచ్చేటి చల్లానిసామి
దండాముబెట్టరా దండివిఘ్నేశు
కొట్టరోపిడికట్ట కొట్టరోరన్న
ముత్తాలుసెల్లించి ముమ్మేలుతండ్రి
దండాలుబొజ్జయ్య దండాలుదేవ
రాశిపై నుండియు రావయ్యనీవు
రావయ్యవిఘ్నేశ! రావయ్యసామి!
ముడుపూలుసెల్లించి మొక్కేముమేము
రాశిపై నుండియు రావయ్యనీవు.

# శ్రీ పీఠికాపురమహారాజరజతోత్సవము

దాసరి లక్ష్మణస్వామి గారు

శ్రీసుస్థిరసామ్రాజ్యర
మాసంభావితరజతసుమంగళమూర్తీ!
భూసంక్రందనపీఠప
మాసీవా! సూర్యరాణ్మహారాజమణీ!

బ్రహ్మర్షియై సదా పావనమూర్తియై
త్యాగియై విలసిల్లు నీగురుండు
చతురుఁడై ప్రభుకార్యరతుఁడునై సద్గుణ
సహితుఁడై తనరు నీసచివవరుఁడు
ప్రభ్వీమతల్లియై పావనశీలయై
ప్రోదిమీఱుచునుండు నీదుసాధ్వి
విద్యానవద్యులై విమలచారిత్రులై
యలరుచున్నారు నీయాత్మభవులు
దేశసేవ ప్రజాసేవ దీవరతఁ
ణమ్ము నాంధ్రభాషాపోషణమ్ము సతము
నభిలషించును నీచిత్త మధిపవర్య!
కలరె నినుబోలు ధన్యులీక్ష్మాతలమున?
రాజాధిరాజసంపూజితుఁడీవన
పి.బి.యి. సద్బిరుదంబె ప్రబలసాక్షి
లోకమిత్రుండని వాకొన భవదీయ
దివ్యాభిధానప్రదీప్తిసాక్షి
అప్రతీకాశధర్మాచరణాసక్తుఁ
డన దీనశరణాలయమ్మె సాక్షి

అభినవభోజుఁడం చభినుతి సేయంగ
నాంధ్రనిఘంటువే యధికసాక్షి
భక్తజనశిరోమణివని ప్రజనుతింప
రమణమీఱు ప్రార్థనమందిరమ్మె సాక్షి
ప్రజలబిడ్డలరీతిఁ గాపాడితివన
నిమ్మెయినొనర్చు రజతోత్సవమ్మె సాక్షి.
ప్రభువతంసమ! నీవు పఠనంబొనర్పని
సద్గ్రంథములు ధరాస్థలిని లేవు
నరనాథతిలక! నీవరుగని చిత్రవి
చిత్రదేశంబు లీక్షితిని లేవు
ధారుణీశ్వర! నీవు దవిలి కావింపని
దానధర్మంబు లీధరణి లేవు
పృథ్వీశచంద్ర! నీ వెఱుఁగజాలని పర
మార్థతత్త్వంబు లీయవని లేవు
ఆపదలు లేవు మతకలహములు లేవు
వెతలు లేవు దురాచారరతులు లేవు
లేవు సిలుగులు లేములు లేవు లేవు
ఈవుపాలించు నిరువదైదేండ్లలోన.

నీదురజతోత్సవము పేర్మి నెగడెనిట్లు
స్వర్ణరత్నోత్సవంబులుఁ బ్రతిభమీఱఁ
గని సుఖంబుగ నూఱేండ్లు మనఁగదయ్యా!
రావుకులదీప! శ్రీసూర్యరాయభూప!

# బాలవిజ్ఞానశాఖ

౧. పాటలు

## హాస్యపు పాట

కొండమీదమామామ ఇల్లుకట్టేను
కోరికొడుకులను కంది మాఅత్త
కొడుకులుకొండమీద కోతుల్ని పోలు

## చిలకమ్మ

చిలకమ్మమొగుడెంతో శింగారమయి
చెలికత్తెలందరు చెంతకూర్చుండ్రి
శీతాకోకలు చీరెలుతెచ్చెను
సాలెపురుగులు చాపులుతెచ్చెను
వాకటిపిచ్చుకలు బాకాలూదెను

## చిలుకపాట

ఎఱ్ఱన్నిముక్కుల్ల పచ్చన్నిచిలుక!
మాఅన్నవస్తార? ఎరుక చెప్పావే
నీఎరుకచెప్తేను నాకేమికద్దు?
పచ్చన్నిరెక్కలకు భమిడియతికింతు
ఎఱ్ఱన్నిముక్కులకు వెండినతికింతు
సూర్యహారాలన్ని మెడనిండవేతు
చంద్రహారాలన్ని చేతికందిత్తు
నీలాలకమ్మలు నీచెవులపెడుతు

## దాగుడుమూతలు

దాగుడుమూత లాడుదమ
తలుపులమూలల దాగుదమ

శ్రీమతి ధవళ రాజేశ్వరమ్మ గారు

కూతుళ్లుగుడివాడ కుక్కల్నిపోలు
అల్లుళ్లు నెల్లూరిరాజుల్నిపోలు
కోడళ్లు గోల్కొండచిలకల్నిపోలు.

శ్రీమతి దరిశి సుబ్బలక్ష్మమ్మ గారు

నెమిలిసానులు నాట్యముచేసెను
కాకులుమూకలు కేకలువేసెను
పందిటిపిచ్చుకలు సందడిచేసెను
చిలుకమ్మమొగుడెంతో చిరునవ్వునవ్వె.

భమిడీపల్లి రామలింగేశ్వరరావు గారు

నీవుపోవుత్రోవలో సెనగవేయింతు
సెనగతినిచెయికడుగ చెలమలవ్వింతు
నీళ్లుతాగినిలుచుండ నిమ్మవేయింతు
పాలుతాగిపడుకుండ పనసవేయింతు
వేరుసెనగపప్పు చల్కిపంచదార
తినమని, చిలకమ్మ! చిరుతిండిపెడుతు
అరటిపళ్లుతెచ్చి అతివ! నీకిత్తు
జామిపళ్లుతెచ్చి చేతికందింతు,

శ్రీమతి ఇందుర్తి శకుంతల గారు

అటపీసలముల కేగుదమ
వటపత్రంబుల కోయుదమ

పొన్నలుపొగడలు యెక్కుదము
చిన్నకృష్ణుని వేడుదము
కురివిందపొదలో దూరుదము
పొగడశాఖల కేగుదము
అశోకవృక్షము యెక్కుదము
జననిజానకిని వెతకుదమే
బాలికలందరు కూడుదము
తలుపుమూలల దాగుదము
దాగుడుమూత దండాకోరు
పిల్లివచ్చె ఎలుకభద్రా
ఎక్కడివారక్కడనె.

## మూగనోముపాట

కాశీరాజు రామమోహనశర్మగారు

మోచేటిపద్మంబు పట్టేటివేళ
మొగ్గల్లుకలవల్లు పూసేటివేళ
ఆనపగాయపువ్వుల్లు పూసేటివేళ
అటికెలతో ఉదకమ్ము తెచ్చేటివేళ
గుమ్మిడిపువ్వుల్లు పూసేటివేళ
గుండిగెలతోనుదకమ్ము తెచ్చేటివేళ
బీరాయిపువ్వుల్లు పూసేటివేళ
బిందెలతోనుదకమ్ము తెచ్చేటివేళ
కాకరగాయపువ్వుల్లు పూసేటివేళ
కడవలతోనుదకమ్ము తెచ్చేటివేళ
ఆవుల్లుదూడల్లు వచ్చేటివేళ
అంబోతులంకెల్లు వేసేటివేళ
అన్నల్లు అందనా లెక్కేటివేళ
తమ్ముళ్లు తాంబూలం వేసేటివేళ
కోడళ్లు కొట్టుపసుపు కొట్టేటివేళ
సంధ్యన్ను దీపాలు పెట్టేటివేళ
చాకింటిమడతల్లు తెచ్చేటివేళ
ముద్దుమొగ మద్దాన్నిబోలు
తనమొగము తామరపద్మాన్నిబోలు
మోచేటిపద్మంబు పట్టిన
శ్రీగౌరీపార్వతీదేవికి
అయిదువేల అయిదోతనం.

## పెండ్లికబుర్లు

శ్రీమతి నాగలింగము సరళాదేవిగారు

గోరుచిక్కుడుకాయ గెలవేసినట్లు
గోత్రానలబ్బాయి నేరికిస్తాము
ఎవరికిస్తామమ్మ ఎవరికిస్తాము
కులములో మేనత్తకూతుకిస్తాము
అత్తమంచిదయితే అనుకూలమైతే
బాలుడులేతయితే పట్టనిచ్చేము.
పాపమాఅబ్బాయి పాలకేడిస్తే
పాడియావులనంపిరి మేనమామల్లు
రాజుల్లబోలిన మామల్లుఉంటే
రచ్చల్లునేలంగ సందేహమేమి?

౨. నీతికథలు

---

## అద్వైతజ్ఞానము

శ్రీమతి ముంతా కోటీశ్వరమ్మగారు

ఈవిశ్వమంతయు బ్రహ్మమయమేయని ప్రకటించు అద్వైతసిద్ధాంతమును ఒక రాజునకు వానిగురువు బోధించినాడు. అందువలన రాజునకు పరమానందము కల్గినది. అతడు తనరాణినిసమీపించి "రాణికిని రాణీదాసీజనమునకును భేదములేదు. కావున రాణీదాసియే నాకు రాణిగానుండవచ్చును" అనెను. రాణి తనభర్త

మాటలకు నివ్వెరబోయినది. ఆమె గురువుగారికి వర్తమానమంపి "అయ్యా! మీబోధల మహాదుష్ఫలమును చూడుడు" అని దీనముగ మొఱలిడినది. గురువు రాణిని ఓదార్చి "నేడు రాజు భోజనముచేయు సమయమున అన్నముతోపాటు ఆవుపేడనుకూడ పళ్లెరమునందు పెట్టించుము" అని సలహాచెప్పినాడు. భోజనసమయమున గురువును రాజునుకలిసి భోజనమునకు కూర్చుండిరి. అన్నముతోపాటు వడ్డించిన ఆవుపేడను చూడగనే రాజునకువచ్చిన ఆగ్రహము వర్ణింపనలవిగాదు. దీనిని కనిపెట్టిన గురువు "ఆర్యా! నీవు అద్వైతజ్ఞానము కలవాడవు. ఈ అన్నమునకును, పేడకును భేదమేల పాటింతువు?" అని ప్రశ్నించెను. రాజంతట పట్టరానిక్రోధముతో "అద్వైతివనిగర్వోక్తులు పలుకుమీరే పేడను తినండి" అని అఱచెను. గురువంతట "మంచిది!" అని తానొక సూకరము (పంది)గమారి అత్యానందముతో ఆవుపేడను భక్షించి, తిరిగి మానవరూపును ధరించి నిలిచినాడు. రాజంతట సిగ్గుదెచ్చికొని రాణితో పిచ్చిప్రసంగములుమానినాడు.

## 3. వినోదకథలు

## పులిగాడు, గిలిగాడు

శ్రీమతి వల్లూరి అన్నపూర్ణమ్మగారు

ఒకవూళ్ళో ధనవంతుడైన కాపు. అతనికి 2, 3 వేల గొర్రెలు, ఇద్దరుపాలేళ్ళు. ఆగొర్రెలను పగలు వొకడూ, రాత్రివొకడు కాస్తూవున్నారు. అది వానాకాలం. గొర్రెలుఅంత బాగాబలిసిలేవు. ఒకరోజున పగలుఅస్తమానం కాపలాకాసే పాలేరువచ్చి వాడిపని అయిపోయినతర్వాత రాత్రికాపలాకాసేవాడిని రమ్మన్నాడు. వాడు అట్లాగేవచ్చి కాపలాకాస్తున్నాడు. కాని పగలుకాసేవాడు యింటికి వెళ్లేటప్పుడు రెండవవానితో ఒరే యెంకో! పులిగాడు గిలిగాడు వొస్తాడు జాగ్రత్తఅని వెళ్లేడు. రాత్రి 11 గంటలు సుమారయింది. యెంకడు నిద్రపోతున్నాడు. ఆమేకల్ని తిందామని ఉద్దేశంతో పులి ఒకటి వచ్చి అక్కడ దాగివుంది. పులిగాడుగాక గిలిగాడుకూడ వస్తాడని పాలేరు అనడంతో దానికి నిండా పిఱికిమందుపడింది. ఇల్లావుండగా దొంగలు కొందరు ఆరోజురాత్రి బాగా మంచిమేకను వెదకుచు యీమందలోకే రావడం తటస్థించింది. పాపం వాళ్ళదురదృష్టం. తెల్లారొస్తోంది. ఎక్కడా మంచిమేకదొరకలేదు. తెగవెదుకుతున్నారు. ఆ, కనబడిందంటే కనబడిందనుకున్నారు. ఏమిటి? మందలో పడుకున్న పులిగాడు. దీనినిచూశారు, మంచి మేకఅని నలుగురుదొంగలుకలసి దాన్ని లేవకొట్టేరు. పులియేమిమాట్లాడలేదు. కిక్కురుమనలేదు. దానికి అది పరకే భయంపట్టుకుంది. గిలిగాళ్ళువచ్చేరని లేచింది. ఈటక్కరుగాళ్ళు యిద్దరు చెరోపక్కని ఒకడు దాని మీద మరిఒకడు వెనకాలబయులుదేరేరు. తెల్లారొస్తోంది. కాస్తకాస్తకనబడుతోంది. వెనకాలవాడికి పులి అని తెల్సి వాడిగుండెఫడేలుమనిఆగిపోయినట్టయింది. వెనకాలవాడు వెనకాలేజారేడు. పక్కవాళ్ళు పక్కకే మళ్ళి మాట్లాడలేదు. మీదఎక్కినవాడుకూడదిగి చల్లగజారేడు. పులి.పూరుకే పరుగెడుతోనేవుంది. అది వాళ్ళని గిలిగాళ్ళువాళ్ళు అనుకుంది. ఇంతలో నక్కబావగారు యెదురయ్యేరు. నక్కబావగారు యేమండో పులిబావగారు ఎక్కడకో మాతొందరగా వెళ్ళుతున్నారు. పులి-బాబో-గట్టిగాఅనకు గిలిగాళ్ళువున్నారు. అదుగో అగుళ్ళో చంపేస్తారు. నిమ్మళం. నక్క-అలాయితే నేను వారినిచూడాలి అని అక్కడికివెళ్ళి దేవాలయపుతల్పు గెంటింది. తల్పువేశివుంది. నక్క అప్పుడు తనతోకను ఆదేవాలయంతల్పు కన్నములోపెట్టి పూరికేతిప్ప మొదలుపెట్టింది. ఎంతప్రయత్నించినా తల్పు రావడంలేదు. వెనకాల దానితోక టక్కర్లు నల్గురుపట్టుకున్నారు. బయట నక్కలాగడం, లోపలటక్కర్లులాగడం. ఎంతసేపుప్రయత్నించిన నక్కతోక వచ్చేవిధానం కన్పడలేదు. పులి ఇదిఅంతా చూస్తూనేవుంది. నక్క ఆఖరికి ఒక్కలాగులాగింది. తోకవూడి

పోయింది. టక్కర్లచేతికోబడింది. నక్కకువూర్కే రక్తంకారుతోంది. బాధపడుతోంది. దానితో అయ్యా బాబో పిల్లగిలిగాళ్లుకాదు, తోకపీకుడుగాళ్ళు అని కేకేశి ఆదేవరిగత్తింది పులిబావతోకలసి.

## గడుసు పెళ్లాం

శ్రీమతి ఇవ్వశ్రీ సావిత్రిగారు

అనగనగా ఒకవూరులో ఒకిమొగుడూపెళ్ళాము ఉండేవారు. పెళ్ళాం రోజూఅన్నం వండి తపాలవూర్చి మొగుడికిపెట్టేసేది. ఒకరోజు మొగుడు ఏమే! నువ్వు రోజూ అన్నంవండి నాకు తపాలవూర్చి పెట్తావు నువ్వు ఏమితింటావు? అని అడిగినాడు. అందులకు పెళ్ళాము మీరుతింటే చాలును నాకెందుకండీ నేనోవో నీళ్ళోపాళ్లో తాగుతాను అని అన్నది. రోజూఅన్నంవండి తపాలవూర్చి నాకేపెట్తాది ఇదేమితింటాదో చూడాలని ఒకరోజు మొగుడు ఏమేవ్! నాకు ఒంట్లోబాగులేదు నేనుపొలానికెళ్లను ఇంట్లోనే పక్కవెయ్యిఅన్నాడు. సన్న దుప్పటికప్పుకొని పడుకున్నాడు మొగుడు. పెళ్ళాము మొగుడునిద్రపోయాడనుకొని పాలలో బియ్యముపోసి పొయ్యిమీదపెట్టి పాలుపొంగినతరవాత బెల్లంవేసి పీటకడిగిపీటమీద పోసుకొని బేగిబేగితినేసి దీపంఆర్పేసి తలుపు గెడపెట్టుకొని మొగుడుదగ్గరకువెళ్ళి ఏమండీ ఏమండీ ఒకకథ చెప్పండీ అని లేపినది. మొగుడులేచి అబ్బ! ఏమికథే? పొయ్యిమీదపాలు పొంగు, పుట్టిమీదనెయ్యి వుటుక్కు, పీటమీదపాయసము పిటుక్కు, దీపం దిటుక్కు, గెడగటుక్కు, నేనిటుక్కు, నువ్వట్టుక్కు, అబ్బ ఇంకేమికథే అన్నాడు. పెళ్ళాం నాగుట్టు తెలుసుకున్నాడ్రా బాబూ అనుకున్నది. కథ చెప్పినవాళ్లకు కంకణాలు, ఊకొట్టినోళ్లకు ఉంగరాలు.

## బెబ్బెబ్బే

శ్రీమతి వి. వసంతగారు

ఒకవూరిలో ఒకకోమటివుండెను. అతను మాటనిలకడకలవాడు అనుపేరు ఎట్లో సంపాదించెను. 'కోమటి నిజము' అనుమాట మరచి అతను అడిగినదే చాలునని అందరు వానికి డబ్బుఅప్పు ఇచ్చుచుండిరి. ఇట్లు కొంతకాలముగడచెను. పిదప ఆవర్తకునికి వ్యాపారములో నష్టమువచ్చెను అను సంగతి ఆకోమటి అందరితోను చెప్పదొడగెను. అతని సంగతి విన్నంతనే అప్పులవారందరు ఎగబడిరి. అతను అందరకు జవాబుచెప్పలేక బాధపడుచుండెను. ఒకనాడు అప్పులవాండ్లలో నొకడు అతనియొద్దకుపోయి ఓయీ అప్పులవాండ్లబాధ తప్పించుకొనుటకు నీకు ఒకయుక్తిచెప్పెదను, నాసొమ్ము నాకిచ్చెదవా?అని అడిగెను. దానికి వర్తకుడు సమ్మతించెను. తరువాత అతను ఓయీ నీదగ్గరకు ఎవరైనవచ్చి బాకీ అడిగినప్పుడు బెబ్బెబ్బే అని అరువుము అని చెప్పిపోయెను. అదిమొదలు ఆకోమటి అట్లే చెప్పుచుండెను. అప్పులవాండ్లందరు వర్తకునకు పిచ్చిపట్టినదనితలచి తమసొమ్మునకు నీళ్లువదలిరి. తరువాత ఒకనాడు యుక్తిచెప్పిన బాకీదారుడువచ్చి ఇక నాబాకీతీర్చు అని అడిగెను. ఆకోమటి బెబ్బెబ్బే అని అరచెను. అతడు ఏమయ్యా నాకునూ బెబ్బెబ్బేనాఅనిఅడిగెను. నీకును బెబ్బెబ్బే, నీఅబ్బకును బెబ్బెబ్బేఅని ఆకోమటి బదులుచెప్పెను.

## నడుములులేని చేపలు

శ్రీమతి ఇప్పర్తి భారతమ్మగారు

ఒకవూరులో ఒక మొగుడు పెళ్ళాము వుండేవాళ్లు. మొగుడికి చేపలంటే మహా ఇష్టము. ఒకరోజు చాలాచేపలుకొని పెళ్ళాన్ని వండిఉంచమనిచెప్పి పొలములో ఏదో పనికొఱకు వెళ్ళినాడు. వచ్చుటకు అలస్యమైనది. ఇంటివద్ద పెళ్ళాము చేపలుకూరవండి రాత్రిఅయినది, ఇంకా మొగుడురాలేదని బైటకువచ్చిచూస్తూ అయ్యో ఇంకారాలేదని ఇంట్లోకి వెళ్లి ఒక్కొక్కముక్క తింటూన్నది. ఇట్లా మొగుడువచ్చేటప్పటికి మధ్యముక్కలన్నీ తినేసింది. మొగుడువచ్చేడు. అన్నముతింటూ మొగుడు తలకాయలుండంగ తోకలుండంగ నడుము లెక్కడపోయె ఓసంగనాచి అన్నాడు. అంటే పెళ్ళాము తీవ్రదృష్టితో చూస్తూ మతిలేని మగ వారిమాటలేకాని మడుగులోని చేపలకు నడుములెక్కడివి అన్నది. చేపలకు నడుములుండవు గాబోలుననుకున్నాడు మగడు. కథ కంచికి మనమింటికి.

## ఎవరు?

శ్రీమతి గొల్లపూడి జయలక్ష్మిగారు

ఇట్టి చీకటిరాత్రివేళను
యించుకంతయు భయములేకయె
మెల్లగానడయాడుచుండెడు
నెలత! నీవెవరు?
నీదుకన్నులలోనికాంతియు
నీదుమోము వికాసమంతయు
అధరసీమను వెలుగులీనెడు
హాసచంద్రికయు.
బాష్పవారిలో మాయమయ్యెన?
పారుచుండెటి నీటఁగలసెన
వేడియూరుపు గాడ్పులందున
మడసిపోయెన?
సాంద్రజలధరపంక్తులందున
చంద్రుని నీవు పోలియుంటివి
మలినవస్త్రాలంకారిణివగు
లలన! నీవెవరు?
క్లేశభారముచేత నీమది
విషాదపూరితమయ్యె! నష్టా
మోగవోయిన నీదుకంఠము
మూతఁబడెరచునా?
నీదు శుష్కశరీర మీయెడ
నీవిశాలప్రపంచమందున
ఎక్కడేనియు జాలిఁజెందున?
లేక మడయునా?
హృదయసీమను దోచెకరములు
శీతలానిలాఘాతములకు
వణకిపోవుచునుండె దేహము
వనిత! నీవెవరు?
దిక్కుమాలిన నీదుజీవన
మెక్కడేనియు హర్షమందున?
దినదినమ్ము కృశించి యిలలో
లీనమవునేమొ?
ఇట్టిగభీరజలములందున
యించుకంతయు భయములేకయె
మెల్లగానడయాడుచుండెడు
నెలత! నీవెవరు?

## మేలుకొలుపు

శ్రీమతి పి. సీతారామమ్మగారు

మేలుకొను శ్రీరామచంద్రా!
మేలుకొను సత్కీర్తిసాంద్రా!
మేలుకొను నీసేవకుల మ
మ్మేలుకొనుమయ్యా.
క్షీరవారధి శేషశయ్యను
శ్రీరమామణి పదములొత్తగ
నిదురబోయెదు నీదుభక్తులు
నెగులుపొగలగను.
సోమకుండు వేదములు దొంగిలి
పొచ్చెనంబుధి నంబుజాసను
నోమివానిసముద్ధరింపగ
నోలిమేల్కొనుమా.
మందరముపాల్కడలి మునిగెన
మందగతిపై కెత్తి యమృతము
విందుచేయగవలెను సురలకు
ముందుమేల్కొనుమా.
ధరణితలమును చాపచుట్టగ
దనుజుడల్లదె చుట్టుచుండెను
తవిలివాని వధింపగావలె
దయనుమేల్కొనుమా.
దేవుడనునేనుండ హరిగిరి
దేవుడందురు చూపుశనిభ
క్ష్మావలినిబాధించుదానవు
కావరమునడుపా.
రాక్షసులప్రభుమించిసాధుల
శిక్షలకు పాల్సేయుచుండెను
రక్షణము కృపసేయగాప్ర
త్యక్షమగుటకును.
అష్టకష్టము ప్రజలపెట్టెడి
దుష్టులౌ నరపాలకుల పద
భ్రష్టమొనరిచి రామరాజ్యప్ర
తిష్టనిలుపగను.
లంకరక్కసిదొరల దొరయక
లంకయగుమాలక్ష్మిభూమిజ
శంకలేకహరించె తత్కాల
మింకనింకింప.
మర్మమునగై కొన్న రాజ్యము
ధర్మనియతిని గోరనీయని
దుర్మదుల దుశ్శాసనాదుల
తుదినిముట్టింప.
గగనమున కనబడకతిరుగుచు
జగములను పీడించుద్రోహుల
విగతప్రాణులజేసి మాకిల
సుగతివగుటకును.

## ఆర్వేలవారి ప్రభావము

శ్రీమతి సత్యవతమ్మగారు

ముక్కంటిరాజన్య మూర్ధాభిషిక్తుగా
వెలయించువా రారువేలవారు
వృషభాధిరూఢులై వేలూరుచనికీర్తి
వెలయించువా రారువేలవారు
రాజమాన్యాదివిభ్రాజమానాంకముగ
వెలయించువా రారువేలవారు
వంశంబులకు ప్రభువ్యవహృతివృత్తిగా
వెలయించువా రారువేలవారు
పేరుబడసినవా రారువేలవారు
పేదలనుబ్రోచువా రారువేలవారు
మేలుచేసెడివా రారువేలవారు
కేలుచాచనివా రారువేలవారు.

## రాటపు పాటలు

శ్రీమతి ఇనగంటి రత్నమ్మగారు

(వెనుకటి సంచిక తరువాయి)

౪౫

మంగళగిరికొండమీద మాడంత మెయిలు
కురిసె తిరుపతిమీద కుంభవర్షమ్ము
కుంభవర్షము కురిసి సాంబవరిబండు
మదనకేసరిపండు మంగతలబ్రాలు.

౪౬

అన్నమ్మదిసదమ్మ ఆసత్యవాస
తాగదుమందుల్లు దక్కదుకాముడికి.

౪౭

ఆవులుకోడెలు బెటితే దొడ్డుధరించు
కోడలుకొడుకులగంటె కులముద్ధరించు.

౪౮

తల్లితండ్రిలేని పెండ్లిళ్లనాడు
చుక్కలక్షింతలు సూర్యుడుగరుగు
పాముచేకంకణము పడగబాసికము.

౪౯

కన్నవారెట్టిన కరకంచుచీర
కలిమిలోలక్ష్మికి కట్టతీరదు
అత్తవారెట్టినా అంచుపచ్చడము
మెచ్చదేమాయన్న రచ్చగూర్చుండి
తనమెనకతమ్ముల పెండ్లిళ్లనాడు
పట్టమనిభద్రాజు పైకప్పినాడు
తగునయ్యకమ్మబిడ్డ! తగుకయ్యనీకు.

౫౦

కానివారితోను చెలిమిజేసితే
కట్టవిరిచిపొయిలో పెట్టినట్లుండు
మాయమ్మరామునితో చెలిమిజేసితే
మడతవిడచిమడుపు కట్టినట్లుండు.

౫౧

హెచ్చుతగ్గులేని భూమిలోబుట్టి
ఎంగిలిపాలామె తమల్లపాకు
తమలపాకులపొత్తికి తరగదెన్నటికీ
కలిమిరాయుడుపొందు దొరకదెన్నటికి.

౫౨

సానమీదగంధమ్ము చదరమీదనిదుర
సావిత్రిగారిదేవి నోమమ్మమాది.
సానమీదగంధమ్ము చదరమీదపోక
మేడమీదికరణమ్ము మేనత్తకొడుకు
మేనత్తకొడుకమ్మ నామేనమరది
మెచ్చి పాలపండ్లగుత్తులొడిగట్టు.

౫౩

పీభూతికలశాలు యిజ్జీచర్మాలు
పీరుమీ వెల్లటూరిమల్లుజంగాలు
జంగమైనాడమ్మ లింగమైనాడు
ప్రత్యక్షమైనాడు బాలాజిలోను.

౫౪

చిన్నమెత్తుబంగారపు చిరుతాళిబొట్టు
శ్రీరాముడుకట్టినాడు సీతసీఅర్త.

౫౫

కురచకురచవెంట్రుకలు కొప్పుకందమ్ము
కుందనపుఆదారు మేడకందమ్ము
కురచకురచకాళ్ల కుందేలుపిల్ల
కుయ్యవే కన్నారి గుమ్మములోన.

౫౬

కుంభకర్ణుడుచాల గొజ్జుమెడబెడితే
కుడిమల్లి చూచితే కుండమోటికలు.



**గృహలక్ష్మి ముఖచిత్రము:—**

"ముఖచిత్రము చాలా ఆకర్షణీయంగావుంది. రాట్నం వడుకుతోన్న ఆ ప్రసన్న సుందరమూర్తి భారత స్త్రీలోకానికి ఆదర్శప్రాయురాలు. పత్తిబుట్టదగ్గర ఆటలాడుకొంటున్న పసిపాప గడ్డమిూద తీర్చిన కుంకుమ రేఖలు, ఆమె చీర ఎర్రంచూ, ఆమె నడుమువొంపూ, చేతుల్లోని లాలిత్యం, ఆమె కళ్లల్లో వెలుగూ, తలలోని పువ్వులదండా, ఆమె మెడలో నగలులేకపోవడం, ఆమూర్తిలో ప్రశాంత సౌందర్యం నిండుకుపోవడం... చాలా అందంగావున్నాయి. వెనుకనున్న ఆధారభూమిక (Background) యొక్క ఛాయలు చాలా తెలివిగా గీయబడ్డాయి. చీర అంచుయొక్క రంగు అవసరమైనదానికన్నా కొంచెం తీక్షణంగా ఉందనుకొంటాను. అది రచయిత వ్రేలుచూపించాలనుకొన్న వస్తువులనుండి దృష్టిని చెదరకొడుతూ అంతా సాకే కావాలంటోంది... ఆరాట్నపురొదలో, సంగీతంలో లక్ష్యసమన్వితమైన (Purposeful) ఆమె హృదయంకూడా లయగలిపి పాడుతోందనుకొంటా?"

—కస్తూరి రాజామాణిక్యము.

**ధనుర్మాసము:—**

"ప్రతిసంవత్సరమును చైత్రవైశాఖములమొదలు మేషము మొదలు మీనమువరకు పండ్రెండు నెలలు వచ్చుచుండును. అందు ధనుర్మాసము పైరులన్నియు పరిపక్వావస్థనుండు సమయమున వచ్చును. ప్రజలందరును తామొనర్చిన కృషి ఫలితమునకు వచ్చినందున సంతోషహృదయముతో నుల్లాసముగ నుందురు. పశువులన్నియు పచ్చిక పూర్తిగనుండు బీళ్లలో కడుపార మేసి పుష్టాంగములతో చూచువారలకు నేత్రపర్వము గలిగించుచుండును. గోవులు పూర్ణముగ దుగ్ధమునిచ్చుచుండును. లేగదూడలు స్తన్యములసంతృప్తిగ గ్రోలి విశాలముగ బీళ్లలబర్విలిడుచు నిర్విచారచిత్తముల పోలికను ప్రకటించుచుండును. ప్రజలయానందమే తమ యానందమని భావించు ప్రభువులు తమభావిశుభంబులకు గారణమగు ఫలితభూపరిశీలన లొనర్చుచు పల్లెలనుండు కష్టసుఖముల నరయువిచ్చేయుచుందురు. వర్తకులు రూకలమాటలతో గ్రామంబుల సంచరించుచు కొద్దినెలలకు పైరుల మీదనుండు ధాన్యముల క్రయమొనర్చి లాభమునొందుచుందురు. బ్రాహ్మణోత్తములును, నియమవంతులును ప్రాతఃకాలముననే సత్కర్మానుష్ఠానతత్పరులయి దేవతాయతనముల భక్తిపూర్వక ధ్యానములనొనర్చుచుందురు. ఫలించియున్న ధాన్యబీజముల స్వేచ్ఛగ ననుభవించి శుకాదులు కలమధురస్వనమున ఆకసంబున పంక్తులుగ బర్విలిడుచుండును. ఈవిధమున సమస్తప్రాణులు నానందమునొందుట నీధనుర్మాసమున గనుగొనుచుందుము. ఇట్టి సకలజగదానందము నొనర్చునీనెల యెద్దియోకొంత యీశ్వరవిమలదృష్టికి యాకరమైయుండ వచ్చును. కొన్ని యితరపర్వదినములు యెటుల ఆదరణీయంబులయి భగవత్కటాక్షమున కర్హతమములని

రించబడుచున్నవో యటులనే యీసంక్రమణపర్వ ముండు నెలరోజులును విశేషముగ హిందువులు పండుగ దినములుగ నెన్నుదురు. నియమపూర్వకముగ నీశ్వరుని ధ్యానించు స్త్రీపురుషులు ఈమాసమున నెక్కువగ గానవచ్చెదరు. ఈమాసమురోజులును ఉత్సాహముతో వేడుకలనొనర్చుకొనుచు చివర మూడురోజులును మిగుల యానందముగ కాలముగడపుచుందురు. నూతనముగ ఫలించిన చెరకుముక్కలును, బియ్యమును, క్షీరములదడపి వేడుకతో ముత్తైదువులకు పెట్టుచు నాబాలవృద్ధము భుజించి మహదుల్లాసమున నోలలాడుదురు. ఈ మాసముననే వైకుంఠైకాదశి (ముక్కోటి)యను గొప్పపర్వదినము వచ్చుచుండుటయు మిగుల యాదరణీయము. ఇంతియగాక ప్రస్తుతరాజకీయవిరామదినములుగగూడ నుండుటయు నీదినములనే తటస్థించుట యుద్యోగులకు గూడ మనోవికాసమున కెక్కువ యవకాశముగలుగుచుండును. ప్రజాసౌకర్యదేశహితసభలుగూడ నీసమయముననే జరుపబడుచుండుటచే దేశీయనాయకులనేకులు సమావేశమై లోకసంగ్రహమునకు పాటుబడు ప్రణాళికను నిశ్చయించు పవిత్రదినములయియున్నవి. కావన నీధనుర్మాసదినములు పూజనీయములనియు, నిష్ఠాతత్పరత నుండదగిన పర్వోత్తమములనియు జెప్పదగియున్నవి."

—వీరపనేని సత్యవతి.

### సంక్రాంతిపండుగదినములు:—

"జాముప్రొద్దెక్కెను. గ్రామమునందలి పశువులన్నియు పొలములకు బయలుదేరెను. కాయతీతలకు వెళ్లిన పాటకపుస్త్రీలు ఇండ్లకు చేరుకొనుచుండిరి. చెఱుకుగానుగులవద్దనుండి పెద్దరైతులు పట్టెడేసి బెల్లపుటుండలును, ఒకటోరెండో చెఱుకుగడలును పట్టుకొని ఇండ్లకు వచ్చుచుండిరి. పొలములలో పనిచేయుచున్న వాండ్రకు కొందఱు ముంతలుపట్టుకొని వెళ్లుచుండిరి. బెల్లపువర్తకులు క్రొత్తబెల్లము నిమిత్తమును, ధాన్యపువర్తకులు క్రొత్తధాన్యము నిమిత్తమును చాలతొందరగా తిరుగుచుండిరి. గుంటజంగాలు సంక్రాంతిపండుగ పేరుచెప్పి అనేకవేషములతో చాల గడబిడగా తిరుగుచుండిరి ... సంకురాత్రిపండుగ మహావైభవముతో గడచిపోయెను. వేరుటికాపురములు దిద్దుకొనవలసిన ఆడుపడుచులు పుట్టినిండ్లనుండి వెడలిపోవుచుండిరి. బట్టలవ్యాపారము చేయువారికి చాలగిరాకీగానుండెను. మాలమాదిగల విల్లేలపదములతో గ్రామమంతయు ప్రతిధ్వనించెను. జట్కాబండివాండ్రకు చాల తొందరగానుండెను. ఊరిలోని దేవాంగులు చాల అడావిడిగానుండిరి. మనుష్యుల కోలాహలధ్వనికి కోడిపుంజులరంకెలు జీవము పోయుచుండెను. ఎటుచూచినను అత్తిండ్లనుండి వెడలిపోవు అల్లుండ్రు కాన్పించుచుండిరి."

—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

### కీ. శే. గుడిసేవ కామాక్షమ్మగారు:—

"సుప్రసిద్ధసంస్కర్తలును, బ్రహ్మసమాజకులునగు శ్రీయుత గుడిసేవ సుబ్బయ్యగారి తల్లి కామాక్షమ్మగారు 2-12.31 తేది బుధవారం ఉదయం బందరు వారిగృహములో తమ 68 ఏట దివంగతులైరి. ఈమె మొదటినుండియు కళావంతుల సంఘసంస్కరణయందెంతో కృషిసల్పి తమ కుమారులగు సుబ్బయ్యగారిని సంస్కరణ కార్యములయందెంతయు ప్రోత్సహించుచుండెడివారు. కళావంతుల సంస్కరణకు ప్రథమబీజము లామెచే నాటబడినవని చెప్పుట యందతిశయోక్తిలేదు. ఇప్పటికి 25 సం॥ల క్రితమే యీమె బందరునందు వేశ్యావృత్తిని నిరసించుచు, ప్రచారముగావించి ఆసమయమున విజయనగరములో శ్రీ శ్రీ రఘుపతివేంకటరత్నమునాయుడుగారి అధ్యక్షతక్రింద జరిగిన సంస్కరణసభలో కళావంతులసంఘమున్నం దీచెడువృత్తిని నశింపజేయవలెనని ఉపన్యసించియుండిరి. దీనినిబట్టి స్త్రీలలో నీమె ప్రథమప్రచారకురాలుగా పనిచేసియున్నారని చెప్పుటకు సందేహములేదు. మరియు వృద్ధాప్యమున కేవలము నాల్గుసంవత్సరములకు పూర్వము సికింద్రాబాదు ప్రాంతములలో సంస్కరణప్రచారము గావించియుండిరి. కొంతకాలమునుండియు ఈమెకు బ్రహ్మ

మతమునందభిమానము గలిగిన శ్రీ శ్రీ వెంకటరత్నము నాయుడుగారిని గురూత్తమునిగా భావించి వారియుప దేశములను వినుటయందెంతో భక్తిశ్రద్ధలను జూపుచుండెడివారు. ఆమె చనిపోయినప్పుడు బ్రహ్మమతమునం దామెకుగల యభిమానము ననుసరించి అంత్యసంస్కారములన్నియు మామూలుగ జరుపబడు స్మార్తధర్మమును బట్టిగాక బ్రహ్మధర్మానుసారము జరుపబడుచున్నవి. ఈమె ఆత్మకు పరమేశ్వరుడు శాంతినొసగుగాక!"

—సమదర్శిని.

**శకునములు:—**

"డిశంబరు నెల 10-వ తారీఖు ఉదయము హైదాపేట డిప్యూటీకలక్టరుగారగు టి. యస్. సుబ్బయ్యరు గారు ప్రాతఃకాలము షికారు వెళ్ళినప్పుడు రైలుపట్టాలవద్ద బండివచ్చు వేళ అవుటచే గేట్లుమూసియుండగా వారు అట్లనే దానిలోదూరి రాబోయిరి. అప్పుడు గేటుకావలివాడు "అయ్యా! బండివచ్చుసమయమైనది. ఇప్పుడు తాము వెళ్ళవలదు" అని నివారించెను. "పరవాలేదు. నేనేకదా? యింకను బండివచ్చుట కాలస్యమున్న" దని గేటులోనుండి వచ్చుచుండగా కర్మవశమున ఎలక్ట్రిక్ రైలు వచ్చుటచే దానిని తప్పుకొనబోయి మెయిలు పట్టాలమీదకు వెళ్ళుటతోనె తక్షణమే మెయిలువచ్చివేసెను. వీరు దానిక్రింద పడుటచే వెంటనే ప్రాణములు గోల్పోయిరి. కొమార్తెను, ఒక్కకొమారుని, భార్యనువదిలి చనిపోయిరి. ఇంటినుండి బయలుదేరునప్పుడు వారిపాదరక్ష జారిపడిపోయెనట. "శకునముబాగులేదు. మీరువెళ్ళవలదు. దుశ్శకునమైనది" అని భార్య నిర్బంధపెట్టెనట. "పరవాలేదు! నిత్యమూ వెళ్ళుచుండుటలేదా? దీనికేమి?" అని లక్ష్యపెట్టక వచ్చివేసిరట. ఆసాధ్వీమణి నుడివినట్లే ఈపాట్లుతటస్థించెను. భగవంతుడు వీరిఆత్మకు శాంతినిచ్చుగాక! ఇటులనే కొందరు స్త్రీలు ఏదైననూ దుశ్శకునములవిషయమై చెప్పిన పురుషులు లక్ష్యపెట్టకుండుటయేకాక "నాన్సెన్సు. దీని కేమి?" అని త్రోసివేసి ఒక్కొక్కపరి కష్టముల పాలయ్యెదరు. కనుక ఏదైనపని మనము చేయునప్పుడు దుశ్శకునమైనచో కొంచముతాళి నెమ్మదిగా చేయుట మంచిదని తలంచెదను."

—నాయిని హనుమాయమ్మ.

**కుమారీస్తవము:—**

పంచమాంధ్రమహిళాసంఘాధ్యక్షురాలినిగూర్చి:

"పవిత్రరూపిణీ! నీపావనచరణకమలముల నతివినయమున నాఘ్రాణించుచున్నారము. నిరాడంబరవేషిణీ! దర్పోన్నతి మిలమిలలాడు దంభపువేషములకు నీముస్తాబు నెదుట కన్నెత్తరానిసిగ్గు. ఆనందస్వరూపిణీ! నిరంతర భవదాననవాసినిభుగు ఆనిశ్చలదరహాసచంద్రిక యొక్క నీడన-స్త్రీహృదయమునందలి ప్రేమతత్వమున్నతపోషణ యొసగును. జ్యోతిర్మయోజ్వలస్వరూపిణీ! నీకన్నులు వెల్లిగక్కుచుండు శాంతికాంతులనడుమ కవికుమారుని కల్పనాసౌందర్యము కనలిపోవలసినదే. ప్రియభాషిణీ! చల్లనిచందమామవలె సజ్జనహృదయానందకరమగు నీవచోనైపుణ్యముంగాంచి విష్ణుతల్పమాశీర్వాద మొసగుచున్నది. అనుపమహైందవవిదుషీ! భవద్విద్యారూపముం గాంచి వాణీదేవి వంకలుదిద్దుకొనుచున్నది. మంగళరూపమున నిట్లుగదా యుండవలయును. దేవీ! మన మాతృశ్రేష్ఠతమానుష ననుకరించు రూపగుణవిశేషముల వాతనివలెనే భారతి నిజపుత్రివన నీవరయి ఆచంద్రతారార్కము కీర్తివర్ధిల్లుము. సార్థకనామధేయినీ! నీపవిత్ర నామాక్షరములు స్త్రీలోకమున పావనమంత్రాక్షరలై వెలయుచుండునుగాక! కుమారీవతంసమా! నీపవిత్రనామమునకు జోహారు. పంచమరాష్ట్రీయమహిళాసభాధ్యక్షిణీ! ఆదివ్యనామము నొకపరి జపించుట కనుజ్ఞనిత్తువా? కుమారి వసుంధరాదేవికి జై !!!

—యం. సత్యబాలసుశీలాదేవి.

## మైసూరు మహారాజాగారి కైలాసగిరి తీర్థయాత్ర:—

"ఇటీవల మైసూరుమహారాజాగారు కైలాసపర్వతమునకు తీర్థయాత్రకువెళ్ళియుండిరి. మహారాజాగారి యనుచరులలో నొకయుద్యోగస్థు డీక్రిందివివరములను తెలిపియున్నాడు. ఇట్టి తీర్థయాత్రనుగావించిన దక్షిణ హిందూసంస్థానాధీశులలో వీరు మొదటివారని తెలియుచున్నది. తీర్థయాత్రకు మహారాజాగారు 6గురు పెద్ద వుద్యోగస్థులను 5 గురు చిన్నఉద్యోగస్థులను ముప్పదిమంది నౌకరులను వెంటబెట్టుకొనిపోయిరి. వీరందరును జూన్ 13-వ తేదిన మైసూరునుండి బయలుదేరి 22-వ తేదిని రాణీకోటకుచేరిరి. అచ్చటినుండి పయనమై 24-వ తేదీని అల్మోరాకుచేరిరి. అనేకప్రదేశములనుండి తమవెంట తీర్థయాత్రకువచ్చెదమని మహారాజాగారికి తంతివార్తలొచ్చియుండెను. అల్మోరాకు తహశీల్దారుగానున్న ప్రతాప్‌సింగుగారిని సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమువారు మహారాజాగారికి సాయమునిచ్చిరి. మరియు సరిహద్దురాష్ట్రములలో పలుకుబడిగల ఒక రిటైర్డు పేష్కారునుగూడ సంయుక్తరాష్ట్రప్రభుత్వమువారు మహారాజాగారికి తోడునిచ్చిరి. 6 గురు మిలిటరీ గూర్ఖాలుకూడ మహారాజాగారి వెంటనుండవలసినదిగా పంపబడిరి. మహారాజాగారనుచరులతోగూడ 27-వ జూన్ తేదిన అల్మోరానువిడిచి, అడవులలోనుండి ప్రయాణము గావించిరి. దారిలో వర్షించినప్పుడు తేళ్ళు, జలగలు అపరిమితముగ కానవచ్చెను. యాత్రికులు 5000 అడుగులెత్తునఉన్న అస్కోటకుబోయిరి. అచ్చట నుండి వీరుబయలుదేరి గౌరిగంగనదిమీద తేలుచున్న వంతెనమీదుగబోయి ఖేలామకామునకు జేరిరి. అచ్చట నేల నిమ్నోన్నతముగానున్నను పోనుపోను టిబెట్‌లోమాత్రము డేరాలువేసికొనుటకు వీలుగనేయుండెను. యాత్రికులు మంగోలియావారును, బోటియాలును నివసించుచు "తితిన్"అను ప్రదేశమునుచేరినప్పుడు, తాము పుణ్యభూమికి చేరియున్నారని తెలుపబడెను. అచ్చట ఎత్తుగనున్న భూమిపైకి ప్రాకవలసివచ్చెను. జూలై 12-వ తేదికి యాత్రికులు కార్బియాంగ్ యనబడు గ్రామముజేరిరి. ఈగ్రామములో షుమారు 150 ఇండ్లు మాత్రమేవున్నట్లు తోచుచున్నది. కార్బియాంగ్ షుమారు 11000 అడుగుల వున్నతప్రదేశమైనను చలిఅంతగా లేదు. పిమ్మట టిబెట్ గవర్నరుగారు నివసించు థాక్లాకోటకు యాత్రీకులుజేరిరి. అచ్చట మైసూరుమహా రాజాగారు మిలిటరివారిని వెంటబెట్టుకొని దాడి వెడలుచున్నారని పుకారీలుబుట్టెను. నిజస్థితిని తెలుసు కొనుటకైగూడ చారులుకూడ పంపబడినట్లు తెలియవచ్చుచున్నది. నీటినికాచుకొనుకాగులనుజూచి యీ గూఢచార్లు మిషిన్‌ఫిరంగులనికూడ తలంచినట్లును, వాటివిషయమై నిజమును తెలియ నపేక్షించినట్లును తోచు చున్నది. పిమ్మట యాత్రీకులు కాగులలో నీటినికాచి చూపగా అనుమానరాహిత్యమైనట్లు తెలియుచున్నది. యాత్రీకులు అచ్చటనుండి బయలుదేరి 15000 అడుగుల ఉన్నతప్రదేశమైన శియాంగ్‌బప్‌నకుజేరిరి. అచ్చట చలి హెచ్చుగానుండెను. ప్రకృతిదృశ్యమచ్చట కన్నులపండువుగా నుండెను. మంచుతోగప్పబడిన శిఖరము లును, క్రిందుగా ప్రవహించుచున్న కాళినదియు జూచుటకు సొంపుగానుండెను. ఇచ్చట ప్రదేశము హిందూ దేశముపైపున అందముగాను టిబెట్టుదేశము పైపున ఎత్తుపల్లములుగాను కన్పట్టుచున్నవి. థాక్లకోట దాటిన తరువాత 14 వేల అడుగులకు మించిన ఎత్తుప్రదేశము గానవచ్చుచున్నది. పశ్చిమ టిబెట్ గవర్నరుగారున్న ప్రదేశము చూచుటకు అందముగానుండును. గవర్నరుగారి భవనము గ్రామమునకు 600 అడుగుల ఎత్తున నున్నట్లును, సొంపైన ప్రదేశమున కట్టబడినను లోపల కడు అసహ్యముగానున్నట్లు తెలియుచున్నది. టిబెట్ దేశస్థుల ఆచారములు కడువింతగానున్నట్లు తెలియుచున్నది. వారెప్పుడును స్నానముచేసినట్లు కనబడదనియు, ఆడవారు మగవారు ఒకేమాదిరి దుస్తులను ధరింతురనియు తెలియుచున్నది. అన్నదమ్ము లలో జ్యేష్ఠుడు పెండ్లిచేసికొనినపిదప రెండుమూడు నెలలవరకు తమ్ములుగూడ అన్నభార్యను తమభార్యవలె జూచుకొందురనియు; భార్యపోయినవాని కుమారునికి పెండ్లి అయితే మామగారు కోడలిని భార్యమాదిరిగ

జూచుకొనుననియు; మరి యుపకుడు కుమార్తెలుగల విధవను పెండ్లియాడిన వెధవయొక్క కుమార్తెలనందరిని కూడ దాను భార్యలమాదిరిగ జూచుకొనుననియు మున్నగు వింతసమాచారములు తెలియవచ్చుచున్నవి. వేల కొలది గొఱ్ఱెలు పచ్చికతక్కువగనున్న యీప్రదేశములలో నెట్లు సుఖముగ బ్రతుకుచున్నవో చూచుటకు వింతగనున్నది. దారిలో దొంగలున్నారని యాత్రికులకు దెలుపబడెను. 22-వ జూలై తేదీని యాత్రికులు థాక్లకోటనువిడిచి కైలాసపర్వతమునుజేరిరి. దారిలో వీరు గుర్లాకనుమనుదాటిరి. ఇచ్చట 45 మైళ్ళ వైశాల్యముగల మానససరోవరమును జూచుటకెంతయు ఆనందముగానున్నది. ఇచ్చటగాలిలో మబ్బులేమియు లేకుండుటచే దూరముగానున్న వస్తువులుగూడ బాగుగ కనుపట్టును. మరియు దూరముననున్న వస్తువులన్నియు చేరువగనున్నట్లు తోచుచుండును. ఈవిషయమున మోసముకూడ కలుగుచున్నది. యాత్రికులు సరోవరమునకు 15 గజములదూరమున డేరాలలో బసచేసియుండిరి. మహిసూరురాజాగారును, తదితరులును సరోవరమున గంగపూజనుసలిపి స్నానముచేసిరి. సరోవరమున చేపలెక్కువగనున్నను, వాటినిపట్టుట కానతిమాత్రమీయ బడదు. తటస్థముగ చేపలు ఒడ్డుకెక్కివచ్చినవాటిని టిబెటువారు గొనిపోయి యెండబెట్టి భూతములను వెడలగొట్టుటకై యుపయోగించెదరని తెలియవచ్చుచున్నది. ఇచ్చట పక్షులుగూడ ఎక్కువగనున్నవి. ఈ ప్రదేశము సుమారు 15000 అడుగుల ఉన్నతమైయున్నది. 50 మైళ్ళకుపైగా ప్రయాణ మొనర్చినపిదప కైలాస పర్వతమునకు సమీపమున యాత్రికులు మకాముచేసియుండిరి. కైలాసపర్వతము డిప్పవలె గుండ్రముగానుండి మంచుతో గప్పబడియున్నది. చుట్టుపట్లనున్న ప్రదేశమునకన్న 2000 అడుగు లెత్తుగనున్నది. చూచుటకు మిక్కిలి సొంపుగానున్నది. 26- తేది జూలైనుండి మూడుదినములవరకు యాత్రికులు కైలాసపర్వతముచుట్టును తిరిగిరి. ఇచ్చట గౌరీకుండుసరస్సుగలదు. అందు స్నానముచేయుటకై మంచుగడ్డలను పగులగొట్టవలసి వచ్చెను. యాత్రికులు తిరిగి మైసూరునకు ప్రయాణమయిరి. దారిలో కోహిర్నాథ్ దేవాలయమును సందర్శించిరి. అచ్చట రాగిపీఠములపై మూడుఇత్తడి విగ్రహములు (త్రిమూర్తులు) గలవు. విగ్రహములను జూచిన వాటిని దక్షిణహిందూస్థానమువారే చెక్కియుండగలరని తోచుచున్నది. అట్లయిన ఈవిగ్రహములు టిబెట్టున కెట్లు చేరియున్నవి అనుప్రశ్న ప్రతివానికిని కలుగుచున్నది. కాని ప్రత్యుత్తర మెవరును ఈయలేకున్నారు. అచ్చట గ్రంథాలయముకూడ యొకటిగలదు. ఎవరును ఉపయోగించుచున్నట్లు తోచదు. దానినిదాటి దిగువగా వచ్చుచు మహారాజాగారు భాగేశ్వరతీర్థమును సేవించిరి. అచ్చట ప్రజలు మహారాజాగారికి స్వాగతమిచ్చిరి. దారిపొడుగునను మహారాజాగారికి ప్రజలు ప్రీతితో స్వాగతమిచ్చుచు నేవచ్చిరి. టిబెట్టుదేశములో చలి యెక్కువగా నేయుండును. కాని జనసామాన్యము తలచినంత కష్టముగానుండదు. బసచేయుటకు డేరా ఒక టియు, వచనమునకు పెట్రోలుస్టౌయొకటియు వెంటగొనిపోయిన టిబెట్టుదేశపుయాత్ర సుఖముగనే యుండు నని చెప్పవచ్చును."

—ఆంధ్రపత్రిక.

పరిశీలన:—

గతమాసపుఁ బుష్పచయములోని నా "పరీశీలనము" అను వ్యాసముపైని విమర్శనమును జూచితిని. ఆవిమర్శనము ప్రతివిమర్శనము వ్రాయఁదగినంత యుచితముగ లేకున్నను నావ్యాసమును విమర్శకురాలు సరిగ గమనింపనట్లు తెలియుచుండుటచేతను, విమర్శనమున స్వవచనవ్యాఘాతత్వదోషము బహుళముగనుండుట చేతను వ్రాయఁగడఁగుచున్నాను. "పదియేండ్లబాలికదైనను బరిణయమన్నను బురుషులన్నను..." అని నేను వ్రాయ విమర్శకురాలు "పురుషులకన్నను" అని చదువుకొనినారు. అది నాప్రమాదముగాదు. "తల పైకెత్తి ఉపాధ్యాయుని మోమువంకఁజూచుచున్న విద్యవచ్చుటయు తలవంచిన విద్య రాకుండుటయునా? గురుభక్తి, విద్యాసక్తియున్నచో నెటులైన విద్య రాగలదు" అని విమర్శనము. లజ్జయను దానియొక్క యాంతరంగిక

నూతన్మాభిప్రాయము గ్రహింపక వ్రాసిన వ్రాత ఇదియని మనవి చేయుచున్నాను. లజ్జయనునది యుక్తవయస్కలగు యువతీమణులకుండును. పదియేండ్లబాలిక కుండుదానికిని దీనికి నంతరము బహుళము. యుక్తవయస్కయగు తరుణీమణికిఁ బరపురుషదర్శనమువల్ల కలిగెడి లజ్జనలన సాధ్వసాదులుగలుగును. దావచిత్తస్థయిర్యమును విషయోన్ముఖత్వమును నసంభవములు. కావునఁ దమ యజ్ఞానాంధకారమును బోఁగొట్టి జీవితమునకు జ్ఞానజ్యోతి నొసఁగెడి దేశికుని యుపదేశముపట్ల నట్టి యనవసరలజ్జాదులకుఁ దావీయఁదగదను నాయుద్దేశము నిప్పటికైనను విమర్శకురాలు గ్రహించినఁ సంతసింతును. బాలబాలికలలోఁ దాను జెప్పువిషయము నేరేరు గ్రహించిరనువిషయముపాధ్యాయునకు వెంటనే తెలియుచుండును, గమనించుచుండునుగాని విద్యాసక్తి గురుభక్తియున్నచో వారికేవచ్చును మన వేతనమెట్లును లభించునుగదాయని యుపాధ్యాయు లనుకొనరాదు, అనుకొనరుకూడను. గురుభక్తి, విద్యాసక్తియునున్న నెట్లును విద్యవచ్చుననుట సార్వజనీనముగాదని విమర్శకురాలికిమాత్రము తెలియకుండునా? ఎంత విద్యాధికురాలైన స్త్రీయైనను పురుషునియొద్ద నిర్లజ్జగనుండుటకన్న లజ్జావతివద నర్హయైయుండుటయే మేలను తదభిప్రాయము నా "పరిశీలన" లోని "అనవసర" యను పదమును గమనించినచో వివరించుట అనవసరమగునేమో. ఏదేని సభకువెళ్లుచో నాలుగుప్రదేశములఁదిరిగెడి పురుషులే మాట్లాడుటకు భయపడుట మనము చూచుచున్నాము. అట్టియెడ ఘోషాస్త్రీ భయపడునని వీరి సామాన్యసూచన ఏల? నావ్రాసిన పరిశీలన యను వ్యాసములో నీవిమర్శకురాలి తీవ్రవిమర్శనమునకు గురియైనవి రెండువాక్యములే. నా "అనవసర" "పురుషులన్నను" అను రెండుపదములను సరిగగమనించియేయుండిన నింత రాద్ధాంతమునకు తావులేకయేయుండెడిది. నాయీప్రతివిమర్శనమున కుద్దిష్టము "పరిశీలన" ను మఱియొకతూరి జాగ్రతగఁ దిలకింప వేడికోలు. కాని విమర్శకురాలి దోషములెన్నుటమాత్రముగాదని మనవి. బాలుఁడుగానీ బాలికగానీ యుత్తముఁడగు దేశికునికడనే విద్య నేర్వవలయుననుట సర్వసమ్మతము. వినీత్యవినీతులు సర్వత్రయుండును. విద్యాసక్తియు గురుభక్తియునుండిన నెట్లును విద్యవచ్చుననెడి యేకలవ్యత్వము సార్వత్రికము గాదు. నా "అనవసరలజ్జ" యనుదాని కొక చిన్నయనుభూతలక్ష్యము. నాకడ నొక దాదాపు పదివత్సరముల ప్రాయముగల బ్రాహ్మణబాలిక సంస్కృతమును నుమారొకవత్సరమభ్యసించినది. ఆబాలికయొక్క తండ్రిగారి స్నేహమువల్ల నెప్పుడైన నేను వారింటికేఁగినచో నాబాలిక నాయొద్దకువచ్చి అగపడుటకెంతయు సిగ్గిలును. ఒకటిరెండుమారులుమాత్రము తొంగిచూచి పారిపోవునుగాని ప్రత్యక్షముగఁ జనువుగ సమీపమునకేతెంచుట యెఱుఁగను. ఇట్టిది స్త్రీలకు పెట్టనిభూషణమని విమర్శకురాలు వచింపఁగలరా? నాయభిప్రాయమున నిట్టిది యనవసరలజ్జ. ఇట్టివిపరీతభావమును దల్లిదండ్రులు సాధ్యమైనంతవఱకుఁ దమ సంతానములకుఁ బోఁగొట్టవలెనని నావ్యాసమున మనవిచేసినాను. విద్యనేర్పెడివారికి నేర్చుకొనువారియెడ నొకవిధమగు ననిర్వచనీయవాత్సల్యభావముండవలయును. అది ప్రయోజనరహితమును అప్రయత్నసిద్ధమును. ఉపాధ్యాయుఁడును పితృసముఁడుగదా. విశేషించి తనజీవితమున కొకవెలుఁగునిచ్చెడియుపాధ్యాయుఁ డొకదృష్టిలోఁ దండ్రికంటెఁ బూజ్యుఁడు. కాన బాలబాలికలు దమతండ్రులకడఁజూపెడి చనువును బ్రియమును దతోధికముగ నుపాధ్యాయులకడనుజూపుట కవకాశముండును. దీని కుపాధ్యాయునకు వారియెడల దయగలిగి వర్తించుట, సుబోధకమగునట్లుచెప్పెడి నేర్పు గలిగియుండవలెను." —విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తి.

ఆంధ్రదేశగ్రంథాలయము:—

"ఆంధ్రగ్రంథాలయము పరిపూర్ణమైనది యొకటియును లేదు. ఆంధ్రసాహిత్యపరిషత్తువారి కాకినాడలోని గ్రంథాలయమును పరిశీలింతుమేని అందనేకముగ అసంఖ్యాకముగ తాళపత్రగ్రంథములును, లిఖితగ్రంథ

ములునుగలవు. అచట ఇతర ముద్రితగ్రంథములు అంతగ అవగా కేంద్రగ్రంథాలయముగ నుండదగినన్ని లేకున్నవి. కొంతవరకు ఆలోచించిన గౌతమీగ్రంథాలయము రాజమహేంద్రవరమును, రామమోహనగ్రంథాలయము (బెజవాడ)ను, హిందూ యువజనసంఘగ్రంథాలయము (ఏలూరు)ను, ఇంకను బాలసరస్వతీగ్రంథాలయమును, సారస్వతనికేతనమును ఆలోచనాధీనములుగ నుండవచ్చును. కాని, ఈపైగ్రంథాలయములన్నియు, ప్రాంతీయగ్రంథాలయములుగనుండు నుద్దేశముతోడనో, లేక స్థానికగ్రంథాలయములుగనుండు నుద్దేశముతోడనో యేర్పరుపబడియుండియుండుటచే వానిని ఆయామండల, లేక ప్రాంతీయగ్రంథాలయములుగ నేర్పరచిన సరిపోవునని అభిప్రాయపడుదును. ఇంక నేను మనవిచేయునదియేమనగా ఆంధ్రదేశగ్రంథాలయమను పేరిట నొకప్రత్యేకగ్రంథాలయమును ఆంధ్రదేశమునకంతకును కూడలిగనుండు బెజవాడపట్టణమున మహారాజుల పోషణమున, దేశోద్ధారకుని అధ్యక్షతను నిర్మాణమొనరించిన నత్యంతశోభాయమానముగ నుండగలదని ఆశింతును. ఈఆంధ్రదేశగ్రంథాలయమున ముద్రితాంధ్రగ్రంథములు ముఖ్యముగ నన్నియు సేకరింపఁబడి ఆదర్శప్రాయముగు నాంధ్రగ్రంథాలయముగ నేర్పరుపబడవలయును."

—పావిలాల గోపాలకృష్ణయ్య.

**ఆంధ్రస్త్రీలకు ప్రత్యేకకళాశాలకావాలి:—**

"మనఆంధ్రదేశంలో స్త్రీలకు ప్రత్యేకకళాశాల లేనేలేదు. ఎవరో శ్రీమంతులుతప్ప చెన్నపట్నంలో వుండే క్వీన్ మేరీకళాశాలకిపోలేరు. ఆంధ్రదేశంలోఉండే ప్రతికళాశాలలోను ఏఅయిదుగురో, ఆరుగురో విద్యార్థినులు ఉంటూనేఉన్నారు. ఆంధ్రస్త్రీలకు ప్రత్యేకముగ ఆంధ్రదేశమున నొకకళాశాలఉండుచో వీరందఱు నక్కడికిచేరగలుగుదురు. ఆంధ్రనారీమణులకందరికీ అందుబాటుగావుండేటట్లు స్త్రీల ప్రత్యేక కళాశాల ఏరాజమండ్రిలోనో నెలకొల్పితే చాలాదివ్యంగావుంటుంది. స్త్రీలకుయుక్తమైన గృహనిర్వహణం, లలితకళలకు ప్రాధాన్యమిస్తూ, ప్రొఫెసరు కార్వేగారుసూచించిన పద్ధతులమీదనడిపిస్తే యెంతో బాగుండును ఆకళాశాలను. ఇందుకొరకై పెద్దలగు నాసోదరీమణులు తగు ఆందోళనసల్పి మనకు ప్రత్యేకకళాశాల స్థాపింపబడేటట్లుచేస్తారని ఆశిస్తున్నాను. అచిరకాలంలోనే మనఆంధ్రదేశంలో స్త్రీలకు ప్రత్యేకకళాశాల భగవానునికృపచే నిర్మింపబడుగాక!

—ఇందుకూరి అన్నపూర్ణ.

**రామమోహనుడు మారుమనువుసిద్ధాంతియా?:—**

"ఎట్టిదుండగములనొనర్చుటకైనను వెనుదీయని పౌరోహితసాంప్రదాయము (Priestcraft) అభివృద్ధి గాంచుట దేశానర్థమునకు ప్రబలకారణము. ఈపవిత్రమైన భారతభూమి; మహాపవిత్రామతల్లులైన సీత, సావిత్రి, దమయంతి మొదలగు పరమసాధ్వీమణులకన్న ఈభారతమాత; ఝాన్సీ, రాణీసంయుక్త, పద్మిని మొదలైన వీరకాంతలగన్న ఈఆర్యావర్తము అధఃపతితమై బాల్యవివాహములచే జీవితములు నిరర్థకమైన బాలవితంతువులయొక్క అశ్రువులురాలి భగ్నమగుచుండ రామమోహనుడుదయించె. ఆకాలమున ఎచ్చటచూచినను వితంతువులరోదనమే. ఏమది! ముసలిపెనిమిటి చచ్చినంతనే నవయౌవనశోభకాంతులు గ్రక్కు నాతనిముద్దుభార్యను జలకమాడించి పిమ్మట శృంగారించి అటుపిమ్మట భక్ష్యభోజ్యములచే సంతృప్తి పరచి పాప మామెనుసలిపీనుగ తోడులేకపోలేదుగాబోలు! ఆతనివృద్ధశరీరముపై ఆలతాంగియొక్క కోమల శరీరము జంటచేసి తాళ్లతోబిగించి శవపేటిక బలాఢ్యులగు బ్రాహ్మణులభుజములపైకెక్కించి కాటికై పోగుచుండ పాపము! ఆచిగురుబోడిరోదనము, పట్టరానిదుఃఖము, హృదయావేదన మంతరింపజేయుటకో యన వేదపనసలు చిలుకలులాగ పలుకుచు ఏతెంచు ఆహా! ఆపౌరోహితబ్రాహ్మణుడే సార్థకుడు. ఆహా! ఏమిఆశ్చర్యము! పైదృశ్యముకాంచినపుడు ఏమానవునిహృదయము బ్రద్దలుకాకుండును? ఏమానవుడు కంపింపకుండగలడు? ఇట్టి దృశ్యములనేకములుచూచి భరింపజాలక హృదయము బ్రద్దలగుచుండ చిన్నతనముననే విశ్వర్యమునకు సలాము

చెప్పి తలిదండ్రులవిడనాడి కాశికేగి శాస్త్రాభ్యాసమొనర్చి ఈవనయౌవనవితంతువులదుఃఖ మంతరింపజేయ కంకణముగట్టుకొనియున్న రామమోహనుడు మారుమనువుసిద్ధాంతియా?" —చంద్రమౌళి సీతారామయ్య.

చిన్నారి పాప ముద్దు పల్కులు:—

"పాప శ్రీబాపినీడుగారి యేకైకపుత్రిక. జనని కీ. శే. శ్రీఅన్నపూర్ణాదేవిగారు. అయిదుసంవత్సరములప్రాయముగల్గిన వీరబాలికారత్నము. ఈచిన్నబాలిక తండ్రిగారి కేసువిచారణకు అమ్మమ్మగారైన శ్రీపిచ్చమ్మగారితో కలిసి వెళ్ళినది. ఆనాడే అనగా 16-11-31 తేదీనాడే తండ్రిగారు జైలుకువెళ్ళుదురని ఇంట్లో చెప్పుకొనుచుండుటచే ఈచిన్నబాలిక తాను చదువుకొనుచున్న శ్రీఅన్నపూర్ణాదేవిజాతీయబాలికావిద్యాలయములోని తోడిబాలికలచే తండ్రిగారికొరకు రెండుఖద్దరుదండలనుకట్టించి కూడా పట్టుకువచ్చినది. కేసు విచారణకుపూర్వమే తండ్రిగారి మెడలో దండలను వేయబోగా "అమ్మా! జైలుకువెళ్ళేటప్పుడు వేద్దువుగానిలే" అని అన్నారు. కేసు మరునటిదినమునకు వాయిదా వేయబడినది. ఆనాడు తండ్రిగారు నిద్రనుండి మేల్కొని బయటకువచ్చిన కొంతసేపటికి తానుగూడావచ్చి "నాన్నగారూ! ఇంకా జైలుకువెళ్ళలేదేమిటండీ" అని అన్నది. "ఈవేళ వెళ్ళతానులేతప్పకుండా" అని తండ్రిగారన్నారు. ఈనాడే కేసు తీర్పు చెప్పినారు. వీరికి ఆరునెలలశిక్ష బహూకరించినారు. మరునాడు 18-వ తేదీవుదయం 8 గంటలబండిలో రాజమండ్రి తీసుకు వెళ్లెదరని అధికారవర్గమువారు చెప్పినారు. కాని ఆనాడే ఆరున్నరగంటలబండిలో తీసుకువెళ్ళెదరనుసంగతి ధృఢపడినది. ఇప్పుడు చిన్నిపాప అమ్మమ్మగారితో తండ్రిగారికి శ్రీకృష్ణజన్మస్థానమునకుపలయు వస్తుసంగ్రహమునకు సహాయపడినది. తర్వాత అమ్మమ్మగారిసహాయమున, ఉచితసమయమునకు ఏలూరు రైలుస్టేషను వద్దకువచ్చినది. తండ్రిగారు స్టేషనుదగ్గరకు అప్పుడేవచ్చినారు. తండ్రికి మనపాప నమస్కరించి "నాన్నగారూ! నేనుగూడా మీతో రాజమండ్రంరావద్దా" అని అన్నది. తండ్రిగారు, తాతగారితోకలిసి రమ్మన్నారు. అల్లాగేఅన్నదిపాప. ఇంతలో బండికేక వేసినది. పాప నాన్నగారికిజై, రైతుసంగానికిజై, గాంధీకిజై అని అచ్చటగల ఇతరపౌరులతోకలిసి జయధ్వానముచేసినది. సాయంత్రము అమ్మమ్మగారితో ఇంటికి వచ్చినది. ఇప్పుడు ఆమెతో "అమ్మమ్మా! అమ్మమ్మా! ఈపోలీసాళ్ళు నాన్నని రేపు తీసుకువెళతామని ఈవేళే తీసుకెళ్ళారేమిటే?" అన్నది. ఈబాలిక గత ఉప్పుసత్యాగ్రహములో అమ్మమ్మగారితోపాటు జైలు బహుమతిపొందినది. ఈమె తండ్రిగారిని మిగుల హెచ్చరించినది." —వర్ధమాన విశ్వనాధరావు.

బాలికాపాఠశాలలు: నీతివిద్య:—

"నేటి బాలికాపాఠశాలలుయొక్క పెలబనులు చాలవఱకు ఉన్నతవిద్యనభ్యసించువారియొక్క విద్యావిధానము ననుసరించి వ్రాయబడియున్నవి. కాని సాధారణముగ స్త్రీలకు ప్రాథమికవిద్యతోనే వారివిద్యాభ్యాసము ముగియుచున్నది. అవయస్సులోపుననే వారిహృదయసీమల నేబీజములునాటుకొనునో నవియే చిరస్థాయిగనుండగలవు. ప్రాచీన హైందవనారీమణుల వీరచారిత్రములను, పౌరాణికస్త్రీల పాతివ్రత్యమహిమయు, ధైర్యసాహసాదిగుణములను వారికి కన్నులుగట్టినట్లుగా నేర్పు ఉపాధ్యాయుడే ఆదర్శకమయిన పంతులని చెప్పకతీరదు. అట్టి యొజ్జలు తమవిధిని సక్రమముగ నెరవేర్చుచున్నారనుటకు సందియములేదు. చిఱుతప్రాయమునమున్న బాలికలహృదయములు బహుకోమలములు; సత్యము, ధర్మము, ఔదార్యము, దానము, భూతదయ యిత్యాదివిషయములు వారలు శైశవముననే నేర్పవలసియున్నది. ఇటులచేసినయెడల నేటిబాలికలు ముమ్ముందుగ గృహిణులై మాత జిజాభాయినిబోలె తమ సంతానమునకు నీతిచరిత్రలు బోధించుదురనుట సత్యదూరముకాదు." —తల్లాప్రగడ వేంకటేశ్వర రావు.




## రెండుతలలగేదెదూడ:—

పూనాలో ఒక పాలవానిగేదె ఈనెను. దూడకు మెడ ఒకటియేగాని రెండుతలలు, నాలుగుకన్నులు ఉండెను. పుట్టిన మూడుగంటలవఱకు మాత్రము ఈవింతదూడ బ్రతికియుండెను.

## ప్రపంచమున ప్రథమదినపత్రిక:—

**'The Daily Courant'** అనునది ప్రపంచమున ప్రథమదినపత్రిక. దాని ప్రథమసంచిక 1705-వ సంవత్సరము మార్చి 11-వ తేదీని వెలువడినది. ఇది ఉదయమున ప్రచురింపబడినది. సాయంకాలము ప్రచురింపబడు దినపత్రికలలో మొదటిది **'The Evening Post'** అనునది. దీని ప్రచురణ ప్రారంభము 1721-వ సంవత్సరమున. అయితే ఇది ఇప్పుడు ప్రచురింపబడుటలేదు. చిరకాలముక్రితము ప్రారంభింపబడి ఇప్పుడును ప్రచురింపబడుచున్న దినపత్రిక **'The Morning Post'** అనునది. ఇది 1772-వ సంవత్సరమున ఆరంభముచేయబడినది. ప్రపంచమునందలి వార్తాపత్రికలలో మొదటిది **'The weekly News'** అనునది. దాని ప్రారంభము 1622-వ సంవత్సరము ఆగష్టు 2-వ తేదీని. నాథానియల్ బట్టర్సు అనువాడు దానికి ప్రచురణకర్తయు, సంపాదకుడునైయుండెను. తొలిసంచికలో స్వవిషయమున ఆతడు దైవసాహాయ్యమున దీనిని నిర్వహింపగలుగుదునని నమ్ముచున్నాను అని వ్రాసియున్నాడు.

## నూటపదునొకండు సంవత్సరముల స్త్రీ:—

ఐర్లండులో క్యాథరైనుప్లంకెట్టు అనునామె నూటపదునొకండు సంవత్సరముల వయస్సునిండినది. ఆమెకు నవంబరు 22-వ తేదిని నూటపదునొకండు వత్సరములు నిండినవి. ఈసంవత్సరమున ఆమెకు ఎన్నడును జలుబైనచేయలేదు. సంపూర్ణారోగ్యవతివలెనే భుజించెను. ఈమె కండ్లయెదుట అయిదుగురురాజులు పాలించిరి. సుప్రసిద్ధనవలాకారులగు సర్ వాల్టరుస్కాటుగారు ఈమెకు ఒకప్పుడు చికిత్సకులుగనుండిరి.

## ఒకేకానుపున నలుగురు బిడ్డలు:—

తణుకులో నవంబరు 26-వ తేదీని నొక ఉన్నతబ్రాహ్మణకుటుంబమునకు చెందిన స్త్రీ ఒకేకాన్పున నలుగురు పిల్లలనుకనెను. అందు ఇద్దరు మగబిడ్డలు, ఇద్దరుఆడుబిడ్డలు. పిల్లలు సరిగా నెదిగియుండిరి. అందులో నొక బాలుడు జన్మించిన కొద్దినిమిషములకే చనిపోయెను. మిగిలిన ముగ్గురుపిల్లలును జీవించియున్నారు.

*

* *

పశ్చిమగోదావరిజిల్లా తాడేపల్లి గూడెం తాలూకా తహశీల్ దారు శ్రీ ఇంటూరి కోటయ్య నాయుడుగారి యేకపుత్రిక. వయస్సు 17 సంవత్సరములు. ఆంధ్ర, ఆంగ్ల, సంస్కృత, హిందీ భాషాపరిచయముగలది. వీణావాదనమున, ఫిడేలు వాయిద్యమున, సమర్థురాలు. వివాహమునకు సంబంధముకుదిర్చిరి. కాని ఇంతలో మరణదేవత కబళించివైచినది.

* *

*



కీ. శే. ఇంటూరి బాలసరస్వతి కన్య

*

* *

వ్యాసకర్త్రి, విదుషి, సంఘసంస్కర్త్రి అగు ఈకీర్తిశేషురాలినిగూర్చి సంపాదకీయ వ్యాసమున విస్తరించి వ్రాసియున్నారము.

* *

*



కీ. శే. దరిశి అన్నపూర్ణమ్మ

*

* *

కృష్ణామండలమునందలి తిరువూరు తాలూకా వినగడప ఈమె జనకస్థానము. జననము సాధారణ సంవత్సరము. పదియవమాసముననే మాతాపితృవియోగము కలిగిన అనాథబాలిక. పెంచుటకే ఆలంబము లేని ఆమెకు విద్యావైశద్యమునుగూర్చి ఎవ్వరు శ్రద్ధ చేయగలరు? కొలదిగ చదువను వ్రాయను మాత్ర మలవరచుకొన్నది. ఎట్లో నిమ్నోన్నత జీవిత పథాంతరముల నధిగమించినది. తమ కవితా సామర్థ్యముచే రసలోకమున శాహాటవిహార మొనర్చుచున్నవారును, సారస్వత చంద్రికా గ్రంథమాల సంపాదకులును అగు శ్రీ ఊటుకూరు సత్యనారాయణ రావుగారిని చేపట్టినది. భర్తృసేవలో నియుక్తయైనది. సంస్కారము నెఱుంగకున్నను సర్వసమత్వభావమును, ప్రశాంతముగ్ధమైన శీలమును ఈమెకెట్లో అలవడినవి. అవి ప్రకృతిచే తనే సిద్ధించినట్లున్నవి. పతిసేవలోనే ఆర్యపురంధ్రులకు తరణోపాయమున్నదని ఈమె నమ్ముచుండెను. తన సేవాతృష్ణదీరకమునుపే ఆకస్మికముగ నాలుగురోజుల శిశువును ఆనాటి శరత్కాలపు లేత వెన్నెల కొప్పగించి శుక్లసంవత్సరము ఆశ్వయుజ శుద్ధనవమినాడు ఈమె జీవితము చాలించినది. ఈమె భర్తగారు తాము రచించిన రఘునాథ్ అను నాటకమును ఈమెకు కృతి యర్పించిరి. ఈమె జీవితకాలములోనే గ్రంథము సమాప్తియైనది. కాని సమత్సరములో కృతిసమర్పణము చేయబడలేదు. ఈమె మరణానంతర మాగ్రంథమచ్చొత్తింపబడినది. పాంచభౌతికమగు ఈమె ఆకృతి ఇప్పుడు కానము. కాని ఆమెకీర్తి కాయము అక్షరరూపమున నిలిచియుండుటకు ఈ నాటకము చాలియున్నది. కవితాత్మగల పతినిబడసిన ఈయమ ధన్య. తన గ్రంథమును పత్నీపూజకు వినియోగించిన ఈ నాటకకర్త ధన్యుడు. ఒక ఆంగ్ల కవిచెప్పినట్లు కవుల భార్యలు పతులు బాగుండగ చనిపోవుటచే పతుల యనంతరముకూడ జీవించియుందురు. ఏమన వారు వారి కవితావస్తువులై చిరంజీవిత్వమును బడయుటవలన. ఆంధ్ర వాఙ్మయ చరిత్రకారులు శ్రీ వంగూరి సుబ్బారావుగారును తమ అమూల్యగ్రంథమును పత్నీపూజకై వినియోగించియున్నారు. నిదర్శనములు చూప దొరకొన్నచో అనంతము. ప్రకృత గ్రంథమున కృతిసమర్పణము హృదయమును కలంచు-ప్రేమమహిమను తెలుపు ఈ చక్కని తేటగీతియందు చేయబడినది.

"ఇది యనంత మపూర్వ మీహృదయలోక
మహితసామ్రాజ్యమున పట్టమహిషియౌట
కానుకగపూచినట్టి ఈకావ్యకుసుమ
మాప్రణయమూర్తి దివ్యపాదాంకితమ్ము."



కీర్తిశేషురాలు

శ్రీమతి ఊటుకూరు వేంకటరామమ్మ

### దత్తాత్రేయ అవతారమువంటి శిశువు:—

హానగల్లుగ్రామమున నవంబరు 28-వ తేదీని ఒకస్త్రీ ప్రసవించెను. మగబిడ్డ. అయితే అతనిస్వరూపము విపరీతముగనుండెను. తలలురెండు, నేత్రములునాలుగు. కాళ్ళుమాత్రముకెండే. శరీరముయొక్క కుడిప్రక్కను ఒకదళమైన మాంసపుకండ యుండెను. జన్మించునరికి ఈవింతశిశువు ఆరోగ్యముగానేయుండెను. కాని పుట్టిన మరునాడే మరణించెను.

### కాన్పూరునందు పాములు ఎగురుట:—

కాన్పూరులో గ్వాల్‌టోలి (Gwaltoli) యందు ఎగురుచున్నపాము కనబడెనట. అది ఎగురుచు మనుష్యులనుకరచి మాయమైనది. పెక్కుమంది జనులను జంతువులను కరచుటవలన ఎవరును ఆమార్గమున నడచుటలేదు. ఇంతవరకు ఎవరును పాములు ఎగురుచుండుట చూచియుండలేదు. 1909-వ సంవత్సరమున రంగూనునందు గాంచిన విచిత్రమువకంటె యిది మిగుల ఆశ్చర్యకరమైనది. ఒకసారి పెద్దవర్షము కురిసి ఆగిన పిమ్మట పదినిమిషములు ఎడతెరపి లేక బర్మాముఖ్యపట్టణమంతయు సురపువెండ్రుకలు రాలినవి. ఈవిచిత్ర సంఘటనమునకు కారణము ఎవరును ఊహింపలేకపోయిరి. కాని యిది యదార్థముగ సంభవించెనని తెలియ జేయబడినది.

### ట్రాముకారునందు పంకాలు ఏర్పరచుట:—

కలకత్తాట్రామ్‌వేకంపెనీవారు, ట్రామ్‌కారు నిర్మాణమునందు కొన్ని క్రొత్తమార్పులను కనిపెట్టి ప్రయాణీకులకు పెక్కు సదుపాయములు కలుగజేసిరి. ఆకర్షణీయమగు తెలుపుగోధుమ రంగులలో యీక్రొత్త కారును అలంకరించిరి. సాధారణమగు ట్రామ్‌కారులవలె ఎలక్ట్రిక్ కరెంటు గలతీగ (Trailer) సహాయము దీనికి అవసరములేదు. దీనిలో 1, 2 తరగతులు ఏర్పాటుజేసిరి. మధ్యన ఒకపెద్దగేటు గలదు. రెండవ తరగతియందు కంటె మొదటితరగతిప్రయాణీకులకు ఎక్కువ సౌకర్యములు కలుగజేసిరి. కప్పునకు ఒకపెద్ద పంకా అమర్చబడినది. కూర్చొనుటకు బల్లలు కుషనులతో తయారుచేయబడి పైకి ఎత్తుటకు వీలుగనున్నవి. కారులోనికి ఎక్కుటకు మెట్టు (Foot-Board) ఎక్కువ వెడల్పుగలిగి మిగిలిన వాటికంటె భూమిపై క్రిందికి అమర్చబడినది. ఈక్రొత్తట్రామ్‌కారులు రెండు, కలకత్తాలో కాళీఘాట్ వద్దను, షామ్‌బజారువద్దనుయున్నవి. కొలదికాలముననే నూత్న సౌకర్యములతో కనిపెట్టబడిన కారులు వృద్ధియగునని తెలియుచున్నది.

### రక్తవర్షము:—

నిజాముఇలాకా నల్లగొండతాలూకాలోచేరిన బండపాలెము దేవాలయముగుట్టవద్ద డిసెంబరు 14-వ తేదీని రక్తవర్షముకురిసెను. —గోలకొండ.

### వింతయిటుకలు:—

నిజాము రాష్ట్రమునందలి రామప్పగుడులశిఖరములు వింతయిటుకలతో నిర్మింపబడినవి. అవి మిగుల దృఢముగానేయుండునుకాని కొంచము తేలికగానుండును. ఇటుకలలో సన్ననిపొరలున్నటుల గోచరించును. ఈయిటుకలు నీటిలోవేసినచో తేలుట మేము స్వయముగాజూచియున్నారము. ఆంధ్రుల యద్భుతశిల్పమున కును, వస్తుతత్త్వవిజ్ఞానమునకును సాధనములగు ఈయిటుకరాళ్లను ఏరసాయనశాస్త్రజ్ఞుడేని పరిశోధించి మిశ్రితవస్తువులనెతింగినచో నిట్టియిటుకలుచేసి నీటిపైతేలుభవనము నిర్మింపవచ్చును. (గోలకొండ)

—శేషాద్రిరమణకవులు.

# డైరి

## నవంబరు

20:—జగబంధుదేవు అనువతడు నవకాలీకలెక్టరుకచ్చేరీలో నవుకరు. అతడు మరణించెను. భర్తృవియోగార్తయై అతనిభార్య భర్తశవమును విడనాడక విలవిలవిలపించెను. ఏడ్చుచుండిన ఆసతి యరగంటలో తన ప్రాణములను భర్తశవమువద్దనే విడిచెను. అపుణ్యాంగనను చూచుటకై చుట్టుప్రక్కల గ్రామములనుండి ప్రజలువచ్చిరి. సతీపతుల శరీరము లొక్కచితిమీదనే దహనముచేయబడెను.

:—నైజామురాష్ట్రమహిళల విద్యాభివర్ధకసభ బషీరుబాగులో సమావేశమైనది. లేడీ అమాన్ జాగారు అధ్యక్షతవహించిరి.

21:—గుంటూరులో ఆంధ్రమహిళాసభ సమావేశమైనది. శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవిగారు అధ్యక్షురాలు. శ్రీమతి డాక్టరు పి. హెచ్. దానమ్మగారు ఆహ్వానసంఘాధ్యక్షురాలు.

22:—ఏలూరులో పురమందిరమున రీసెటిల్మెంటుఆందోళనసందర్భమున సాగింపబడుచున్న నిర్బంధవిధానమును ఖండించుటకు జరిగిన సభలో శ్రీమతి మూల్పూరి చుక్కమ్మగారు ఉపన్యసించిరి.

23:—కర్నూలులో మునిసిపలుఎన్నికల సందర్భమున యం. వేణుగోపాలనాయుడుగారి భార్యయగు గజలక్ష్మమ్మగారు డిప్యూటీకలక్టరుగారిదగ్గర కేసుపెట్టిరి. 4-12-31 తేదీకి వాయిదావేయబడెను.

:—రాజపుతానా రాజకీయమహాసభ మూడవసమావేశము పుష్కరనగరమున శ్రీమతి కస్తూరిబాయిగాంధిగారి అధ్యక్షతను సమావేశమయ్యెను.

24:—శ్రీమతులు గంపా శివకాంతమ్మ, పాకల సౌభాగ్యవతమ్మగార్లు బరంపురం మునిసిపలుసంఘసభ్యురాండ్రుగా ఎన్నుకొనబడిరి.

25:—శ్రీమతులు ఉన్నవ లక్ష్మీబాయమ్మ, గుంటూరు ఏకా రత్నమ్మగార్లు మ్యునిసిపలుసంఘసభ్యులుగా ఎన్నుకొనబడిరి.

26:—శ్రీమతి తంగిరాల సీతమ్మగారు స్వతంత్రపక్షపుఅభ్యర్థిని బందరుమునిసిపలుసంఘమునకు ఎన్నుకొనబడిరి.

:—తణుకులో శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారి యాజమాన్యమున జరిగిన స్త్రీలసభలో శ్రీ చెరుకువాడ వేంకటనరసింహముగారు స్వరాజ్యము: స్త్రీలధర్మమును గురించి ఉపన్యసించిరి.

27:—

28:—పెషావరులో జిల్లామేజిస్ట్రేటు 'పట్టణములో పడుపుటిండ్లను పికెటింగుచేయుట అక్రమముగాన కార్యము మానవలసిన'దని ఆజ్ఞచేసినాడు.

:—శ్రీమతి దరిశి అన్నపూర్ణమ్మగారు పరమపదించిరి.

29:—మద్రాసునందు పచ్చయప్ప కళాశాలభవనమున నింబకర్‌సతి శ్రీమతి కృష్ణాబాయిగారు సత్యాగ్రహోద్యమతత్త్వమును గూర్చి ఉపన్యసించిరి.

30:—కలకత్తాలో పోలీసుకోర్టులలో వాదించుటకు శ్రీమతి రాఖేల్ ఆష్కెంజీయను నామె న్యాయవాదినిగానుండుటకు అంగీకరింపబడెను. కలకత్తాలో నీమె ప్రథమస్త్రీన్యాయవాది. మేజిస్ట్రేటుగారామెనభినందించిరి.

## డిసెంబరు

1:—శ్రీమతి కమలాదేవి చట్టోపాధ్యాయ కుమారిసోఫియాసోబ్జిగార్లు కోయంబత్తూరునుండి చెన్నపురికి విచ్చేసిరి. చెన్నపురి స్త్రీస్వదేశీసంఘము యాజమాన్యమున సభజరిపిరి.

2:—డా. వి.యస్. రామ్, ఎం.ఏ.పి.హెచ్. డి.ఎఫ్.ఆర్.హెచ్.ఎస్. (లక్నో) గారు తమ మరణించిన భార్యయొక్క సంస్మరణార్థము శ్రీమతి వంగల వనలతాదేవిస్మారకబహుమతి అనుపేరుతో నొక బహుమతిని నెలకొలుపుటకుగాను రు. 1,200 ఆంధ్రవిశ్వవిద్యాలయమువారికిచ్చిరి.

:—శ్రీమతి గుడిసేవ కామాక్షమ్మగారు బందరులో మరణించిరి.

3:—అన్నపూర్ణవ్యాసరచనమునం దాంధ్రదేశమున ప్రథమబహుమతినందిన కవయిత్రియగు శ్రీమతి గాదె కనకవల్లిగారికి బహుమానముగా శ్రీయుత బొల్లారెడ్డి కోటిరెడ్డిగారు రు. 50 ల విలువగల బంగారు పతకమునొసంగిరి.

4:—తర్కీలో పతీమాఅనునామె ఒక గ్రామస్థురాలి భర్తసొమ్మునుహరించుటకు అతనిభార్యను చంపెనని ఆమెకు మరణశిక్షనువిధించిరి. అంగోర పార్లమెంటువారు దీనిని ధ్రువపరచిరి. తర్కీలో స్త్రీని ఉరిదీయుట కిదే ప్రథమము.

5:—మహారాష్ట్రమహిళాసభ పూనానగరమునగూడెను.

6:—మదరాసుజిల్లా ఆంధ్రకాంగ్రెసుసంఘయాజమాన్యమున మహారాణి ఝాన్సి లక్ష్మీబాయిగారి ఛాయాపటమును శ్రీమతి రుక్మిణిలక్ష్మీపతిగారిచే 27, కందప్పశెట్టివీధియందుండు ఆంధ్రవాలంటీరు శిబిరమునందు బహిర్గతమొనర్చబడెను.

7:—నెల్లూరులో వకీలు పార్థసారధిఅయ్యంగారిపై అయనభార్య కేసుతెచ్చెను. ఆమెపేరు సుందరవల్లి. ఆమెకథఇది. ఆరేండ్లక్రిందట వివాహమాయెను. ఐదేండ్లక్రిందట కాపురమునకువచ్చెను. తండ్రి ఫారెస్టురేంజరు. చాలాకారణములచేత తాను చాలాకాలము తండ్రిఇంటిలోనే వసించుచుండెను. ఇరువదిరోజులక్రిందట తండ్రి తననుకొనివచ్చి భర్తయింటిలో వదలిపోయెను. డిసెంబరు 4-వ తేది తనభర్త, మఱదలు, మామ తన్ను చేతులుకాళ్లువిరిచిపట్టుకొనగా ప్లీడరుగుమస్తా తనతొడలపై తొమ్మిది వాతలువేసెను. ఆరు వాత లొకతొడమీద, మరిమూడువాత లింకొకతొడమీదనూ. నేటిఉదయం మఱదలు కాఫీతీసుకొనివచ్చియిచ్చెను. ఇది తనకు ఆయింట్లోఅపూర్వము. ఆకాఫీత్రాగగానే వమనం ప్రారంభమాయెను. కూడనే అతిసారము, తలతిరుగుడు. ఎట్లో తంటాలుపడి దూరబంధువైన మాడభూషి నరసింహాచార్యులుగారికిన్ని, పోలీస్ సబ్ఇన్స్పెక్టరునకు రెండుజాబులువ్రాసి పంపగల్గెను. పోలీసులువచ్చి కేసుపెట్టిరి. తొడలు కాలిపోయి వ్రణమయియుండెను. ఆమెకడుపులో వస్తువు శాస్త్రపరీక్షకై రసాయనశాస్త్రజ్ఞునకు పంపబడినది. పైజెప్పిన నల్గురిని పోలీసులు అరెస్టుచేసినారు.

8:—కాకినాడ ఆంధ్రబాలవితంతుశరణాలయమున శేషమ్మకును, కాకర్లపల్లి కృష్ణారావుగారికిని వివాహము జరిగెను.

9:—మైసూరు శాసనసభలో స్త్రీలవారసత్వపు హక్కులచట్టము సెలెక్టుకమిటీకి పంపబడెను.

10:—స్టాక్హోం వాస్తవ్యురాలగు డాక్టరు ఫ్రూఆనీగారు భారతదేశపుటార్థికసాంఘికపరిస్థితులను పరిశీలించుటకువచ్చి చెన్నపురిచేరిరి.

11:—రాజమహేంద్రవరమున ఆంధ్రస్త్రీపునర్వివాహోద్యమపంచాశద్వార్షికోత్సవము రావుబహద్దూర్ తుంపూడి భగవంతంగుప్త బి.ఏ. బి.యల్ గారి అధ్యక్షతను జరుపబడెను.

12:—ఆంధ్రరాష్ట్రీయ హిందూస్థానీ సేవాదళ ముతరఫున బొంబాయిలో శిక్షణమునందుటకు శ్రీమతి దుర్గా బాయమ్మ, రంగనాయకమ్మగార్లు బయలుదేరి వెళ్ళిరి.

13:—రంగూను మునిసిపలుసంఘములో డాక్టరు డాసాసా క్రైస్తవసభ్యురాలుగా నియోగింపబడెను.

14:—త్రిపురజిల్లా మేజిస్ట్రేటు జి.పి. బి. స్టీవెన్సును బంగాళాస్త్రీ లిరువురు కాల్చి చంపిరనువార్త ప్రకటింపబడెను.

15:—హిందూస్థానీ సేవాదళస్త్రీశిబిరము బొంబాయిలో ప్రారంభమయ్యెను.

:—గతశాసనోల్లంఘనోద్యమమునందు ఆంధ్రరాష్ట్రమున జయిలుకుపోయిన స్త్రీలు 67గురు అని ప్రకటింపబడినది.

:—ఉల్టాడంగాదోపిడి కేసును విచారించుచున్న అలిపూరు స్పెషలుట్రిబ్యూనలువారు నిందితులలో నొకరైన విమలప్రతిభాదేవిగారిని అనుమానావకాశముంబట్టి విముక్తినొసగిరి.

16:—శ్రీ వెల్లింగ్డన్ ప్రభ్వి కలకత్తాలో ప్రెసిడెన్సీజనరలుఆసుపత్రిని దర్శించెను.

17:—మద్రాసు యువకసంఘమువారిసహాయార్థము మద్రాసు మ్యూజియముథియేటరునందు శాంతినికేతనములో డా. రవీంద్రనాథటాగూరుగారి శిష్యురాలు శ్రీమతి హత్తీసింగుగారు భారతనృత్యగానప్రదర్శనముగావించిరి.

:—కాకినాడ మ్యునిసిపలుసంఘమునకు శ్రీమతి కమలాదేవి, శ్రీమతి వి. పాపాయమ్మగార్లు ఎన్నుకొనబడిరి.

18:—కేపుటవునులో జరుగనున్నసభలో పాల్గొనుటకు శ్రీమతి సరోజనీదేవి, శ్రీనివాసశాస్త్రిగార్లు లండను నుండి బయలుదేరిరి.

19:—

# పత్రికాపరిచయము

## గ్రామపరిపాలనః—

గ్రామోద్యోగీయపక్షపత్రిక. సంపాదకుడు దుద్దుకూరు శ్రీకృష్ణమూర్తిగారు. చిరునామా: మారీసుపేట, తెనాలి, గుంటూరుజిల్లా. గ్రామోద్యోగీయులఆశయములను వెల్లడించునది. సాలుచందా రు 3-0-0. కరణము, మునసబులకు బాగుగ నుపయోగించును. రాజ్యాంగమునకు గ్రామము పునాది. ఇది ఆగ్రామ పరిపాలకులకుసంబంధించిన పత్రికయనుటచే దీని ఆవశ్యకత బోధపడగలదు. చిరము వర్థిల్లుగాక!

## వైద్యకళః—

సచిత్రమాసపత్రిక. హైదరాబాదువైద్యసంఘమువారిచే ప్రకటింపబడునది. సంపాదకులు యం. అనంతరంగాచార్యులుగారు. మాపత్రికాపీఠమలంకరించుచున్న అక్టోబరుమాసపు సంచిక ప్రథమసంపుటపు ప్రథమ సంచిక. నైజామురాష్ట్రమునందలి ఆంధ్రప్రాంతములందు ఆరోగ్యవైద్యశాస్త్రప్రచారముకావించుట కీపత్రిక ఉద్దిష్టమైనది. ఈసంచికయందు ఆరోగ్యము, ఆహారము, ఓషధీభాగము, శారీరము, వ్యాధివిమర్శనము, అనుభవయోగదీపిక, రసయోగవిమర్శనము, శాస్త్రవిషయభాగము అనుశీర్షికలక్రింద అనేకవిషయములు చేర్చబడినవి. వైద్యకళాభిమానులు అవశ్యము ఆదరింపదగుపత్రిక. వార్షికమూల్యము రు. 3-0-0 విడిపత్రిక రు. 0-6-0 డెమ్మీసైజున ప్రచురింపబడుచున్నది. చిరునామా వైద్యకళ ఆఫీసు, పత్తర్‌ఘట్టి, హైదరాబాదు.




స్థానభ్రష్టము కాదు, స్వరూపనాశనమే:—

ఆంధ్రవిశ్వవిద్యాలయముపుట్టినది. తోడనే మెట్కాఫుఋుషి తపస్సుచేసి గౌతమీతీరమున వెలిగించిన రాజమహేంద్రవరకళాశాలయను అఖండజ్యోతికి స్థానభ్రష్టభయముపట్టినది. ఆస్థానభ్రష్టభయ మింకఉండజాలదు. ఆఅఖండజ్యోతియే ఆర్పివేయబడుచున్నది. మన్నారుగుడి కళాశాలలో బి.య్యే. తరగతులువిరమింప అంగీకరింపబడిన స్వల్పకారణమున కుంభకోణము కళాశాలనుంచుటకు నిర్ణయింపబడినది. ఉత్తరసర్కారులకంతటికిని, ఆంధ్రవిశ్వవిద్యాలయ పుటావరణమంతటికిని ఇదియొక్కటియే ప్రభుత్వకళాశాలయగుటయను పెద్దకారణముకూడ రాజమండ్రికళాశాలను నిలబెట్టజాలకపోవుచున్నది. కారణమేమి? కుంభకోణము అరవవాడిది. రాజమండ్రి తెలుగువాడిది. ఆంధ్రమహాశయుడు ప్రధానామాత్యుడై యుండగా తెలుగువారికీయన్యాయముజరుగనుండుట మఱియు శోచనీయముగనున్నది. అరవదేశమున విద్యాలయముల తగ్గింపులు కొన్నికొన్నితరగతులు ఎత్తివేతమాత్రమే. కాలముమారిన తోడనే నోరుగలఅరవవాడు వానిని పునరుద్ధరించుకొనగలడు. తెలుగుదేశమున విద్యాలయములతగ్గింపులు కళాశాలస్వరూపనాశనము. కాలముమారినను స్వరూపమే లేనపుడు దానికిపోయిన మెఱుగులు తిరిగిపొందు ఆందోళనచేయుట జోలిలేనిముష్టియగునుగదా? 'మేము విశ్వవిద్యాలయము తెచ్చుకొంటిమి, రాష్ట్రమురానున్నది' అని అతిశయముగపలుకు ఆంధ్రమహాశయులీఉన్న సౌకర్యము ఊడిపోవుచుండగ నిద్రింపజాలరని నమ్ముచున్నాను. తనచే ఆంధ్రులకొఱకు ప్రతిష్ఠితమైన ఈకళాశాలకు ప్రబోధితమైనఆంధ్రశక్తి ఆయువుపోయగలుగుగాకయని మెట్కాఫుఋుషిఆత్మ అంతరాళమునుండి ఆశీర్వదించుచున్నది.

విశాఖపట్టణము ఇంజనీరింగుపాఠశాల:—

మద్రాసురాజధానియందు ఇంజనీరింగుశాఖలోని ఉద్యోగములలో విశేషభాగము అరవవారిహస్తములయందేయున్నవి. క్రొత్తగనియమింపబడుచున్న ఉద్యోగములందును వారి ప్రాబల్యముతగ్గలేదు. వలయుచో లెక్కలుచూపగలము. గిండీ ఇంజనీరింగుపాఠ

శాలలో తెలుగువానికి సీటుదొరుకుట బహుదుస్తరము. ఈసంవత్సరము మార్చిమాసమున విశాఖపట్టణమునందలి ఇంజనీరింగుపాఠశాల ఎత్తివేరుదురు. ఆలోచించినచో ఇందుమూల మున ఇంజనీరింగుశాఖఉద్యోగములకు ఆంధ్రులు దూరముచేయబడినట్లగదా? రాష్ట్రాదాయ ములో సగమునకుపైగాకూర్చుచున్న ఆంధ్రులుపొందు సౌకర్యములు కట్టుబాటుగానివిగా నున్నవి. ఆంధ్రుడా! నీదేశమునందలి ఇంజనీరింగుపాఠశాల యెత్తివేయబడవలసినదేనా?

**పశ్చిమగోదావరికృష్ణాజిల్లాలసమ్మేళనము:—**

కృష్ణాజిల్లానుండి విడివడినతరువాత పశ్చిమగోదావరియందు ప్రజాసౌకర్యములు హెంపొందింపబడినవనుటకు పశ్చిమగోదావరిజిల్లాబోర్డుపరిపాలనమొకటి ప్రబలనిదర్శనము. వైశాల్యము ఎంతతక్కువగనున్న పరిపాలన అంత దీక్షతోను, పరిశీలనతోను చేయుటకు అనువుగనుండును. తిరిగి ఈజిల్లాను కృష్ణాజిల్లాతో కలిపిన పరిపాలనాసౌకర్యములు కొన్ని తగ్గును. వానితోబాటు ప్రజాసౌకర్యములును తగ్గగలవు. జిల్లాప్రధానస్థానము మాఱు మూలయగును. అనవసరమును, బొంబాయిరాష్ట్రమువారు విరమించినదియునగు గవర్నరు గారి వేసవియాత్రను విరమింప సిఫారసుచేయజాలని మద్రాసుక్రొంచిమెంటుకమిటీవారు ఇట్టివిషయములందు ప్రజాసౌకర్యమును గమనింపకుండుట వింతగాదు.

**అనంతపురమండలము ఎత్తివేయబడును:—**

రాయలసీమ అన్నపూర్ణఅనదగిన అనంతపురము తిలకనగరముగాగల మండలముపై రిట్రెంచిమెంటుగొడ్డలినివైచి దానిని శకలములుగాచేసి ఆశకలములను సరిహద్దుమండలము లకు తలయొకటి తగిలించుప్రయత్నములు సాగుచున్నవి. జిల్లాకచ్చేరీలకూడలిచే పరిపుష్టము నొంది వీని శోభకుతోడు ప్రభుత్వమువారికళాశాలతో ఆపురము ఉన్నతోద్యోగుల నివాస భూమియై, విద్యానిలయమై వెలయుచు రాయలసీమకీర్తికి బావుటాయైయున్నది. జిల్లాకచ్చేరీల పోకచే ఆపురశోభ తొలగుటయేకాదు. ఆమండలవాసులు విభాగింపబడిఐక్యత గోలుపోవు దురు. ఉత్తరాంధ్రదేశమున కాలేజీని అసలేఎత్తివేయతలపెట్టియు, పశ్చిమాంధ్రమున కాలేజి గల పట్టణశోభను మూలముట్టుముగ తొలగించుటకు కచ్చేరీలనెత్తివేయతలపెట్టియు మదరాసుప్రభుత్వమువారు ఆంధ్రులకు మఱువరాని అన్యాయమొనర్చినవారగుచున్నారు.

**శ్రీమతి సుబ్బరాయనుసతిధైర్యము:—**

భారతదేశమునుండి లండనుకు రౌండుటేబిలుసభకు ప్రతినిధులుగాబోయిన ముప్పురు స్త్రీలలో శ్రీమతి షానవాజుగారు డిసెంబరు మొదటివారముననే ఇండియాకు తిరిగివచ్చిరి. శ్రీమతి సరోజనీదేవిగారు కేపుటవునుకు పోయియుండిరి. ఇక మిగిలినవారు శ్రీమతి సుబ్బ రాయనుసతిగారొక్కరే. వీరు మఱియొక విషయముచేగూడ షానవాజు, సరోజనీదేవిగార్లను మిగిలినవారగుచున్నారు. ఒక్క ఈస్త్రీలనుమాత్రమే మిగిలినవారగుచున్నారననేల? ప్రతి నిధులుగాపోయిన పురుషులనందఱినికూడ వారు మిగిలినవారగుచున్నారు. కొందఱు ప్రతి

నిధులవలె ఆమె ఓడపై నెక్కరాలేదు. మఱికొందఱు ప్రతినిధులవలె ఆమె కొంతదూరము ఓడమీఁద, కొంతదూరము రైలుమీఁద నెక్కరాలేదు. ఇంగ్లండునుండి భారతదేశమునకు ఆఱువేల మైళ్ళదూరమును ఆమె గాలిమోడపై ప్రయాణించినది. క్రాయిడన్ కరాచీనడుమ గాలిమోడపై ప్రయాణముసలిపిన భారతరమణులలో సుబ్బరాయనుసతి మొదటియామె యనుకొందుము.

**ఆంధ్రోత్కళ సమస్య:—**

ఇది ఇప్పుడు తీవ్రరూపమును దాల్చినది. న్యాయముగా ఆంధ్రులవై యుండవలసిన భాగములు ఉత్కళములో ఉటంకింపబడునేమో యనుభయము కలుగుచున్నది. సరిహద్దు విచారణసంఘసభ్యులు ఆంధ్రులకు ప్రత్యక్షవిరోధములగు వాక్యములను విచారణావసరమున వదలియున్నారు. ఆసభ్యులు ఉత్కళజమీందారుల పెంపుడుగున్నలై వారు తమ్మి నప్పుడు చిరంజీవయనియును, వారు ఆవులించినప్పుడు చిటికలువైచియును ఒడలుమఱచిమెలగిరి. దీనిని ఉపబలముగచేసికొని ఉత్కళులు కొంచము చేతిదురుసుతనమునకును పాల్పడియున్నారని వినుచున్నాము. బరంపురమువ్యునిసిపలుసంఘాధ్యక్షులగు ఆంధ్రమహాశయులు, రావుసాహేబు బిరుదాంచితులు, రామలింగముగారి కోటు రైలు ప్లాటుఫారముమీఁద చింపివైచినారు అనగా ఇక పేర్కొననేల? శ్రీయుత గండికోట సత్యనారాయణమూర్తి మొదలగు ఆంధ్రభక్తులు తెలుగునునిలుపుటకు తీవ్రతరప్రయత్నములు సాగించి దేశారాధనము సల్పుచుండగా మఱికొందఱు-జాతికి ఆంధ్రులేకాని పదవులబడసిన ఉద్యోగజాడ్యముచే ఉత్కళభక్తులు కాకతప్పనివారు-తాటస్థ్యమువహింపక ఆంధ్రజాతికి ద్రోహముచేయు సాక్ష్యమిచ్చియున్నారు. ఇది జగన్నాథస్వామిమాహాత్మ్యము కాఁబోలును. నేటిగంజినీళ్ళకాసపడి జాతికి శాశ్వతముగ అపకార మొనర్చు ఈఅధ్యాపకవాక్యములు ఆంధ్రులు తరతరములవఱకు జ్ఞప్తియందుంచుకొనగలరు. ఇదియు నొకరీతిచిరంజీవిత్వమేగదా!

**ఆంధ్రోత్కళ వివాదము : ఆంధ్ర స్త్రీల విన్నపము:—**

ఉత్కళరాష్ట్రవిచారణసంఘమువారికి ఆంధ్రస్త్రీల తరఫున శ్రీమతులు వరాహగిరి వేంకటసుబ్బమ్మ, పాకల సౌభాగ్యవతమ్మ, ఆదుర్తి లక్ష్మీబాయమ్మ, గంపా శివకాంతమ్మ, కొండా విజయలక్ష్మీబాయమ్మగార్లు తమకు గంజాముజిల్లాను ఓఢ్రదేశములో కలుపుట ఇష్టములేదని స్పష్టముచేసిరి. ఈరాయబారమునకు శ్రీమతి కొండా విజయలక్ష్మీబాయమ్మగారు నాయకురాలై యుండిరి. ఓఢ్రదేశములో ఘోషాపద్ధతి ప్రబలముగానున్నదనియు; ఆంధ్రస్త్రీలలో ఈపద్ధతి లేదనియు; ఆంధ్రస్త్రీలు ఓఢ్రస్త్రీలకన్నను అన్ని విషయములలోను అభివృద్ధిచెందియున్నారనియు; మదరాసురాజధాని ప్రభుత్వముక్రింద స్త్రీలకు సాంఘికముగను, రాజకీయముగను ఎక్కువ సౌకర్యములు, హక్కులుగలవనియు; స్త్రీలకొఱకు ప్రత్యేకముగ ఉన్నతవిద్యాలయములు, వైద్యవిద్యాలయములుకలవనియు; స్థానికసంస్థలలోను,

శాసనసభలోను స్త్రీలకు ప్రత్యేకప్రాతినిధ్యము కలదనియు; ఓఢ్రరాష్ట్రమునచేరుటచే తమకీ హక్కులన్నియు, ఈసౌకర్యములన్నియుపోవుననియు వారునొక్కిచెప్పిరి. దేశహితముకోరకు ఈవిన్నపమును సాగించిన ఈఆంధ్రస్త్రీరత్నములను గృహలక్ష్మి అభినందించుచున్నది.

**ఆంధ్రస్త్రీజనోద్యమాభివృద్ధిచరిత్ర:—**

ఆంధ్రదేశమునందలి స్త్రీజనోద్యమాభివృద్ధియొక్కచరిత్రను వ్రాయుటకు శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మగారు తలపెట్టిరనివినుటకు సంతసించుచున్నాము. ఈమె గృహలక్ష్మి పాఠకులకును, ఆంధ్రులకును చిరపరిచితురాలే. గృహలక్ష్మి ఈమెప్రశంస పలుసారులు చేసియున్నది. మంచివక్త, విద్యావతి, దేశహితైషిణి. ఈమెతల్లి రాజమహేంద్రవరమునందలి స్త్రీసమాజమునకు కార్యదర్శినిగను, రాజమండ్రి మునిసిపలుసంఘసభ్యురాలుగను ఉన్నారు. తల్లి, కూతుండ్రు తాము ఆంధ్రదేశమునందలి స్త్రీజనోద్యమాభివృద్ధికి నిదర్శనములై యున్నారు. అట్టివారిప్రాపున ఆస్త్రీజనోద్యమాభివృద్ధిచరిత్ర సమకూర్పబడుట సముచితముగనేయున్నది. స్త్రీజనోద్యమాభివృద్ధి నాకాంక్షించువారెల్ల శ్రీమతిగారికీవిషయమున చేదోడునువాదోడునుఅగుదురుగాకయని ఆశింతుము. ఆంధ్రదేశస్త్రీసంస్థలచరిత్ర, వానికిసంబంధించిన ఛాయాచిత్రములు ఈజనవరిమాసాంతములోపున శ్రీమతి కామేశ్వరమ్మగారిపేర రాజమహేంద్రవరమునకుపంపి ఆచరిత్రయొక్క త్వరప్రచురణమునకు వీలుకలిగింతురుగాకయని ఆయాసంస్థలకుచెందినవారిని ప్రార్థించుచున్నాము.

**వైద్యవిద్యార్థినుల ఉచితవేతనముల కోత:—**

వైద్యకళాశాలలోని విద్యార్థినుల స్టయిపెండ్సు రు. 50 నుంచి రు. 40 కోసివేయుటకు ఆర్డర్లుపుట్టినవని వినబడుచున్నది. పైగా పైసంవత్సరమునుండి స్కాలరుషిప్పులే తుడిచివేయబడునని ప్రకటింపబడినది. స్త్రీలలో వైద్యవిద్యాభిలాష ఇప్పుడిప్పుడే పొడసూపుచున్నది. ఆఅభిలాష చేయబడుచున్న ఈస్టయిపెండుల కోతతోడను, చేయబడనున్న ఆస్కాలరుషిప్పులతుడిచివేతతోడను అణగంటగలదు. ప్రజాహితశాఖలపై బడ్జటులో త్రుంచివేయుటకు గొడ్డలికి వాడి యెక్కువయగుచున్నది.

**లోకారాధ్యమైనవదాన్యత:—**

కారైకాల్‌నందలి వర్తకప్రముఖులగు మలయపెరుమాళ్‌గారు తమకాపురపుకాణాచియగు కారైకాల్‌పట్టణమున ప్రసూతివైద్యాలయమునునిర్మించుటకు ప్రభుత్వమువారికి ఒకలక్షరూప్యముల భూరివిరాళమునందజేసిరి. ఇట్టివదాన్యులెల్లవేళల లోకారాధ్యులగుదురుగదా!

**శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుచౌదరిగారి విశాలహృదయము:—**

పశ్చిమగోదావరిజిల్లా పెనుమంట్రబోర్డు హయ్యరుఎలిమెంటరీపాఠశాలాభవనమున డిసెంబరు 19-వ తేదీనిజరిగిన తణుకుతాలూకా ప్రాథమికవిద్యాసంఘపంచమవార్షికమహా

సభకు అధ్యక్షతవహించి సభను జయప్రదముగనిర్వహించి తాలూకాబోర్డుఅధ్యక్షులు, ఆంధ్రమహాశయులునుఅయిన శ్రీముళ్లపూడి తిమ్మరాజుచౌదరిగారు తమ అంత్యోపన్యాసమున సువర్ణపుష్పములవంటి ఈవాక్యములను చెప్పిరి: "పదుగురుబిడ్డలనుగన్నతల్లి పిల్లలందరికి భోజనముపెట్టి వారినసుముగూర్చుండి తానుఅనుభవించుఆనందముఎట్లుండునో నేను మీఅందరినసుమగూర్చుండి ఇష్టాగోష్ఠిగా మీకష్టసుఖములువిచారించుట నాకట్లున్నది." తెలుగుదేశమునందలి ప్రతితాలూకాబోర్డుఅధ్యక్షునకు, ప్రాథమికపాఠశాలోపాధ్యాయులకును ఇట్టితల్లిపిల్లన్యాయము ఏర్పడునేని ప్రాథమికవిద్య ప్రస్తుతముకంటె వేయిమడుంగులు అభివృద్ధిచెందగలదు. అధికారముగలదుఅను అహంకారమునువదలి కేవలము సౌజన్యమునకు మూర్తులై తమ విశాలహృదయమును, ఉదారస్వభావమును ఈవాక్యములమూలమున వెల్లడించి శ్రీచౌదరిగారు ప్రాథమికవిద్యాప్రచారకుల కృతజ్ఞతకు పాత్రులైనారు. వారికి మాఅభివాదములు. అధ్యక్షులు ఉపాధ్యాయులకు మాతృస్థానములగుటకు ప్రయత్నించువో ఉపాధ్యాయులు విద్యార్థులకు మాతృస్థానములగుటకు ప్రయత్నించితీరుదురు. అంతయు నడుపువారిలోనున్నది.

**కృష్ణాగోదావరిజిల్లాలలో రీసెటిల్మెంటు:—**

తుదకు అదనపుభూమిపన్నురేటును అమలులోనికి తెచ్చుటకే ప్రభుత్వమువారు నిశ్చయించిరి. విన్నపములు వినబడలేదు. విజ్ఞప్తులు జ్ఞప్తికిరాలేదు. ధరలుపడిపోయినవి. పంటలు సీటిముంపున పడిపోయినవి. ఇట్టిస్థితిలో రైతులపై అదనపుపన్ను పడినది. ఈపాట్లు తుదకు ఎట్లు పర్యవసితమగునో తెలియదు. అదనముగ వసూలుచేసినపన్నును ఆయాజిల్లాలయందే వెచ్చింపగలమని గవర్నరుగారు పలుకుచున్నారు. ఈజిల్లాలకు చిరకాలముగా చెంది ఉన్న ప్రభుత్వకళాశాలలను పీకివైచుటకు నిశ్చయించియుండి ఇకనేవో క్రొత్తసౌకర్యములను కలిగింతుమనుట ప్రజలలో నమ్మకమునుకలిగింపజాలదని భయపడుచున్నాము. ఈఅదనపుపన్నువసూలుకొలకు అర్జినెన్నునైన చేయుటకు ప్రభుత్వమువారు సంసిద్ధులైయున్నట్లు వారి ప్రకటనమే చెప్పుచున్నది.

**హితకారిణీసమాజమునకు పీఠికాపురాధీశునిపారితోషికము:—**

ఆంధ్రదేశమునందలి స్త్రీయుద్యమాభిమానులకందఱకును హితకారిణీసమాజము ఎఱుకకెక్కినదే. శ్రీవీరేశలింగముపంతులవారి ప్రజాహితసంస్థలనిర్వహణము ఆసమాజము వారి యాజమాన్యమున జరుగుచున్నది. ఇట్టి ప్రజాహితసంస్థ లెప్పుడును ధనలోపమున కొట్టుకాడుచుండుట మనఈబీదదేశమున ప్రత్యేకించి పేర్కొనదగినక్కఱలేనివిషయము. అట్టి ధనలోపము కలుగకుండచేయుటకు శ్రీపిఠాపురముమహారాజావారు ఈసమాజమువారికి మూడువేల ఆరువందలరూపాయిలను విరాళముగానిచ్చిరి. కడచిన డిసెంబరుమాసమునుండి నెలకు నూరురూపాయిలచొప్పున ఇచ్చుటకును వాగ్దానముచేసిరి. కానీ కాసుగానున్న

ఈకలువుదినములలో నిట్టివిరాళమునిచ్చి హితకారిణీసమాజమునకు పుష్టిగూర్చిన శ్రీ పిఠాపురము మహారాజావారి ఔదార్యమునకు ఆంధ్రస్త్రీజనోద్యమాభిమానులెల్లరు జయ వెట్టగలరు.

**ఆంధ్రసంఘసంస్కరణోద్యమము : అర్థశతాబ్దోత్సవము:—**

ఆంధ్రదేశప్రజాజీవితమున నవయుగమునకు పొడుపుచుక్కయైన శ్రీకందుకూరి వీరేశలింగము పంతులుగారు, వారిమిత్రులు 1881-వ సంవత్సరము డిసెంబరు 11-వ తేదీని ఆంధ్రదేశమున ప్రథమస్త్రీపునర్వివాహమును గావించిరి. 1931-వ సంవత్సరము డిసెంబరు 11-వ తేదీనాటికి ఏబదిసంవత్సరములు అయినది. ఆఅర్థశతాబ్దోత్సవము ఆతేదీని ఆవీరేశ లింగముపంతులుగారి కార్యక్షేత్రమగు రాజమహేంద్రవరమున శ్రీతుంపూడి భగవంతము గుప్తగారి యాజమాన్యమున జయప్రదముగ జరిగినది. అనాడు ఈయుద్యమమును బహుకష్ట ప్రయాసలకోర్చి ప్రారంభించి ప్రజలద్వేషమునకు గురియై రాళ్లదెబ్బలుతినియు చలింపక కృతకృత్యుడైన వీరేశలింగముగారి ధైర్యసాహసముల నొకపరిస్మరించి వీరపూజసల్పి రాజమహేంద్రవరపౌరులు తమవిధ్యుక్తధర్మమును నెఱవేర్చుకొనిరి.

**ఆంధ్రస్త్రీలకు ప్రత్యేకకళాశాల:—**

కావలయునని ఆంధ్రమహిళాసంఘమువారు శ్రీమతి వి. పద్మాసనమ్మ బి.యె.గారి నాయకత్వమున విద్యాశాఖామాత్యులగు గౌ.ది. బ. ఎస్. కుమారస్వామిరెడ్డిగారు గుంటూరు వచ్చినప్పుడు కోరియుండిరి. మంత్రిగారు బదులుగాచెప్పిన వాక్యములు ప్రోత్సాహ మును ఏమాత్రమును కలిగింపకున్నవి. ఆంధ్రపురుషులకు ఉత్తరసర్కారులలోఉన్న ఒక్క ప్రభుత్వకలాశాలను ఎత్తివేయుటకు వేచియున్న మదరాసుప్రభుత్వము ఆంధ్రస్త్రీలకొరక ప్రత్యేకకళాశాలను నిర్మింపబూనునా? పూనదు. పూనునను భయమేల పెట్టికొందురు?

**ఆరవ అఖిలభారతమహిళాసభ:—**

మద్రాసునగరమున సినేటుభవనమున జయప్రదముగజరిగినది. శ్రీమయూర్భంజి మహారాణీగారు కారణాంతరములచే రాకుండుటను వారిస్థానమున శ్రీమతి పి. కె. రాయి సతిగారు అధ్యక్షతవహించిరి. ఈసభావృత్తాంతములు పైమాసమున విస్తరింతుము.

**మహాత్ములు మరలివచ్చిరి:—**

గాలివిమానములు పూలవిమానములైనవి. దేశమాత ఆతనిరాకకొఱకు తపించి పోయినది. ప్రభుత్వమువారు ఆర్డినెన్సులపై ఆర్డినెన్సులను కురియించుచున్నారు. సరిహద్దు రాష్ట్రమున కాంగ్రెసుతిరిగి అశాస్త్రీయసంఘమైనది. సంయుక్తరాష్ట్రములు అట్టుడికిపోవు చున్నవి. వంగరాష్ట్రము నిర్బంధవిధానములో వంగటీయబడుచున్నది. ఆంధ్రదేశమున రీసెటిలుమెంటు ఒకపెద్దసమస్యఅయినది. ఈఅన్నివిషయములందును మహాత్ముని ఆలోచన వలయు. ఆతని ఇప్పటిరాక విశేషముగా వరణీయమైనదైనది.

# గ్రంథపరిచయము

**మన్నారుదాసవిలాసనాటకము:—**

యక్షగానము. ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితగ్రంథములలో నిది పందొమ్మిదవది. తంజావూరి ఆంధ్ర నాయకరాజాస్థానమలంకరించిన విదుషీరత్నములలో నొకతెయగు రంగాజమ్మ రచియించినది. ఇందుఁ గథానాయకుడు తంజాపురీనాయకుడగు విజయరాఘవనాయకుడు. గ్రంథమునకు ఆంధ్రసాహిత్యపరిషత్తు సంస్థాపనాచార్యులగు శ్రీజయంతి రామయ్యపంతులుగారు చక్కని పీఠిక వ్రాసియున్నారు. గ్రంథపఠనము వలన గ్రంథకర్త్రి విద్యావైదుష్యము వెల్లడియగును. అష్టభాషాకవిత్వము, రాజనీతి, జ్యోతిషము, పూజావిధానము, వ్యాకరణము ఈమెకు తెలిసియున్నవనుటకు గ్రంథముచాలియున్నది. నగరివారు ముహూర్తనిర్ణయము గావింపకోరినప్పటి బ్రాహ్మణులవాగ్వాదము, హారతిఇచ్చునప్పటి ముత్తైదువలమాటలు మొదలగునవి చక్కని హాస్యమును పోషించుచున్నవి. ఎఱుకతవర్ణనము మనోజ్ఞము. దేశచరిత్రపరిశోధనకును, భాషాచరిత్రపరిశోధనకునుపయోగించు ఈగ్రంథమును బ్రచురించి ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ఆంధ్రులకృతజ్ఞతకు పాత్రులైరి. ఈగ్రంథకర్త్రియగు రంగాజమ్మ ఈయక్షగానమునుగాక మన్నారుదాసవిలాసము, ఉషాపరిణయము ననురెండు ప్రబంధములుగూడ రచియించినట్లు ఆంధ్రగ్రంథపరిశోధకులకు శ్రీజయంతి రామయ్యపంతులుగారు పీఠికలో చెప్పుచున్నారు. ఆగ్రంథములనుగూడ యథావకాశమున బ్రచురించి ఆంధ్రస్త్రీవైదుష్యమునకు ప్రచారమిచ్చు భారము పరిషత్తువారువహించుట లెస్స. మన్నారుదాసవిలాసనాటకమును విరివిగ వెలకుతీసి ఆంధ్రు లీగ్రంథప్రచారమున పరిషత్తువారికి తోడుపడుదురని నమ్ముచున్నారము. రాయల్ సైజు 54 పుటలు. గ్లేజుకాగితములు. వెల రు 0—8—0. చిరునామా: ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ, తూర్పుగోదావరిజిల్లా.

**కథాసిధి:—**

ఇది శ్రీరాజా భావయమ్మారావు హైస్కూలు ఉపాధ్యాయులు కురుమెళ్ల వేంకటరావు, మాచిరాజు సీతాపతిరావుగార్లచే రచింపఁబడిన తొమ్మిదికథలుగలది. వెల 0—8—0. వలయువారు మాచిరాజు సీతాపతిరావుగారు R. Bh. R. హైస్కూలు, పిఠాపురము అని వ్రాయవలయును. ఇందుగల కథలలో సహగమనము అనుశీర్షికగలకథ హిందూదేశచరిత్రకు సంబంధించినది. హిందూసంఘసంస్కారణబీజములనదగు విషయముల బాలురస్మృతిపథమునకు గొనివచ్చుట కిట్టి కథలెంతయు నవసరములు. నిష్ఠ, భూతదయ, దాస్యవిమోచనము, సత్యము నను శీర్షికలుగలకథలు వరుసగ ప్రభావతి, రురుడు, గరుడుఁడు, విష్ణువు అనువారలను గూర్చిన భారతీయేతిహాసములు. ఈకథలశీర్షిక లాయాకథలవలన బాలుర్కు నేర్పదగినవీతులే పరిస్ఫుటమగునటుల చిత్రింపఁబడినవి. తక్కుంగలవి గ్రీసుదేశీయేతిహాససంచయమునుండి సంతరింపఁబడినగాథలు. ఆంధ్రదేశభాగమునగల పాఠశాలలలో 1, 2, ఫారముల బాలురకీగ్రంథము నాన్ డిటెయిల్డు పాఠగ్రంథముగ నుపయోగింప నర్హముగనున్నది.

—ఆ. వేంకటశాస్త్రి.

**సనత్సుజాతీయము:—**

రాజమహేంద్రవరమునందలి గవర్నమెంటు ఆర్ట్సుకాలేజి సీనియరు సంస్కృతాంధ్రపండితులుగ నుండిన కీ. శే. అకుండి వ్యాసమూర్తిశాస్త్రిలవారిచే రచియింపడిన శ్రీమదాంధ్రవ్యాసభారతనవనీతమునుండి గ్రహింపబడినది. కవిత్రయము వారి భారతమునకు శ్రీపాదవారి భారతమునకును నడుమరచియింపబడి నేటికిని అముద్రితమైయున్న వ్యాసభారతములోని ఈముద్రితశకలము దాని శైలియున్నగు విషయములను తెలుపజాలి

యున్నది. ఈశకలము తొలుత శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారిచే అక్షయ సంవత్సరపు భారతిలో ప్రచురింపబడి గ్రంథరూపమున తీయబడినది. వెల రు 0-6-0. గ్లేజుకాగితములు. డబుల్ క్రౌనుసైజున 8 పుటలు. దొరుకుచోటు: ఆకుండి వేంకటశాస్త్రి, శ్రీవ్యాసనికేతనము, ఆర్యాపురం, రాజమండ్రి.

**జ్ఞానదీపిక:—**

అనంతపురముజిల్లా ఉరవకొండబోర్డుహైస్కూలునందు నాంధ్రపండితులగు విద్వాన్ సాహిత్య సరస్వతి నూతలపాటి పేరరాజుగారిచే పెక్కుకోశములనుండి గ్రహితము. తెలుగు రిఫరెన్సుకు పనికివచ్చు పుస్తకము. ఆకృతియందు చిన్నదియేకాని ఉపయోగమునమిన్న. 'ఓపికమైం బెక్కుకోశములు పరికించి విషయ రత్నములసేకరించి సముచితరీతిని వానిని చక్కంగా నిం దలపరించి కవి ధన్యుడయ్యె' నను అభినవాంధ్రవాల్మీకి, కావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మగారి సమాలోచనవాక్యముతో మేము పూర్తిగ నేకీభవించుచున్నాము. విద్యార్థులకు దీనిఉపయోగము అనంతము. చిన్నసైజున కేబునందిముడుటకు అనువుగ చక్కనిగ్లేజుకాగితముల మీద ముద్రింపబడినది. వెల రు 0-6-0. 52 పుటలు. వలయువారు గ్రంథకర్తపేర వ్రాయునది.

**భక్తిపథము:—**

వాఙ్మయోల్లాసినీ గ్రంథమాల ఒకటవప్రసూనము. తెలుగున శృంగారవాఙ్మయమే కాని భక్తినిగూర్చిన వాఙ్మయమంతగా లేదు. అట్టియెడ ఈగ్రంథము—చిన్నదియేయగుగాక—ప్రోత్సహింపదగినదగుచున్నది. వేదోపనిషత్తులు, నారదశాండిల్యసూత్రములు, నాథముని శ్రీసూక్తి, లంబోదరజననీస్తవము, భక్తిరసామృత సింధువు, భక్తిసుధోదయము, భారతభాగవతభగవద్గీతలు, నందనారుచరిత్రము మొదలగు గ్రంథములనుండి ప్రమాణములకుతోడు Rev. Gibbon, Shakespeare, Bernard, Copping, St John మున్నగు పాశ్చాత్యుల ఆశయములను చేర్పబడుటచే విషయము గంభీరతదాల్చినది. రచనము ఉద్దీపనకారిగానున్నది. భాగవత వాత్సల్యము, భగవత్పూజయందనుమోదము, భగవదర్చన, భగవద్విషయమునం దదంభము, భగవత్కథాశ్రవణేచ్ఛ, సర్వనేత్రాంగవికారము, సదాభగవదనుస్మరణము, అమాంసభక్షణముఅను అష్టవిధభక్తుల నిర్వచింపగల వాక్యములతో; శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవ, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అను నవవిధభక్తిలక్షణముల సూచించు వాక్యములతో గ్రంథము ఒప్పారియున్నది. విశేష ప్రచారము నందదగుగ్రంథము. విద్యాభూషణ, కవిరత్న నరసింహాశర్మగారురచియించినది. చిన్నసైజు. గ్లేజు కాగితములు. 80 పుటలు. వెల 0-8-0. వలయువారు గ్రంథకర్తపేర మదనపల్లి వ్రాయునది.

**పురందరదాసులచరిత్ర:—**

సంగీతసారస్వతసేవలగావించి కన్నడమునుద్ధరించిన భక్తశ్రేష్ఠుడగువానిచరిత్ర. గ్రంథకర్త కృష్ణాజిల్లా రిజిష్ట్రారుగారగు మ-రా-శ్రీ ప్రొద్దుటూరి నరసింగరావుపంతులుగారు బి.యె. ఫూల్ స్కేప్ చిన్నసైజు. 18పుటలు. 1928-వ సంవత్సరమున బందరు హిందూముద్రాక్షరశాలయందు ముద్రితము. వెలతెలియదు.

**జీవధనరక్షణి:—**

చెన్నపట్టణపు అగ్రికల్చరల్ కాలేజి గ్రాడ్యుయేటును సివిల్ వెటర్నరిడిపార్టుమెంటు స్టేట్ స్టాక్ ఇన్స్పెక్టరునగు కీ॥ శే॥ జి. రంగయ్యనాయునిగారిచే రచియింపబడినది. గ్రంథమున గ్రంథకర్తగారి ఛాయా చిత్రము చేర్చబడినది. రైతుధనమగు పశువులవ్యాధులను గమనించుటకు, స్వదేశవస్తువులతో మందులుతయారు చేయుటకు, కొందరు మనుష్యులజబ్బులకు చికిత్సలు అనుభవముతోగూడినవి గలిగి ఈగ్రంథము అమూల్యమైన

దగుచున్నవి. పెక్కు గ్రంథములను పరిశోధించి వానిసారమిందు చేర్చి తెలుగుకైతుల కట్టిచక్కని గ్రంథమును కూర్చిన గ్రంథకర్తగారు స్తుతింపదగియున్నారు. అట్టి గ్రంథమును రెండవతూరి ముద్రించి తెలుగువారికందించిన జి. వి. చలపతిగారును కొనియాడదగియున్నారు. చక్కని గ్లేజుకాగితములమీద డెమ్మీసైజున ముద్రింపబడినది. 100 పుటలు. వెల రు 1—4—0. దొరుకుచోటు: శీవధవరత్నణిఆఫీసు, గూడూరు, నెల్లూరుజిల్లా.

**శివకేశవస్తోత్రమాల:—**

సంస్కృతాంధ్రపద్యములు. గ్రంథకర్త ప్రబంధకవి పంచానన నందగిరి వేంకటప్పారావుపంతులుగారు. ఈగ్రంథమునకు ప్రేరణకర్తలు అడ్డాడగ్రామాధికారియు, తాలూకాబోర్డుసభ్యులును, దేశభాషాభిమానులును అగు శ్రీ వీరపనేని బసవయ్యచౌదరిగారు. చిన్నసైజున 30 పుటలు. వలయువారు అణాబిళ్ల పంపినచో ఉచితముగ బడయగలరు. చిరునామా: శ్రీ ఉచితగ్రంథాలయము, అడ్డాడ, గుడివాడతాలూకా, కృష్ణాజిల్లా.

**బాలనీతిరత్నావళి:—**

గ్రంథకర్త, ప్రకాశకుఁడు చాగంటి వీరభద్రకవి. 102 కందపద్యముల సంపుటి. 4, 5 తరగతులలోని బాలురకు, బాలికలకు ఉద్దిష్టమైనది. పితృభక్తి, రాజభక్తి, దైవభక్తి మొదలగు సద్గుణములను; శ్రీరాముఁడు, బుద్ధుఁడు, హరిశ్చంద్రుఁడు మున్నగు మహాపురుషులను ప్రస్తుతించు పద్యములుగలవు. ఈపుస్తకము పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువారి ఆమోదముద్రనునందియుండుట లెస్సగ వేయున్నది. క్రౌనుసైజు. 20 పుటలు. గ్లేజుకాగితములు వెల 0—3—0. చిరునామా: చాగంటి వీరభద్రరావు, బాలభారతిస్కూలు, రాజమహేంద్రవరము.

**సీతాదేవిశతకము:—**

శ్రీరాయవరపు కొండలరావుపంతులు బాబుగారిచే రచియింపబడినది. ప్రథమముద్రణము ఎన్నడో ఖర్చుకాగా శ్రీబాబుగారి ధర్మపత్నియగు మహాలక్ష్మమ్మగారిచే ఇపుడు రెండవతూరి ప్రచురింపబడినది. ప్రథమముద్రణమునందలి అచ్చుతప్పులు మున్నగునవి ఈముద్రణమున కూరెళ్ళ అచ్చుత రామశాస్త్రిగారిచే సవరింపబడినవి. శ్రీదేవతాపరముగ సీసపద్యములలో చెప్పబడిన ఈశతకము ముముక్షువులకు, భక్తులకు మిక్కిలి ఉపయోగముగ నుండఁగలదు. డెమ్మీసైజు. గ్లేజుకాగితములు. వెల రు 0-8-0 అణాలు. గ్రంథప్రచురణకర్త్రిగారి పేర ఛత్రపురము వ్రాసిన గ్రంథముబడయఁగలరు.

**ఋణబాధ:—**

మొదటిభాగము. ఇది తూర్పుగోదావరిజిల్లా కాకినాడతాలూకా వేళంగిగ్రామకాపురస్తులు బ్రహ్మశ్రీ గుండు లక్ష్మణశాస్త్రిగారిచే రచియింపబడినది. 'ఋణమా! వేవేగ వచ్చేడుమా!' అనుమకుటముతో నలుబది మత్తేభములుగలవు. పద్యములు ధారాళముగ నడుచుచున్నవి. డెమ్మీసైజు 8 పుటలు వెల రు. 0-2-0 అణాలు.

**నిర్మలానందము:—**

నాటకము. కర్త శ్రీబులుసు వేంకటరమణయ్యగారు. కథపైకంటె ఇందలి ప్రౌఢశైలిపై చదువరులకు మనము లగ్నముకాగలదు. కథానాయకయగు నిర్మల మిక్కిలి ఆకర్షణీయముగ చిత్రింపబడినది. వలసినపుడు పురుషవేషమునుధరించి నిర్మలధైర్యమును గనబఱచినది. నిర్మలానందుల అన్యోన్యప్రేమ విమర్శనీయమైయున్నది. నాటకమున ఉపదేశముగలదు. అది సత్పథమును చూపజాలియున్నది. డెమ్మీసైజున 64 పుటలు. గ్రంథాలయములకును, విద్యార్థులకును రు. 0-6-0 అణాలు. ఇతరులకు రు. 0-8-0 అణాలు. వలయువారు బి. వేంకటరమణయ్యగారు, రామతీర్థము, (వయా) నెల్లిమర్ల, విశాఖపట్టణముజిల్లా అని వ్రాయవలెను.

**ఉషాపరిణయనాటకము:—**

బ్రహ్మశ్రీ గుండు రామస్వామిశాస్త్రిగారిచే రచింపఁబడి భాగవతి వాసుదేవదీక్షితులవారిచేతను, పేరి పేరయ్యశాస్త్రులవారిచేతను పరిష్కృతము. ఇది సంస్కృతభాషలో వ్రాయబడినవాటకము. సంస్కృత నాటకములు అరుదుగనే ప్రకటింపఁబడుచు, అరుదుగనే ప్రదర్శింపఁబడు నీయాధునికయుగమున మారెవ సూరన్న వీరన్నలను నిర్వురుచౌదరుల ద్రవ్యసహాయ్యమునచేసి ముద్రింపఁజేసిరి. ఇందు నీచపాత్రలకు ప్రాచీన సంస్కృతనాటకసాంప్రదాయానుసరణముగ ప్రాకృతభాష యుపయోగింపఁబడినది. ఇందలిభాష పలుచోట్ల సులభముగనేయున్నది. సంభాషణావసరముల పాత్రోచితమగుభాష ప్రయోగింపఁబడెది. ఇది కాకినాడ సరస్వతీముద్రాక్షరశాలలో తెలుగులిపి చిన్నఅచ్చులో ముద్రింపఁబడినది. వెల తెలుపఁబడలేదు. వలయు వారు గుండు రామస్వామిశాస్త్రిగారు, వేళంగిపోస్టు, కాకినాడతాలూకా, తూర్పుగోదావరిజిల్లా అని వ్రాయునది.

—అకుండి వేంకటశాస్త్రి,

**ఆత్మజ్యోతి:—**

ప్రపంచప్రఖ్యాతిగాంచినపురుషోత్తములలో నొకరగు టాల్‌స్టాయి ఋషిపుంగవుని నీతికథలలో నొకదాని కిది స్వేచ్ఛానుకరణము. 'మానవసేవయే మాధవసేవ'యను నీతినిబోధించు ఉత్తమగ్రంథము. మేలి రచనమున బడినది. 'కన్నులు కంచాలమీద, నోరు రామరామ; పుట్టించినవాడా పట్టించుకుపోరా; కాని వాడు లేని వానితో'జమ' యున్నగు సామెతలతో నీచిన్నికావ్యమునందలి శైలి జాతీయమైజానొందుచున్నది. బహుశగ్రంథకర్తలగు శ్రీకూచి నరసింహముపంతులుగారిచే సరిచూడబడినదగుటచే గ్రంథము నిర్దుష్టమై ఒప్పుచున్నది. తొలుత త్రిలింగపత్రికలో ప్రకటింపబడి పిమ్మట ఇపుడు చిన్నసైజున సుందరముగ పుస్తక రూపమున వెలయింపబడినది. గ్రంథకర్త ముద్దా విశ్వనాథముగారు. ఇట్టి గ్రంథములకు తమ ఆమోదముద్ర నిచ్చి విద్యార్థుల కరకమలముల కందించుటచే గ్రంథనిర్ణయసంఘమువారు విద్యార్థులను నీతివిద్యయందు అంకితులనుచేసినఔచిత్యమునకు పాల్పడుదురు. 138 పుటలు. వెల రు 0.4-6. ప్రకాశకులు: వ్యాసకుటీరము, మేలుపాక; యలమంచిలిదగ్గఱ, విశాఖపట్టణముజిల్లా.

**వికటకవిత్వచింతామణి:—**

ఆంధ్రసరస్వతీగ్రంథమాల ప్రథమకుసుమము. కర్తలు శ్రీ లేకుమళ్ళ రాజగోపాలరావుగారు బి.యె. ఇది వినోదముగ కాలక్షేపముచేయుటకు అనువైన గ్రంథము. అంకెలతోచేయగల విచిత్రములు, పదములతో విచిత్రములు, సమస్యలు, ప్రహేళికలు, గూఢార్థప్రతిపాదకములు, పొడుపుపద్యములు, వినోదశ్లోకములు, తిరుమలేకుని పద్యములు, తిట్టుపద్యములు ఇందు సంధానింపబడినవి. ప్రతిఒక్కరు ఒకప్రతి దగ్గరయుంచు కొనదగినది. క్రౌనుసైజున 64 పుటలు. వెల రు 0-6-0. వలయువారు గ్రంథకర్తపేర 124, వెల్లాలవీథి, పరశువాకము, వేపేరిపోస్టు, మద్రాసు అను చిరునామాకు వ్రాయవలయును.

**బార్డోలీవిజయము:—**

ఇది ఆంగ్లమున మహాదేవదేశాయిగారు రచియించినది. పల్లెటూరి గ్రంథమాలా సంస్థాపనాచార్యులును, దేశసేవానిరతులును అగు శ్రీ ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారిచే తెనుగున కనువదింపబడినది. భారతదేశస్వాతం త్రోద్యమ చరిత్రయందు బార్డోలీసత్యాగ్రహప్రకరణము రసవద్ఘట్టము కాగలదు. కనకనమందు అకలికి ఆహుతియగుచుండుగాక, మిన్నులువిఱిగి మీదనుబడుచుండుగాక భారతదేశపురైతు సహనశీలము గోలుపోవ డనియు, ఆదర్శమునుండి చ్యుతుడుకాడనియు బార్డోలీ ప్రత్యక్షీకరించినది. నేడు తెనుగురైతు ఈగ్రంథమును

చదివి సారస్యము గ్రహింపవలసిన అవసరమెంతేనిగలదు. సమయానుకూలమును, సంస్తవనీయమును అగు ఈగ్రంథమునకు అర్హాస్వాగతప్రచారములు కలుగునని నమ్మెదము. ఇందలి శార్లోటీస్త్రీల ప్రకరణమొక్కటియు-మఱియొకరియనువాదము—గృహలక్ష్మి ప్రచురించియున్నది. సమగ్రమగు గ్రంథమే ఇపుడు ఉపలబ్ధమైనదిగావున ఆంధ్రులెల్లరు తప్పక చదివెదరుగాకయని కోరెదము. క్రౌనుసైజున 376 పుటలు. పల్లెటూరి గ్రంథమాల చందాదారులకు వెల రు. 0-12-0 అణాలు. ఇతరులకు రు 1-0-0. వలయువారు పల్లెటూరి గ్రంథమాలా సంపాదకులగు గ్రంథకర్తగారి పేర పశ్చిమగోదావరిజిల్లా తణుకు వ్రాయునది.

## జ్ఞానాంజలి:—

గ్రంథకర్త పండిత పెనుమెచ్చ సత్యనారాయణరాజుగారు. ఆశుకవిత హానుగనుటకుతోడు అవధానంపుటభిరుచి సెలుంగుట; సంస్కృతకావ్యము లాంధ్రీకరించుటకుతోడు అచ్చతెలుఁగుప్రబంధము లల్లుట; ఖండకావ్యములుకల్పించుటకుతోడు చాటుపద్యములు చాటుట; చతుర్విధకవితల చతురతగనుటయేకాదు కావ్యమీమాంసలుగావించుట; ప్రకృతిగానముచేయుటయేకాదు వ్యాకరణమువాకొనుటయు-అన్నియునొక్కతావునసే. ఇన్నిరీతుల తెనుగును సేవించియు రాజుగారు తృప్తులుగారు. ఆత్మానందమునకై అకు అన్వేషణ ప్రారంభమైనది. ప్రస్తుతభారతాందోళనము ఆఅన్వేషణమునకు ఉత్సాహశక్తినిచ్చినది. వేమన్న గురువైనాడు. తెలుగువారికి జ్ఞానాంజలిదొరికినది. 'కలితదివ్యతేజ! తెలుగురాజ!' అను మకుటము. వేమన్నగారినుండి భావములనేగాక ఆటవెలదులవిన్నాణంపునడకనుగూడ రాజుగారు పుణికిపుచ్చుకున్నారు. కొన్నిగీతములు Lyrical. విశ్వశ్రేయమే ప్రధానముగాగల మనోజ్ఞమగు ఈజ్ఞానాంజలియొక్క పూర్వార్ధము మాత్రము చదువుటతో మాకు తృప్తిలేకున్నది. ఉత్తరార్ధమునకై అకు ఉవ్విళ్లూరుచున్నాము. 500 పద్యములుగల ఈపూర్వార్ధము క్రౌనుసైజున 80 పుటలు. వలయువారు గ్రంథకర్తగారి పేర పశ్చిమగోదావరిజిల్లా తణుకు వ్రాయునది.

## ఉపదేశామృతము:—

ప్రథమభాగము. శ్రీహరనాథఠాకూరువారి ఇంగ్లీషుగ్రంథమున కిది తెలుగుతర్జుమా. సుప్రసిద్ధవాఙ్మయసేవకులగు శ్రీ చింతా దీక్షితులుగారు తర్జుమాదారులు. ఆధునికభారతదేశమున వెలయించిన మతజీవులలో హరనాథబాబాగారొకరు. వారు శ్రీగౌరంగస్వామిగారి అవతారములని వారిశిష్యుల భావన. శ్రీవారి ఉపదేశములకు పునాదిరాయి భక్తి. గ్రంథమున శ్రీవారిజీవితము చేర్పబడినది. వారు మృతులై పునర్జీవితులగుటకు, క్షయరోగమును ధిక్కరించుటకు, పాముకరచినను బ్రతుకుటకు, పెద్దపులిబారినిబడినను తప్పించుకొనుటకును భక్తియేకారణమని వారు అనుభవపూర్వకముగ ఉపదేశించియున్నారు. ఉపదేశామృతమును చదువుచుండగా మాకుగలిగిన ఉన్నతభావానందమునకు పారములేకుండెను. మఱియు నిది ముఖ్యముగా స్త్రీలు చదువవలసియున్నది. 'లోకంలోఉండే స్త్రీఉపాధులన్నీ మహాశక్తిఅంశలే' అను వాక్యమున కిందు విపులీకరణముగలదు. స్త్రీని ఉత్తమపత్నిగను, ఉత్తమమాతగను చేయుటకు ఈఉపదేశములు చాలియున్నవి. సులభశైలిలో దీక్షితులుగారు దీక్షితులు. కావున ఈగ్రంథము అందరి అందుబడిలోనికి వచ్చువదిగానున్నది. క్రౌనుసైజు. గ్లేజుకాగితములు. వెల రు 0-8-0. వలయువారు పి. ఆర్. దాస్, శ్రీహరనాథతత్వప్రచారిణీసభ, ఆంధ్రబ్రాంచి, సూర్యారావుపేట, కాకినాడ.

## ప్రభుత్వధనము: మనబీదతనము:—

కళాశాలలయందు పల్లికుస్తైనాన్సుకు ఫిండ్లేషిరాస్ గారిపుస్తకములే ఉంచబడుచున్నవి. అవి జాతీయదృష్టితో వ్రాయబడినవికావు. ప్రభుత్వపుదృష్టితో ప్రస్తరింపబడినవి. అహమ్మదాబాదునందలి గుజరాతు

విద్యాపీఠాధ్యాపకులగు శ్రీ కుమారప్పగారి **Public Finance and Our Poverty** అను గ్రంథమును చదువుట తోడనే కళాశాలల్లో ప్రిన్సిపాల్ గారినుండి మేము నేర్చిన అనేకదురభిప్రాయములను తొలగించుకొని నిజస్థితిని తెలిసికొనగలిగితిమి. శ్రీ కుమారప్పగారి ఈగ్రంథమును ఆంధ్రమునకనువదించుట ముఖ్యావసరమను తలంపు గలిగెను. పల్లెటూరుపత్రికను నడిపినవారును, గ్రామపునరుద్ధరణోద్యమమున శ్రద్ధాసక్తులైయున్నవారును, దేశసేవానిరతులును అయిన శనివారపు సుబ్బారావుగారు తమమిత్రులు బాలాంత్రపు సత్యనారాయణరావు గారితో కలిసి దీని ననువదించి ఆంధ్రుల కర్పించియున్నారు. ప్రభుత్వమువారి ఆర్థికవిధానము భారతదౌర్భాగ్యమునకు హేతువైనరీతి ఇందు చక్కగ వివరింపబడినది. జాతీయపునరుద్ధరణదీక్షాదినములలో ఇట్టి జాతీయ గ్రంథముల ప్రచురణము ప్రోత్సహింపబడగినది. గ్రంథము క్రౌనుసైజున 200 పుటలు. సుందరముద్రణము. వెల రు 0-10-0. మాతృకకు మహాత్ములు ప్రస్తావికవ్రాసియున్నారు. అనువాదితగ్రంథమున ఆప్రస్తావికయు అనువదింపబడినది. జాతీయగ్రంథమాల, పిఠాపురము, తూర్పుగోదావరిజిల్లా అనివ్రాసిన బడయగలరు.

**దేవీ జోన్:—**

ఆదర్శగ్రంథమాలలో ద్వితీయపుష్పము. నవయుగ పత్రికాసంపాదకులును, ఆర్యయువకసంఘాధ్యక్షులును నగు శ్రీ గద్దె లింగయ్యచౌదరిగారిచే రచియింపబడినది. విఖ్యాతవీరనారీమణియగు జోన్ ఆఫ్ ఆర్కు జీవితము. ఈమె జీవితము సంక్షిప్తముగ గృహలక్ష్మిలో ఈవఱకు ప్రకటించియున్నాము. ఈగ్రంథమున ఈమె జీవితము విపులముగగలదు. జోన్ చరిత్రనిజముగ అద్భుతావహము. ఈమె ఈశ్వరాంశాసంభూతురాలనుటకు సందియము లేదు. ఈమెయందలి ఆదర్శగుణములగు దైవభక్తి, దేశభక్తి, స్వాతంత్ర్యవాంఛ, త్యాగదీక్ష ఈగ్రంథమున ఉత్సాహోద్దీపితమగు శైలియందు విస్తరింపబడినవి. స్త్రీశక్తికి చక్కనితార్కాణమైన జోన్ జీవితము స్త్రీలకెల్లరకు అవశ్యపఠనీయమైనది. అక్షరాస్యయగు ప్రతియాంధ్రస్త్రీయు సొంతగ్రంథసముచ్చయమున చేర్చికొనవలసిన గ్రంథములలోనిది యొకటియని మేముగట్టిగ చెప్పగలము. గ్రంథకర్తగారి కిది ప్రథమ ప్రయత్నమైనను శైలి విషయమునకు తగియున్నది. గ్రంథకర్తగారిదియు, జోన్ ఆఫ్ ఆర్కుదియు చిత్రములు గ్రంథమునకు శోభగూర్చినవి. ఫెదరువెయిటు కాగితములు. చక్కని ముద్రణము. క్రౌనుసైజు. 112 పుటలు. వెల చందాదారులకు రు. 0-10-0. ఇతరులకు రు. 0-14-0. చిరునామా: ఆదర్శగ్రంథమండలి, ఎలమఱ్ఱు, కృష్ణాజిల్లా.

**ఆరంభ వ్యాకరణము:—**

మొదటిభాగము. చిన్నతరగతులకు ఉద్దిష్టమైనది. ఆకుండి వరబ్రహ్మశాస్త్రి వ్యాసశర్మలచే రచియింపబడినది. వ్యాకరణము బోధించుటయు కష్టమే. నేర్చుటయు కష్టమే. ఈకష్టమునకు కొంతవఱకు విషయము కారణమైనను చాలవఱకు మనవారి వ్యాకరణరచనావిధానమే కారణమైయున్నదనుట సత్యము. కాని మన విమర్శనకు పాల్పడిన ఈవ్యాకరణము క్రొత్తపద్ధతిని సులభమార్గమున వ్రాయబడినది. గజిబిజిచేయు సూత్రములులేవు. కలవరపెట్టు పారిభాషికపదములులేవు. దురవగాహమును, దుర్బోధమునునగు వ్యాకరణమును తమ సులలితవాక్కులచే గ్రంథకర్తలు సుగమముచేసియున్నారు. పలువురు పండితులు శ్లాఘించియున్నారు. ప్రచురింపబడిన కొలదికాలమునకే రెండవకూర్పువచ్చుటచే గ్రంథప్రాశస్త్యము ఊహింపవచ్చును. క్రౌనుసైజు. గ్లేజు కాగితములు. 88 పుటలు. వెల రు 0-6-0 అణాలు. చిరునామా: ఎ. వరబ్రహ్మశాస్త్రి, తెలుగులెక్చరర్, లయోలాకళాశాల, మద్రాసు.

---

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.